మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

అక్టోబర్ - డిసెంబర్, 2007

జనవరి - మార్చి, 2008

Rally



ప్రపంచీకరణను ప్రతిఘటిద్దాం

లౌకిక వాదాన్ని కాపాడుదాం

సమానత్వాన్ని సాధిద్దాం

at 3 pm





# ఐద్వా 8వ జాతీయ మహాసభల చిత్రమాలిక



జెండావిష్కరణతో మహాసభలను ప్రారంభిస్తున్న సుభాషిణీ ఆలీ



ప్రతినిధులనుద్దేశించి మాట్లాడుతున్న ప్రత్యేక అతిథి కా॥ జ్యోతిబసు




సభా వేదిక



బహిరంగ సభావేదిక



ఎ.పి. రిపోర్ట్‌ను ప్రవేశపెడుతున్న వి.అనీల



ఉద్యమంతో పెనవేసుకున్న తల్లి కూతుళ్ళు
పాపా ఉమానాథ్, వాసుకి

# అణు ఒప్పందం

## సంపాదకీయం... -

భారత్, అమెరికాల అణు ఒప్పందం వలన అనేక ప్రయోజనాలు కలుగుతాయంటూ కాంగ్రెసు పార్టీ, దాని మిత్రులు గ్లోబల్ ప్రచారం చేస్తున్నారు. దీని మీద దేశ వ్యాపితంగా చర్చ జరుగుతున్నది. లోక్‌సభలో 7 గంటలపాటు జరిగిన చర్చ ఒప్పందంపై తీవ్ర వ్యతిరేకత వ్యక్తమైంది. ఒప్పందంలో మన దేశ సార్వభౌమత్వానికి నష్టదాయకమైన అంశాలు చాలా వున్నాయని అణు ఒప్పందం అమలును నిలిపి వేయాలని వామపక్షాలు డిమాండ్ చేస్తున్నాయి.

అణు ఒప్పందాన్ని రెండు దేశాల మధ్య ద్వైపాక్షిక ఒప్పందంగా కాక ప్రపంచీకరణ దృష్టితో చూడాలి. పౌర అవసరాలకు అణు ఒప్పందం ఏ దేశంతో చేసుకున్నా అమెరికా ఆ దేశ ఒప్పందం అమలులో ఉన్న కాలంలో ఏ తరహా అణ్వస్త్ర పరీక్షలు చేయరాదన్న ఆంక్షలు పెడుతుంది. కానీ భారత్‌తో చేసుకున్న ఒప్పంద విషయంలో అలాంటి షరతుల్లేవని అణు ఒప్పంద అనుకూలవాదులు చెబుతున్నారు. సామ్రాజ్యవాద దేశమైన అమెరికా భారత్‌పట్ల ఎందుకింత ఔదార్యం చూపుతుంది? 123 ఒప్పందం వల్లమనకు ఒక మెగావాట్ విద్యుత్ కూడా లభ్యం కాదు. ఈ ఒప్పందం వలన అణు రియాక్టర్లు, యురేనియం దిగుమతి చేసుకోవాలి. రియాక్టర్లతో అణు విద్యుత్ కేంద్రాలను నెలకొల్పాలంటే భారీ పెట్టుబడులు పెట్టాలి. దీనికోసం ఆరోగ్యం,విద్యమౌలిక సదుపాయాల నుండి నిధులు మళ్లించాల్సి వస్తుంది.

విద్యుత్ రంగంలో భారత్ తీవ్ర కొరతను ఎదుర్కొంటోంది. సాంప్రదాయక థర్మల్ (బొగ్గు ఆధారిత) హైడల్ (జల ఆధారిత) మరెంతో కాలం రావని భారత్ ఆందోళ పడుతోంది.2050 నాటికి బొగ్గునిల్వలు అయిపోతాయని చెపుతోంది. కాని మన దేశంలో వందలకోట్ల టన్నుల బొగ్గు నిల్వలు వున్నాయి. అయితే దీనిని తవ్వి తీయవల్సి వుంది. బొగ్గును కనుగొన్న ప్రాంతాలలో కేవలం 50శాతాన్ని మాత్రమే మనం ఉపయోగించుకున్నాం. బొగ్గును తవ్వితీయటంలో ఇప్పటికీ పురాతన పద్ధతులనే ఉపయోగిస్తున్నాం. దీనివలన బొగ్గు వృధా అవుతూంది. మరిన్ని బొగ్గు నిక్షేపాలు కనుగొనటానికి లేదా ఆధునిక పద్ధతులలో తవ్వటానికి అయ్యేఖర్చు రియాక్టర్లు కొనుగోలు కన్నా చాలా తక్కువ.

అణు ఒప్పందం హైడ్ చట్టం పర్యవసానాలపై యుపిఎ, వామపక్షాలు పలుదఫాలు ఆ కమిటీ చర్చలు జరిపింది. ఈ కమిటీ ఆమోదిస్తేనే ఐఎఇఎతో ప్రమాణాల ఒప్పందం ఖరారు చేస్తామని ప్రభుత్వం హామీ యిచ్చిన మీదటనే అంతర్జాతీయ అణుశక్తి సంస్థ (ఐ.ఎ.ఇ.ఎ.)తో చర్చలకు అనుమతించడం జరిగింది.

అమెరికాతో అణు ఒప్పందం అణు విద్యుచ్ఛక్తి పెంపుదలకు దోహదకారి అవుతున్నదని ప్రభుత్వం చెపుతున్నప్పటికీ హైడ్‌చట్టం దీని వెనుకవున్న అమెరికా ఉద్దేశ్యాలను వెల్లడి చేస్తున్నది. భారత్ గనుక అణు పరీక్ష జరిపితే ఒప్పందాన్ని రద్దు చేసుకోవాలని, భారత్‌కి విక్రయించిన అణుశక్తి రియాక్టర్లు వగైరా వెనక్కు తీసుకోవాలని హైడ్ చట్టం ఆదేశిస్తున్నది. ఇరాన్ వంటి వివాదాల్లో భారత్ గనుక అమెరికాను బలపరచకపోతే ఏమి జరుగుతుందో హైడ్ చట్టం ఆదేశిస్తున్నది. మన దేశం వారి ఆదేశాలు శిరసావహిస్తూ ఉండాలి.

అలీనోద్యమ నేతగా అంతర్జాతీయ వ్యవహారాల్లో వర్ధమాన దేశాల ప్రయోజనాల కొరకు స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకునే హక్కును కోల్పోతాం. మన దేశంలో అణు ఇంధనం కొరతను అధిగమించేందుకు యురేనియం నిల్వల మీద కాకుండా థోరియం మీద ఆధారపడే సాంకేతిక పరిజ్ఞానాన్ని సమకూర్చుకోవాలని భారత్ అణు పితామహుడు హోమీ బాబా పేర్కొన్నారు. థర్మల్, జల విద్యుత్‌లతో పోలిస్తే అణు విద్యుత్ ఖర్చు ఎక్కువ. అణు విద్యుత్ కన్నా చౌకైన ప్రత్యామ్నాయాలు చూడాలి. జల విద్యుత్ వనరులు వుపయోగించటం, బొగ్గు వనరులు వున్న ప్రాంతాలను గుర్తించి థర్మల్ విద్యుత్ కేంద్రాలను ఏర్పాటు చేయాలని వామపక్షాలు, మేధావులు,శాస్త్రవేత్తలు పట్టుబడుతున్నారు. ఈ ప్రత్యామ్నాయాలను పరిశీలిస్తే అమెరికా విషకౌగిలిలోకి మనం పోనవసరంలేదు.






ఈ సంచికలో...




అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం
1-8-538/4, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20.
ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు
ఎస్. పుణ్యవతి

మేనేజర్
ఎం. సుధ

సంపాదక వర్గం
మల్లు స్వరాజ్యం
అల్లూరి మన్మోహిని
టి. జ్యోతి
కె. స్వరూపరాణి

విరాళం రూ : 5/-

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్‌ప్రెస్, ముషీరాబాద్,
హైదరాబాద్ - 500 020





# నింగి సంగం నేల సంగం

పల్లవి : నింగిసగం నేల సగం - మనదేనంది
కష్టాలను కడగండ్లను ఎదుర్కొమ్మంది
ఐద్వా - మన ఐద్వా - ఐద్వా-మన ఐద్వా
చరణం : ఎన్నో మహాసభలు జరుపుతోంది భరతావనిలో
భరతదేశ ప్రజల భాగ్యము ఇది- భరతావనిలో
ఒడుదుడుకులు తట్టుకుంటూ ఎదుగుతున్నది
ఎదిగి ఇంతింతై వటుడింతై నింగికెదిగెనే ॥ఐద్వా॥
ఎన్నో కుటుంబాల కలతలనే - కడతేర్చింది
వనితల కొరకు న్యాయ దేవతయ్యింది
సంకురాత్రి సంబరాల సందడయ్యింది
సందెకాంతి వెలుగులలో దీపమయ్యింది ॥ఐద్వా॥
ఉద్యమాల ఊపిరులే వీరవనితని
పోరాటాలే నడిపిన ధీర వనితని
తుపాకినే ఎక్కుపెట్టి రజాకార్ల తరిమికొట్టి
ఎట్టిచాకిరి మట్టుపెట్టి - నైజాంనే మట్టికరిపి
ఆడదంటే అబల కాదు - ఐద్వా అని చాటింది ॥ఐద్వా॥
మహిళలందరూ ఏకమై కదలాలంది
సమస్యలను పారద్రోలి నిలవాలంది
కులమతాల ఆచారపు - కుళ్ళునంత క్రూలద్రోసి
సమసమాజ స్థాపనలో సగభాగం మనమేనని
సమానతను చాటిచెప్పి నిలవాలంది

- చల్లా లీలావతి

# మహిళా ఉద్యమానికి దిక్సూచి

- టి. జ్యోతి

ప్రపంచీకరణను ప్రతిఘటిద్దాం!
లౌకికవాదాన్ని పరిరక్షించు కుందాం!!
సమానత్వాన్ని సాధించు కుందాం!!!

ఇదీ అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఎనిమిదో జాతీయ మహాసభ పిలుపు. దేశవ్యాప్తంగా కోటి ఎనభై వేల మహిళా సభ్యత్వం గల ఐద్వా జాతీయ మహాసభలు కనక ముఖర్జీ నగర్‌లో(సాల్ట్ లేక్ స్టేడియమ్) ఈవా మెహతా ప్రాంగణంలో నాలుగు రోజులపాటు అత్యంత ఉత్సాహపూరితంగా జరిగాయి. రాబోయే కాలంలో మహిళా ఉద్యమానికి దిశా నిర్దేశం చేశాయి. ఐద్వా ఏర్పడిన నాటి నుండి నేటి వరకు సాగిన ఈ పాతికేళ్ల ప్రస్థానంలో వివిధ మహిళా సమస్యలపై నిర్వహించిన పోరాటాలతో మమేకమైన బృందాకరత్ ఈ మహాసభలో ప్రారంభోపన్యాసం చేశారు. "స్వాతం త్ర్యోద్యమ కాలంలో ఆవిర్భవించిన మహిళా ఉద్యమం నుంచే ఐద్వా అవత రించింది. నాటి నుండి నేటి వరకు అది అనేక సమస్యలపై నికరంగా పోరాడుతూ వస్తున్నది. నేడు సామ్రాజ్య వాదం ప్రపంచం మొత్తాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకోవడానికి, మార్కెట్‌ను విస్తరించుకోవడానికి ప్రయత్నిస్తోంది. సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొనేందుకు మహిళా ఉద్యమం మరోసారి నడుం బిగించాలి. వామపక్ష ప్రభుత్వాలను, లౌకిక వాద శక్తులను బలోపేతం చేయడం, శక్తివంతమైన సమరశీల ఉద్యమాలను నిర్మించడం, స్వతంత్ర ఉద్యమాలతోపాటు ఐక్య ఉద్యమాలను నిర్మించడం ద్వారా ఐద్వా తన గమ్యాన్ని చేరుకోగలదన్న" ఆశాభావాన్ని ఆమె వ్యక్తం చేశారు.

పాపా ఉమానాథ్, మంజరి గుప్తాతోపాటు మహిళా ఉద్యమ ంతో మమేకమైన తొలితరం మహిళా నాయకులు, అనారోగ్య పరిస్థితులను లెక్కచేయకుండా మహాసభకు తరలి రావడం ప్రతినిధుల్లో ఉత్తేజంతోపాటు సంఘం పట్ల నిబద్ధతను పెంచాయి.

మహాసభ ప్రారంభ సభకు హాజరైన సీనియర్ కమ్యూనిస్టు నాయకులు జ్యోతిబసు తాను కమ్యూనిస్టు ఉద్యమంలోకి ప్రవేశిం చిన నాటి జ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ నేడు మహిళా ఉద్యమం ముందున్న సవాళ్ళను గుర్తు చేశారు. స్ఫూర్తిదాయకమైన ప్రసంగం తో మహిళా కార్యకర్తలను ఆయన కార్యోన్ముఖులను చేశారు. "బెంగాల్ వామపక్ష ప్రభుత్వం మహిళాభ్యున్నతి కోసం తీసుకున్న చర్యలు, భూసంస్కరణలు, ఉమ్మడి పట్టాలు, స్థానిక సంస్థల్లో రిజర్వేషన్లు, వ్యవసాయోత్పత్తిలో సాధించిన ప్రగతి గురించి వివరిం చారు. బెంగాల్‌లో స్వయం సహాయ సంఘాల అభివృద్ధి కోసం మిగతా రాష్ట్ర ప్రభుత్వాలకు భిన్నంగా వామపక్ష ప్రభుత్వం ప్రత్యేకం గా ఒక శాఖను ఏర్పాటు చేసిందన్నారు. బెంగాల్లో స్థానిక సంస్థల్లో 42 శాతం మంది మహిళలు ప్రజా ప్రతినిధులుగా వున్నారని, మహిళా ఉద్యమం రాజకీయాల్లో క్రియాశీలక పాత్ర పోషించాల్సి వుందన్నారు. నూతన ఆర్థిక విధానాల ఫలితంగా పెరుగుతున్న అసంఘటిత రంగం పట్ల, మరీ ముఖ్యంగా మహిళా శ్రామికుల స్థితిగతులపట్ల ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. పడిపోతున్న లింగ నిష్పత్తి, పెరుగుతున్న గృహహింస, వరకట్న సమస్య, మహిళలపై పెరుగుతున్న శ్రమ దోపిడీ వంటి సమస్యలపై ఐద్వా రానున్న కాలంలో మరింత కేంద్రీకరించి పనిచేయాలని పిలుపునిచ్చారు.



## వెల్లువెత్తిన భూపోరాట స్ఫూర్తి

ఆంధ్ర ప్రదేశ్‌లో గత 6 నెలలుగా సాగుతున్న భూ పోరాటం, అందులో పెద్ద సంఖ్యలో మహిళలు పాల్గొంటున్న తీరు, ప్రభుత్వం ఎంతగా నిర్బంధాన్ని ప్రయోగించినా లెక్కచేయకుండా ముందుకు సాగుతున్న తీరు ప్రతినిధులను ఎంతగానో ఉత్తేజపరిచాయి. ఖమ్మం జిల్లా ముదిగొండ కాల్పుల్లో భర్తను కోల్పోయిన ఉష బిడ్డనెత్తుకొని వేదిక ఎక్కి కాల్పులు జరిగిన రోజు పోలీసుల, ప్రభుత్వ పైశాచికత్వాన్ని వివరిస్తున్నపుడు ప్రతినిధులు కంటతడి పెట్టడంతోపాటు సభా ప్రాంగణమంతా నిశ్శబ్ద వాతావరణం నెలకొంది. ఎన్ని కష్టాలు, నష్టాలు ఎదురైనా తాను, తనతోపాటు చనిపోయిన వారి కుటుంబ సభ్యులు పేదలందరికీ భూమి దక్కే వరకు పోరాడతామని, ఎంతటి త్యాగానికైనా సిద్ధమని చెప్పినపుడు సభ మొత్తం భూ పోరాట నినాదాలతో మార్మోగింది. "భూ పోరాటంలో మహిళలపై సాగుతున్న రాజ్య హింస" కు సంబంధించి ఎ.పి. కమిటీ మహాసభ ప్రాంగణంలో ఏర్పాటు చేసిన ఫోటో ఎగ్జిబిషన్‌ను ప్రతినిధులతోపాటు అనేకమంది అత్యంత ఆసక్తికరంగా తిలకించారు.

## చర్చల్లో పరిణతి

ఐద్వా జాతీయ ప్రధాన కార్యదర్శి సుధా సుందరరామన్ ప్రస్తుత అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులతోపాటు నిర్మాణ నివేదికను ప్రవేశపెట్టారు. ప్రపంచ వనరులు, మార్కెట్‌పై తన పెత్తనాన్ని పెంచుకునేందుకు అమెరికన్ సామ్రాజ్యవాదం ఎలా ప్రయత్నిస్తున్నదీ ఆ నివేదిక వివరించింది. ప్రపంచీకరణవిధానాలు మహిళలపై చూపుతున్న దుష్పరిణామాలు, అసంఘటిత రంగంలో మహిళలపై పెరుగుతున్న శ్రమ దోపిడీ, పేదరికం, నిరుద్యోగం, సామాజిక అంతరాల గురించి ఆ నివేదిక ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లపై అమెరికా సాగించిన దురాక్రమణ పూరిత దాడులు, పాలస్తీనాపైకి ఇజ్రాయిల్‌ను ఎగదోయడం, ఇరాన్‌పై ఆంక్షలు వీటన్నిటి వల్ల అత్యధిక సంఖ్యలో మహిళలు, పిల్లలు పడుతున్న ఇబ్బందుల గురించి పేర్కొంది.లాటిన్ అమెరికా దేశాలలో జరిగిన ప్రధానమైన రాజకీయ మార్పులు, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాల్లో అమెరికా పెత్తనాన్ని వారు ఎదిరిస్తున్న తీరు గురించి వివరిస్తున్నపుడు సభలో ఆనందం వెల్లివిరిసింది.

యు.పి.ఎ. ప్రభుత్వ ఆర్థిక విధానాలు పేదలను మరింత నిరుపేదలుగాను, సంపన్నులను మరింత సంపన్నులగాను ఎలా మార్చినదీ కార్యదర్శి నివేదిక సోదాహరణంగా వివరించింది. ఉగ్రవాదం, పని ప్రదేశాల్లో లైంగిక వేధింపులు, అంగన్‌వాడీ కార్మికుల శ్రమ దోపిడి, పెరుగుతున్న గౌరవ హత్యలు, రాజ్య హింస, మతోన్మాదం, మైక్రో ఫైనాన్స్ సంస్థల వేధింపులు, గృహ హింస అంతకంతకు పెరుగుతుండడంపై ఆందోళన వ్యక్తం చేసింది. 1/3 మహిళా రిజర్వేషన్ బిల్లు, స్వయం సహాయక గ్రూపులు, పెరుగుతున్న ధరలు, ఆహార భద్రత తదితర అంశాలను ప్రస్తావిస్తూ వాటిపై పోరాటాన్ని ఉధృతం చేయాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పింది. కోటికి పైగా ఉన్న ప్రస్తుత సభ్యత్వాన్ని వచ్చే మహాసభ నాటికి 3 కోట్లకు పెంచుకోవాలని, నిర్మాణాన్ని పటిష్ట పరుచుకొని అన్ని రాష్ట్ర కేంద్రాలను బలోపేతం చేయాలని, కార్యకర్తల సంఖ్యను పెంచుకొని యూనిట్ స్థాయి కమిటీలను పని చేయించడం ద్వారా ప్రజలతో మరింతగా మమేకం కావాలని మహా సభ పిలుపునిచ్చింది. 22 రాష్ట్రాలకు చెందిన ప్రతినిధులు ఈ నివేదికపై జరిగిన చర్చల్లో పాల్గొన్నారు. ధరలపై ప్రభుత్వ నియంత్రణ లేకపోవడం వల్ల ఆహార భద్రత హక్కును కాలరాయడం, రేషన్ కోత, నాణ్యత లేకపోవడం మొదలగు వాటివల్ల మొదటి బాధితులుగా మహిళలు వుంటున్నారని కర్నాటక, ఒరిస్సా, యుపి, బీహార్ లతోసహా అన్ని రాష్ట్రాల ప్రతినిధులు తీవ్ర ఆందోళన వ్యక్తం చేశారు. కేంద్ర ప్రభుత్వ విధానాల వల్ల వ్యవసాయం సంక్షోభంలో పడిందని, మహిళల వలసలు పెరిగాయని అతి తక్కువ వేతనాలకు పని చేయాల్సి వస్తుందని, కనీస వేతనాలు డిమాండ్ చేస్తూ ఉద్యమాన్ని విస్తృతం చెయ్యాల్సిన అవసరాన్ని మహారాష్ట్ర, కేరళ, చత్తీస్‌ఘర్ తదితర రాష్ట్రాల నుండి హాజరైన ప్రతినిధులు తెలియజేశారు. మధ్య ప్రదేశ్, రాజస్థాన్‌లలో మతోన్మాదాన్ని పెంచేదిశగా ప్రభుత్వ పథకాలు, చర్యలు ఎలా వున్నవీ ఆయా రాష్ట్రాల ప్రతినిధులు వివరించారు. ఐసిడిఎస్‌కు నిధుల కేటాయింపు పెంచాలని, అంగన్‌వాడీ వర్కర్లను, హెల్పర్లను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించాలని ఒరిస్సా, జార్ఖండ్, యుపి తదితర రాష్ట్రాల ప్రతినిధులు కోరారు. ఎ.పి. నుండి హాజరైన ప్రతినిధులు కాల్ సెంటర్లలో ఉద్యోగినులకు రక్షణలేని పరిస్థితి, స్వయం సహాయ గ్రూపులకు ప్రభుత్వం నుండి తీసుకోవలసిన చర్యలు, మద్యానికి సంబంధించి బెల్టు షాపుల విస్తరణ వల్ల ముఖ్యంగా గ్రామీణ జీవనం విచ్ఛిన్నమవుతున్న తీరును వివరించారు. ఈ చర్చల సారాంశమేమిటంటే ప్రజల మధ్య చిచ్చు పెడుతున్న కాషాయ రాజకీయాలకు చరమ గీతం పాడాలని, మద్యం మహమ్మారిని పారదోలాలని, అధిక ధరలకు కళ్లెం వేసి, నిర్వీర్యమైన ప్రజాపంపిణీ వ్యవస్థను పటిష్ట పరచాలని కోరుతూ ఉద్యమించాలని మహాసభ నిర్ణయించింది.

నందిగ్రామ్‌పై ప్రత్యేక చర్చలో పాల్గొన్న హల్దియా మున్సిపాలిటీ చైర్మన్ నంద సేన్ మాట్లాడుతూ తృణమూల్ కాంగ్రెస్‌తోపాటు అనేక రాజకీయ పార్టీలు, మావోయిస్టులు, స్వచ్ఛంద సంస్థలు, భూ పరిరక్షణ సమితి పేరుతో ఏర్పడి వామపక్ష ప్రజాస్వామ్య ఉద్యమాన్ని బలహీన పరిచేందుకు పాల్పడుతున్న కుట్రలు, కుతంత్రాల గురించి వివరించారు. నందిగ్రామ్ బ్లాక్-1 నుండి దాదాపు 3,000మంది సిపిఎం కార్యకర్తలు, మద్దతుదారులను తృణమూల్- మావోయిస్టు గూండాలు బలవంతంగా బయటకు తరిమేయడం, ఆ ఊరికి వచ్చే రోడ్లు, కల్వర్టులను తెగ్గొట్టడం, గోతులు తవ్వడం, సిపిఎం కార్యకర్తల ఇళ్లను, కార్యాలయాలను దగ్ధం చేయడం వంటి విధ్వంసకర చర్యలకు ఎలా పాల్పడుతున్నదీ, సొంత రాష్ట్రంలోనే శరణార్థులుగా మూడు వేల మంది బతకాల్సిన స్థితిని సృష్టించిన తృణమూల్-నక్సల్స్ మూకల దుశ్చర్యల గురించి వివరించారు. నందిగ్రామ్‌లో ఐద్వా కార్యకర్తలు కూడా అనేక కష్టనష్టాలు, హింసను ఎదుర్కొని శాంతి నెలకొల్పడానికి చేస్తున్న కృషిని వివరిస్తున్నపుడు ప్రతినిధులు శ్రద్ధగా విన్నారు. ఐద్వా కార్యకర్తలు ప్రజల మధ్య వుంటూ వారి సమస్యలపై నిత్యం పనిచేయబట్టే ప్రతినిధుల చర్చల్లో ఆ సజీవత్వం ఉట్టిపడింది.

## సాహార్థ సందేశాలు

బంగ్లాదేశ్, పాలస్తీనా ప్రతినిధులు మాట్లాడుతూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రపంచ మహిళలు ఐక్యం కావలసిన అవసరాన్ని నొక్కిచెప్పారు. మహిళా సమస్యలపై సమైక్య ఉద్యమాల ఆవశ్యకత చాలా వుందన్నారు. పాలస్తీనాపై ఇజ్రాయిల్ దురాక్రమణ తర్వాత 24లక్షల మంది ప్రజలు ముఖ్యంగా మహిళలు, పిల్లలు ఆకలితో అలమటిస్తున్న తీరు, పెరుగుతున్న అసమానతల గురించి వివరించినపుడు ప్రతినిధుల నుంచి మంచి స్పందన, సంఘీభావం వ్యక్తమయ్యాయి. సి.ఐ.టి.యు., రైతు సంఘం, వ్యవసాయ కార్మిక సంఘం, ఎస్.ఎఫ్.ఐ., డి.వై.ఎఫ్.ఐ. తదితర సంఘాల నుండి హాజరైన నాయకులు ప్రపంచీకరణకు వ్యతిరేకంగా కలిసి పనిచేసే అవసరాన్ని వివరిస్తూ సౌహార్థ సందేశం ఇచ్చారు. ఎన్.ఎఫ్.ఐ.డబ్ల్యు ప్రధాన కార్యదర్శి అనీరాజా మాట్లాడుతూ మహిళలు ఎదుర్కొంటున్న అనేక సమస్యల పరిష్కారానికి ఉమ్మడి పోరాటాలే మార్గమని చెప్పారు. ఐక్య ఉద్యమాలలో భాగస్వామి అయిన వైడబ్ల్యుసిఎ తరపున జ్యోత్స్న చటర్జి సౌహార్థ సందేశమిచ్చారు.

## తీర్మానాలు

అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన ఆవశ్యకత, క్రీడలు - ప్రోత్సాహక చర్యలు, ధరల పెరుగుదల, సచార్ కమిటి సిఫారసుల తక్షణ అమలు, ఐ.సి.డి.ఎస్ నిధుల కేటాయింపు పెంపు మొదలగు అంశాలపై పలు తీర్మానాలను మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

మహిళల ఆరోగ్య హక్కు, స్వయం సహాయక సంఘాల తీరుతెన్నులు, తీసుకోవలసిన చర్యలు, పంచాయతీరాజ్ సంస్థల్లో మహిళల భాగస్వామ్యం, ఉపాధి హామీ పథకం, వరకట్నం, ఒంటరి మహిళల సమస్యలు- పరిష్కారాలు, నీరు మన హక్కు అనే ఏడు అంశాలపై ప్రత్యేకంగా కమీషన్లు వేసింది. అవి సమర్పించిన పత్రాలపై రెండున్నర గంటలపాటు చర్చించింది. భవిష్యత్ ప్రణాళికను విడుదల చేసింది. మహాసభకు 22 రాష్ట్రాల నుండి 951 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఎ.పి. నుండి 86 మంది ప్రతినిధులు ఒక ఆహ్వానితులు ఈ మహాసభకు హాజరయ్యారు. ప్రతినిధుల్లో బెంగాల్‌కు చెందిన దీప్తి గోస్వామి 16 ఏళ్ళ అతి చిన్న వయస్కురాలు కాగా, మంజరి గుప్తా (84 బెంగాల్), సుధా బిందూ మిత్ర (83, బీహార్) ప్రమీలా పాంధే(80, ఢిల్లీ) లాంటి వయోవృద్ధులు మహాసభల్లో ఉన్నారు. ప్రతినిధుల్లో 391 మంది వివిధ స్థాయిల్లో ఎన్నికైన ప్రజాప్రతినిధులు వున్నారు. మహిళా ఉద్యమంతో సమన్వయం చేసుకుంటూ తమ పదవులను ఉద్యమ విస్తరణకు ఎలా ఉపయోగించాలో పరస్పరం అనుభవాలను పంచుకున్నారు. ఐద్వా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులుగా సుభాషిణీ అలీ, సుధా సుందర్ రామన్‌లను తిరిగి ఏకగ్రీవంగా ఎన్నుకోవడంతో మహాసభలు ముగిశాయి.

(రచయిత ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు)

❋❋❋

## ఏడవకే - ఏడవకే

ఏడవకే - ఏడవకే వెన్నెల రెమ్మా
ఏడిస్తే అలుసౌనులే ఆడజన్మ
వద్దనుకుని వదిలేసిన నినుకన్న అమ్మ
అసమాన సమాజాన ఒక ఆటబొమ్మ
(ఈ అసమాన)
తనలాంటి జీవిని తయారుచేసి అందించే
అరుదైన కర్మాగారం - ఆడపిల్ల నీ గర్భాశయం
అంత విలువనీకిచ్చి - దేవుడు సృష్టిస్తే
అక్కరలేదని మనిషి ఆవల విసిరేస్తే
ఆ అజ్ఞానిని చూసి నీవు నవ్వు నవ్వు నవ్వాలిగాని
॥ఏడవకే॥

వద్దన్నందుకు నువ్వే వజ్రపు తునకవై
కాదన్నందుకు నువ్వే కనకపు రాశివై
శోధన నీకెదురైనా - సాధనలో ఎదిగి
ఎన్నెన్నో విజయాలను సాధించాలి
కాదన్నవారి కనులు తెరిపించాలి
॥ఏడవకే॥

-ఎ.వి.డి. సత్యనారాయణమ్మ

## గమనిక

మానవి అక్టోబర్ - డిశంబర్ 2007 సంచిక
అనివార్య కారణాల వల్ల ఆలస్యమైంది.
పాఠకులు మన్నించగలరు.
అక్టోబర్ - డిశంబర్ సంచికతోపాటు జనవరి - మార్చి,
2008 సంచికను కలిపి అందజేస్తున్నాం.

పాఠకులు గమనించగలరు.

- ఎడిటర్



# దేశం కోసం



- వేములపల్లి సత్యవతి

కీ.శే. జయశంకర ప్రసాద్ హిందీ సాహిత్యంలో విశిష్టమైన కవిగా, కథా రచయితగా పేరు పొందారు. ఆయన రచించిన 'కామాయని' మహా కావ్యం హిందీ పద్య సాహిత్యంలో మైలు రాయిగా నిలచింది. 'అంసూ' అనే ఖండ కావ్యం ధ్రువతారగా వెలుగొందింది. ప్రసాద్ కథలలోని స్త్రీ పాత్రలు త్యాగానికి, శాంతానికి ప్రతీకలు. మానవతకు కరదీపికలు. ప్రస్తుత కథలో అలాంటి పాత్రలేమీ వుండవు. కేవలం రచయిత, బాలుడు మాత్రమే దర్శనమిస్తారు. రచయిత ఈ కథకు "ఛోటా జాదూగర్" (చిన్న గారడీవాడు లేక గారడీబాలుడు) శీర్షిక పెట్టారు. అనువాదం కాకుండ ఆధారంతో రాస్తున్నందున 'దేశం కోసం' శీర్షిక బాగుంటుందనిపించింది.

అది 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర సంగ్రామములో పాలుపంచుకొన్న కాన్పూరు పట్టణం. ఈ కథ కూడ 1947కు పూర్వం స్వతంత్ర పోరాటాల సమయములో రాయబడినది. కాన్పూరులో వస్తు ప్రదర్శనశాల(ఎగ్జిబిషన్) జరుగుచున్నది. ప్రజలు తండోపతండాలుగా చూడటానికి వెళుతున్నారు. ఒక రోజు రచయిత కూడ వెళ్ళి చూచి తిరుగు ముఖంపట్టి వస్తూ వుంటే ఒక దుకాణం దగ్గర కేవలం ఒకే వయసు (14సంవత్స రాలు)గలిగిన బాలుర సమూహం కంటపడింది. విశేషమేమిటో తెలుసుకుం దామని రచయిత బాలుర సమూహం దగ్గరకు వెళ్ళాడు. ఒక్కొక్క బాలుడు ఒక రూపాయి యిచ్చి టికెట్ కొనుక్కొని ప్రవేశ ద్వారం గుండాలోనికి ప్రవేశించి బయటకెళ్ళే ద్వారం గుండా వెళ్ళిపోతున్నారు. లోపల ఏమి జరుగుచున్నది తెలుసుకోవటానికి అటూ-ఇటూ చూచాడు. ఒక బాలుడు నిరాశతో హతాశుడై ఆ దుకాణం దగ్గర తచ్చాడుతూ కనిపించాడు. ఆ బాలుని పిలిచి లోపల జరిగే విషయం తెలుసుకున్నాడు. రకరకాల పన్నెండు బొమ్మలను సమాంతరంగా వ్రేలాడగట్టి గురి చూచి ఒకే దెబ్బతో పడగొట్టినవారికి ఆ బొమ్మలను ఉచితంగా యిస్తారని ఆ బాలుడు తెల్పి తన దగ్గర రూపాయి కాదు కదా నయాపైసా లేదని విచారం వెలిబుచ్చాడు. రూపాయి యిస్తే నీవు వాటిని గెలుచుకోగలవా అని రచయిత అడిగాడు. తప్పక గెలుస్తానని బాలుడు ధృఢమైన ఆత్మ విశ్వాసంతో జవాబిచ్చాడు. రచయిత రూపాయి యిచ్చాడు. బాలుడు పరమానంద భరితుడై టికెట్ కొనుక్కొని తన వంతు వచ్చినపుడు లోనికి వెళ్లాడు. బయటకు వచ్చేటపుడు ఆ బొమ్మలను తన దగ్గరున్న తుండుగుడ్డలో మూట కట్టుకొని రచయిత దగ్గరకొచ్చి కృతజ్ఞతాభావంతో నమస్కరించాడు. రచయిత బాలుని వీపు నిమిరి శభాష్ అని మెచ్చుకొని వెళ్ళిపోయాడు. అనేక చోట్ల బాలుడు, రచయిత తారసపడటం, బాలుడు నమస్కరించటం, రచయిత బాలునికి రూపాయివ్వటం జరుగుతుండేది.



అది వేసవి కాలం. పన్నెండు గంటల సమయం. రచయిత కారులో వెళుతున్నాడు. రోడ్డు ప్రక్కన తుండుగుడ్డ పరచి బొమ్మలతో రకరకాల విన్యాసాలు చేయిస్తున్నాడు. ఎలుగుబంటు అలుగుతుంది. పిల్లి బ్రతిమలాడుతుంది. కోతి నృత్యం చేస్తుంది. చిలుక జోస్యం చెబుతుంది. చూచిన బాటసారులు పావలా, పరకా తుండుగుడ్డలో వేసి వెళుతున్నారు. రచయిత బాలుని చూచి కారు దిగి వచ్చి కొంచెం చల్లబడిన తరువాత చేసుకోవచ్చుకదా? ఇంత ఎండలో ఎందుకని మందలించాడు. చల్లబడిన తర్వాత వేరే చోటకు వెళ్లాలని లేకపోతే జ్వరం వస్తున్న తన తల్లికి మందుకు, తమ తిండికి సరిపోవని సమాధానం చెప్పాడు. ఎప్పటిలాగే రచయిత కారులో వెళుతున్నాడు. ఆ చలిలో బాలుడు బొమ్మలతో విన్యాసాలు చేయిస్తున్నాడు. రచయిత చూచి కారు దిగివచ్చి ఎండ, వాన, చలి ఏమీ వుండవా నీకు అని అడిగాడు. అవన్నీ చూచుకుంటే అమ్మకు వైద్యం చేయించలేనుకదా? సార్ అన్నాడు. దానికి రచయిత నీకు నాన్న లేదా? అని అడిగాడు ఉన్నాడని బాలుడు జవాబిచ్చాడు. ఉంటే నీవెందుకు కష్టపడుతున్నావు? ఎక్కడ వున్నాడు? ఏమి చేస్తున్నాడని అడిగాడు. బాలుడు జైలులో ఉన్నాడని జవాబిచ్చాడు. జైలులోనా? ఎందుకు? దొంగతనం చేశాడా? అని రచయిత అడిగాడు. కాదన్నట్లు బాలుడు తల అడ్డంగా తిప్పాడు.

**రచయిత : మరెందుకు జైలుకెళ్లాడు? ఎవరినైనా హత్య చేశాడా?**

ఆ మాటకు బాలుని ముఖం కోపంతో కందగడ్డలాగ ఎరుపెక్కింది. 'దేశం కోసం' అని తీవ్రమైన కంఠస్వరంతో జవాబిచ్చాడు. ఆశ్చర్యపడటం రచయిత వంతయింది.

రచయిత : దేశం కోసమా?

బాలుడు : అవును దేశం కోసమే. ఒక రోజు వందల మంది జనం మూడు రంగుల జెండాలు పట్టుకుని వూరేగింపుగా బయలు దేరారు. కొంత దూరం వెళ్ళిన తర్వాత పోలీసులు అడ్డగించారు. అయినా

జనం పోలీసులను తోసుకుని ముందుకెళ్లారు. తర్వాత పోలీసులు లాఠీలతో వాళ్లను చావబాదారట. కొంతమందికి తలలు పగిలి నెత్తురు కారిందంట. కొంత మందికి కాళ్లు చేతులు విరిగినయ్యంట. కొంత మంది దెబ్బలతో నేలమీద పడిపోయారంట. వాళ్లల్లో మానాన్న వున్నాడు. సర్కారు బడిలో పంతులుగా చేసేవాడు. అప్పుడు నేను ఏడవ తరగతి చదువుతున్నా. నాన్న జైలుకెళ్లిన తర్వాత జీతం రావటం లేదు. మంచి యింటిలో నుంచి గుడిసెలోకి వెళ్లాం. జైలుకెళ్ళిన తర్వాత మా నాన్నను నేను, మా అమ్మ ఒక్కసారి కూడ చూడలేదు. చాలా దూరం పంపారంట. మా అమ్మ, నాన్నలకు నేను ఒక్కడినే. బడి మానివేశా. అమ్మకు జ్వరం వస్తూ వుంది. మీరిచ్చిన రూపాయితో బొమ్మలను గెలిచి వాటితో గారడీ చేయించి వచ్చిన డబ్బులతో మందు యిప్పిస్తున్నా. అయినా జ్వరం తగ్గటం లేదు. మనేద జ్వరం తగ్గటం కష్టమని డాక్టరు చెప్పాడు. రచయిత ఆ బాలుని తన కారులో కూర్చోపెట్టుకుని గుడిసెలోనికి వెళ్లాడు. మినుకు మినుకు మంటూ కిరోసిన్ ఎక్కా (దీపం )వెలుగుతూంది. మసక మసక వెలుతురులో కుక్కి నులకమంచం మీద ఓ మానవాకారం రచయిత కంటపడింది. బాలుడు అత్యుత్సాహంతో మంచం దగ్గరకెళ్ళి అమ్మా? నిన్ను చూడటానికి పెద్ద సార్ కారులో వచ్చాడని పదే పదే చెప్పసాగాడు. ఉలుకు పలుకు లేదు పాపం! బాలుని కేమి తెలుసు అమ్మ ఈ లోకాన్ని వదలివెళ్ళిందని!

రచయిత మంచం దగ్గరకెళ్ళి చెయ్యి పట్టుకుని నాడి చూచాడు. ముక్కు దగ్గర వ్రేలుంచి శ్వాస ఆడుతున్నది లేనిది చూచాడు. రచయిత హృదయం ఆర్ద్రమయింది. ఆమె పైనున్న గుడ్డను ముఖం మీదకు కప్పి బాలుని వీపు మీద చేయివుంచి బాబూ ఇక నీకు అమ్మ లేదని చెప్పి బరువెక్కిన గుండెతో గుడిసె బయటకు నడిచాడు. బాలుడు తల్లి శవం మీద పడి అమ్మా అమ్మా అని రోదించసాగాడు. కారులో కూర్చున్న రచయిత చెవులలో బాలుని రోదనతోపాటు 'దేశం కోసం' అన్న పదం కూడ ప్రతిధ్వనించసాగింది.

కేవలం నాయకుల త్యాగాల వలననే మన దేశం స్వతంత్రమవలేదు. నాయకులు ప్రజలలో దేశభక్తి బీజాలను నాటారు. ప్రజలను చైతన్యపరిచారు. ఉద్యమాలకు నాయకత్వం వహించారు. లాఠీ దెబ్బలు తిన్నారు. జైళ్ళకువెళ్లారు. కాని వారి కుటుంబాలు కథలో చెప్పిన బాలుని కుటుంబంలాగ కూటికి అలమటించలేదు. లాల్ బహదూర్ శాస్త్రి లాంటి వారు బీదతనంతో బాధలు పడ్డారు. అయితే వారి సంఖ్య వేళ్లమీద లెక్కింపదగినవి. స్వతంత్ర భారత పోరాటాలలో అసంఖ్యాక ప్రజానీకం యొక్క భాగస్వామ్యం మిళితమై వుంది. స్త్రీలు, పురుషులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, న్యాయవాదులు, వైద్యులు, కార్మికులు, కర్షకులు, మన రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా చేసిన అంజయ్య గారి లాంటి శ్రామికులు అందులో భాగస్వాములు. (అంజయ్యగారు హమాలీ కూలీగా చేశారు) దేశం స్వతంత్రమై ఆరు పదులు నిండి పోయినవి. స్వతంత్ర ఫలాలు దేశ వాసులందరికీ లభించటంలేదు. కూడు, గూడు, గుడ్డ మనిషికి కావలసిన కనీస జీవితావసరాలు కూడ కరువైపోయాయి.

గాలి, నీరు, భూమి ప్రకృతి సంపదలు. అలాగే దేశంలోని అడవులు, నదులు, సముద్రాలు, సరస్సులు, పర్వతాలు, లోయలు, గుట్టలు, చెట్లు, చేమలు యివన్ని ప్రకృతి సంపదలే. ఏ కొద్ది మంది వ్యక్తులో వీటిని సృష్టించలేదు. తయారు చేయలేదు. అలాగే భూమాత గర్భంలో అపారమైన, అమూల్యమైన ఖనిజ సంపద దాగివుంది. మనిషి బుద్ధి బలం చేత, భుజబలం చేత వాటిని వెలికి తీశాడు. బంగారం, వెండి, ఇనుము, బొగ్గు, యురేనియం, పెట్రోలు, కిరోసిన్ మొదలగు సంపదలను ఈ దేశంలో జన్మించిన ప్రతి పౌరునికి అనుభవించే హక్కు వుంది. దురదృష్టం కొలది ఈ సంపదలన్ని సమాజంలో కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో వుండి పోయినవి. భూ తగాదాలకు తోడు నీటి తగాదాలు కూడ మొదలైనవి. స్వతంత్రం రాక పూర్వం రైతులు, కూలీలు పొలాలలో పనులకెళ్ళినపుడు తినటానికి అన్నపు మూటలను మాత్రమే పట్టుకెళ్ళేవారు. తిన్న తర్వాత బోదెలలో, కాలువలలో, బావులలో (నూతులు), చెరువులలోని నీటిని దోసిళ్లతో నింపుకొని తాగేవారు. నేడు తాగే నీరు పట్టణ వాసులతోపాటు పల్లెల్లో ప్రజలకు కూడ కరువయింది. రైతులు పంటనీటి కొరకు పడేపాట్లు వర్ణనాతీతం. ఇలాంటి స్వాతంత్ర ఫలాల కోసమేనా ఆనాటి త్యాగధనులైన దేశ భక్తులు తమ సర్వస్వం అర్పించి పోరాడింది? రాయలవారి కాలంలో గోలుకొండ నవాబుల పాలనలో రత్నాలు, ముత్యాలు వీధులలో రాసులు రాసులుగా పోసి అమ్మేవారని, వాటిని కొనుగోలు చేయటానికి వర్తకులు వచ్చేవారని చరిత్రకారులు రాశారు.

రత్నాల మాటలు, ముత్యాల ముచ్చట్లు యిప్పుడు లేవు. రాళ్ల దిబ్బలను కూడా పాలకులు, నేతలు, బడా వ్యాపారస్తులు స్వాహా చేస్తున్నారు. గుడిని మింగే వాడొకడైతే గుడిలోని లింగాన్ని కూడ మింగే పాలకులు ప్రజల పాలిట బడ్డారు. గుడిసె వేసుకోవటానికి చాలినంత జాగ యివ్వమని అడిగితే గుడిసె వేసుకుంటే తుపాకి గుండ్లతో పిట్టలను కాల్చినట్లు కాల్చి పారేస్తున్నారు. టాల్ స్టాయ్ మహాశయుడు మనిషికి ఆరు అడుగుల నేల చాలన్నాడు. అంటే శ్మశానంలోనన్నమాట. నేడు శ్మశానాలను కూడ కబ్జా చేస్తున్నారు బడాబాబులు. టాల్‌స్టాయ్ రాసినట్లు ముందుముందు ఆ ఆరు అడుగుల నేల కూడ మనిషికి లభిస్తుందన్న నమ్మకం కల్గటంలేదు. కాని ప్రజాబలం ముందు అక్రమార్కులంతా తలవంచక తప్పదు. ప్రజాశక్తి అజేయమైనది. దాని ముందు అందరూ పరాజితులు కావలసిందే.

***

## ఉద్యమం

మహిళలం - మేము మహిళలం
ఉద్యమాలే ఊపిర్లై, ఉప్పెనలా ఎగుస్తాం
ప్రాణాలైనా ఒడ్డుతాం - పోరుబాట సాగుతాం ॥మహిళ॥
నేలపాలౌతున్న మా బ్రతుకులు చూసి -
చలించని నాయకులను
చూసి, చూసి చూసి
ఆకలితో, ఆవేశంతో ప్రభంజనంలా కదులుతున్నాం
చేస్తున్నాం "భూపోరాట ఉద్యమం"
దిగిరాక తప్పదీ ప్రభుత్వం.

-పి.లత

# జాతీయ ఉపాధి హామీ పథకం అమలు తీరుతెన్నులు - ఒక పరిశీలన

ప్రొ॥కె. సీతా రామారావు, బూర విజయమోహన్, బి. మహేశ్...
కాకతీయ విశ్వ విద్యాలయం

**భా**రతదేశ గ్రామీణ ప్రాంతాలలో ఇప్పటికీ దాదాపు 65 శాతం కంటే ఎక్కువ ప్రజలు వ్యవసాయం, వ్యవసాయాధారిత కార్యకలాపాలపై ఆధారపడి తమ జీవనోపాధిని కొనసాగిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి కోసం భారత దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినప్పటి నుండి కేంద్రంలో, వివిధ రాష్ట్రాలలో ఆయా ప్రభుత్వాలు ఎన్నో రకాల పథకాలు చేపట్టినా అవి సక్రమంగా అమలు కాక పేదరికం పూర్తిగా నిర్మూలించబడలేదు. అతివృష్టి, అనావృష్టి వంటి ప్రకృతి వైపరీత్యాలవల్ల భూగర్భ జలాలు తగ్గిపోవడం, భూమి సారం, సహజవనరుల క్షీణత వంటిసమస్యలు గ్రామీణ ప్రాంతాల్ని పట్టి పీడిస్తున్నాయి. వీటి ఫలితంగా గ్రామీణ ప్రజానీకం ఉపాధి కోల్పోయి పెద్ద సంఖ్యలో పట్టణాలకు వలసవెళ్ళి అక్కడ జీవన్మరణ సమస్యలను ఎదుర్కొనడం జరుగుతున్నది. ఆంధ్ర ప్రదేశ్‌లో నిర్వహించిన వివిధ ఆర్థిక సర్వేల ప్రకారం రాష్ట్రంలో సుమారు 50 శాతం ప్రజలు పేదరికంలో మగ్గుతున్నారు. గత కొన్ని సంవత్సరాలుగా పర్యావరణ విధ్వంసం మూలంగా ఏర్పడ్డ కరువుల వలన సరిగా పంటలు పండక, చేసేందుకు పనిదొరకని పరిస్థితిలో కనీస బతుకుదెరువు కోసం గ్రామీణ ప్రజలు సొంత ఊళ్ళను విడిచి పట్టణాలకు వలస వెళ్ళవలసిన పరిస్థితి నెలకొని ఉంది. ఈ విధంగా వలసవెళ్ళే జనాభాను పరిశీలిస్తే తెలంగాణ ప్రాంతంలోని ఒక్క మహబూబ్‌నగర్ జిల్లాలోనే సంవత్సరానికి 15 లక్షల మంది కూలీలు చిన్నా, సన్నకారు రైతులు వలసవెళుతున్నట్లు ప్రభుత్వ అంచనా. అంతేకాకుండా భారతదేశంలోని ఒకటి, రెండు రాష్ట్రాలు మినహా మిగతా అన్ని రాష్ట్రాలలో కూడా ఈ విధమైనటువంటి దుర్భర పరిస్థితులే నెలకొని ఉన్నాయడంలో ఎలాంటి సందేహం లేదు. భారతదేశంలో ఇందిరాగాంధీ కాలంనాటి "గరీభీ హటావో" నినాదం నుండి అనేక రకాలైన ఉపాధి హామీ పథకాలను వివిధ పేర్లతో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అమలుచేయుదానికి ఇప్పటివరకు సుమారు రూ॥85వేల కోట్లకు పైగా ఖర్చు పెట్టినప్పటికీ పేదరిక నిర్మూలన, ఉపాధి అవకాశాల కల్పనలో ప్రభుత్వాలు ఆశించిన ఫలితాలు సాధించలేదనే చెప్పవచ్చును. ఈ మధ్యకాలంలో మహారాష్ట్ర ప్రభుత్వం అమలుచేస్తున్న ఉపాధి హామీపథకానికి కొన్ని మార్పులు చేపట్టి యుపిఎ ప్రభుత్వం నూతనంగా జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది.

10వ పంచవర్ష ప్రణాళికలో 26శాతం ఉన్న పేదరికాన్ని 21 శాతానికి తగ్గించి నిరుద్యోగులు అయినటువంటి గ్రామీణ పేదలకు ఉపాధి అవకాశాలు కల్పించాలనే ఉద్దేశ్యంతో ఇలాంటి ఉపాధి హామీ పథకాలను అమలుచేస్తున్నారు. ముఖ్యంగా ఒరిస్సాలోని కల్హాండిలో ఆకలితో అలమటిస్తున్న వందల వేల మంది గిరిజన ప్రజలు తమ ఆకలిని ఎలాగైనా తీర్చుకునే ఉద్దేశ్యముతో విషపు గడ్డలు, మామిడి టెంకలలోని జీడి పదార్థాన్ని తిని చాలా మంది గిరిజనులు చనిపోయినారు. అలాంటి పరిస్థితులలో గిరిజన ప్రజల ఆత్మఘోషను చూచి వారిని ఏవిధంగానైనా సరే ఆదుకోవాలనే ఉద్దేశ్యంతో ఒక న్యాయవాది ప్రజాప్రయోజనాల వ్యాజ్యం క్రింద సుప్రీం కోర్టులో కేసు వేయగా కోర్టు తీర్పునిస్తూ ఆకలితో అలమటిస్తున్న పేద ప్రజలకు ఆహార భద్రత కల్పించడం లేదా ఉపాధి అవకాశాలు కల్పించాల్సిన బాధ్యత ఆయా ప్రభుత్వాలపై ఉందని పేర్కొనడం జరిగింది.



ఇంత వరకు భారతదేశంలోని గ్రామీణ పేదలను ఆదుకోవదానికి, గ్రామీణ పేద ప్రజల ఆకలిని తీర్చదానికి, ఆహార భద్రత, జీవనోపాదులను పెంచడం కోసం ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు అనేక పథకాలను అమలు జరుపుచున్నప్పటికీ కనీసం ఒక సంవత్సరంలో 100 రోజుల పని దొరుకుతుందని కానీ, ఒక కుటుంబానికి నిర్థిష్టమైన ఆదాయం లభిస్తుందని కానీ ఇప్పటి వరకు ఒక చట్టబద్దమైన హామీ పేద ప్రజలకు లభించలేదు. ఈ పరిస్థితులను అధ్యయనం చేసిన భారత ప్రభుత్వం గ్రామీణ పేద ప్రజలకు ఉపాధిభద్రతను కల్పించి జీవనోపాధి అవకాశాలను పెంచి, దీర్ఘకాలిక ఆస్తులను సమకూర్చాలనే సదుద్దేశ్యంతో గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని ప్రవేశపెట్టారు. గ్రామీణ ప్రాంతంలో నైపుణ్యం అవసరంలేని పనిచేయదానికి సిద్ధంగా ఉండి, పని అడిగిన 18సం॥రాలు నిండిన వయోజనులున్న ప్రతి కుటుంబంలో ఎంతమంది ఉన్నా వారికి ఇంతకు ముందు వారు చేస్తున్న పనులకు అదనంగా ఒక ఆర్థిక సంవత్సరంలో 100రోజులు పనికల్పించాలి. పై లక్ష్యంతో జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టాన్ని ఆగస్టు 23, 2005న భారత పార్లమెంట్ ఆమోదించింది. ఈ చట్టం ప్రకారం కేంద్ర ప్రభుత్వం మొదటిదశగా దేశంలోని వివిధ రాష్ట్రాలలోని వెనుకబడిన రెండు వందల జిల్లాల్లో ఈ పథకాన్ని అమలుచేయాలని నిర్ణయించింది. అందుకుగానూ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఈ చట్టం అమలులోకి వచ్చిన 6నెలలలోపు వారి వారి స్థానిక పరిస్థితులకు

అనుగుణంగా రాష్ట్ర గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని రూపొందించాలి. అందులో భాగంగానే ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్ర ప్రదేశ్ గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని రూపొందించి రాష్ట్రంలోని 13 జిల్లాల్లో (ఆదిలాబాద్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, ఖమ్మం, నల్గొండ, వరంగల్, అనంతపురం, కడప, చిత్తూరు, మెదక్, నిజామాబాద్, కరీంనగర్, విజయనగరం)అమలు చేయతలపెట్టింది ఈ పథకాన్ని ఫిబ్రవరి 2,2006 సంవత్సరంలో అనంతపురం జిల్లా నార్పల మండలంలోని బండ్లపల్లి గ్రామంలో భారత ప్రధానమంత్రి డా॥మన్మోహన్‌సింగ్ చే ప్రారంభించడం జరిగింది. అనంతరం ఈ పథకాన్ని భారతదేశంలోని 130 జిల్లాలకు విస్తరించడం జరిగింది. అందులో భాగంగా ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా మరో 6 జిల్లాల్లో (గుంటూరు, కర్నూలు, నెల్లూరు, ప్రకాశం, శ్రీకాకుళం, తూర్పుగోదావరి) అమలు చేస్తున్నారు. ఈ పథకం అమలుకోసం మన రాష్ట్ర ప్రభుత్వం 1409కోట్లు ఖర్చుచేయడం జరిగింది.

ఎన్.ఆర్.ఇ.జి. పథకంలో భాగంగా చేయవలసిన పనులను వార్డు సభలు, గ్రామ సభల ద్వారా గుర్తించడం జరుగుతుంది. ఈ పథకంలో భాగంగా గ్రామీణ ప్రాంతంలో చేపట్టాల్సిన ప్రభుత్వం గుర్తించిన పనులను క్రింద పేర్కొనడం జరిగింది.

1. నీటి సంరక్షణ, వాననీటి నిల్వ.
2. కరువు నుండి రక్షణనిచ్చే పనులు (చెట్ల పెంపకం, తోటల పెంపకం)
3. సాగునీటి కాల్వలు, చిన్న సూక్ష్మస్థాయి నీటి పారుదల వసతి.
4. షెడ్యూల్ కులాలు, షెడ్యూల్ తెగల భూ సంస్కరణల ఫలితంగా భూమిని పొందినవారు లేదా ఇందిరా ఆవాస్ యోజన లబ్ధిదారుల భూములకు సాగునీటి సదుపాయాల కల్పన.
5. సాంప్రదాయ నీటి వనరుల పునరుద్ధరణ (చెరువులు పూడికతీయడం)
6. భూమి అభివృద్ధి పనులు.
7. వరద నియంత్రణ, వరద రక్షణ పనులు, నీరు నిలవబడిపోయే ప్రాంతాలలో మురుగు నీరు తీసేపనులు.
8. గ్రామీణ ప్రాంతాలకు అన్ని కాలాల్లో అనువైన రోడ్ల సౌకర్యం.

ఇటువంటి ముఖ్యమైన 8 రకాల పనులతోపాటు రాష్ట్ర ప్రభుత్వాలతో చర్చించి కేంద్ర ప్రభుత్వం ప్రకటించే ఇతర పనులను చేపట్టడానికి ఈ పథకం ఉద్దేశింపబడింది. అయితే ఈ పథకాన్ని అమలుచేయడానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి పనిచేస్తాయి. రాష్ట్ర ప్రభుత్వం ఈ బాధ్యతను పంచాయితీ సంస్థలకు అప్పగించడం వలన గ్రామ స్థాయిలో ఉపాధిహామీ అమలు సంస్థలుగా గ్రామ పంచాయితీలు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. ఇందుకోసం కావలసిన నిధులకు కేంద్ర ప్రభుత్వం పార్లమెంట్ ఆమోదంతో "జాతీయ ఉపాధి హామీ నిధిని" ఏర్పాటు చేసి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు 90:10 నిష్పత్తులలో నిధులను సమకూరుస్తున్నాయి.

అయితే పైన పేర్కొన్నటువంటి పనులను చేయడానికి ఉపాధి హామీ పథకం ద్వారా కూలీలకు కొన్న ప్రత్యేకమైన సదుపాయాలను ముందెన్నడూ లేని రీతిలో కల్పించడం జరిగింది. వాటిలో



1. ఉపాధి హామీ పథకం క్రింద పేరు నమోదు చేసుకున్న ప్రతి కుటుంబంలో ఉన్న వయోజనులకు ఆడ, మగ బేధం లేకుండా ఒక ఆర్థిక సంవత్సరంలో 100రోజులకు తక్కువ కాకుండా పనికల్పించాలి.
2. పని కోసం దరఖాస్తు చేసుకున్న 15 రోజులలోగా పని పొందడం, అలా కల్పించకపోయినచో చట్ట ప్రకారం పని కల్పించని రోజులకు నిరుద్యోగ భృతిని ఆ రోజులకు లెక్కగట్టి 15రోజుల లోపు చెల్లించాలి.
3. మహిళలకు సమానావకాశాలు కల్పించడం, సమానవేతన చట్టం 1976 ప్రకారం ఆడ, మగ బేధం లేకుండా సమానవేతనాలు ఇవ్వడం.
4. నివసిస్తున్న ప్రాంతం నుండి 5 కి.మీ. లోపు పనిని కల్పించడం ఒక వేళ 5కి.మీ దాటి పనిచేస్తే రోజువారి కూలీకి అదనంగా రవాణా చార్జీల క్రింద రోజు కూలీలో 10 శాతం అదనంగా చెల్లించాలి.
5. పనిచేస్తూ గాయపడితే వైద్యం, మందుల ఖర్చులతోపాటు కూలీ వేతనంలో 50 శాతం తగ్గకుండా పొందడం, అంగవైకల్యం కలిగినచో లేదా మరణించినచో కేంద్ర ప్రభుత్వం కేటాయించిన 25,000 నష్టపరిహారాన్ని పొందవచ్చు. అంతేకాకుండా మంచినీటి సదుపాయాన్ని, విశ్రాంతి సమయాలలో కూలీలకు, చిన్న పిల్లలకు నీడ సదుపాయాలతోపాటు పిల్లల సంరక్షణకు ఆయాలను ఏర్పాటు చేయాలి.

ఎంతో సదుద్దేశ్యంతో అనేక సౌకర్యాలతో పేద ప్రజలకు ఉపాధి అవకాశాలు కల్పించి మేలు చేయాలనే లక్ష్యంతో ప్రారంభించబడిన ఈ పథకం ద్వారా 2006 సెప్టెంబర్ నాటికి కేవలం ఒక్క ఆంధ్ర ప్రదేశ్‌లోనే 13 జిల్లాల్లో పేదవారికి పని కల్పించడానికి 44, 37,029 జాబ్ కార్డులు మంజూరు చేయడం జరిగిందని ఒక అంచనా. దేశం మొత్తం మీద ఈ పథకాన్ని 200 నుండి 330 జిల్లాలకు విస్తరించిన అనంతరం నూతనంగా ఈ పథకాన్ని ప్రారంభించిన 6 జిల్లాలను కలుపుకొని ఆంధ్ర ప్రదేశ్‌లో ఇప్పటి వరకు ఈ పథకం ద్వారా మొత్తం 19 జిల్లాల్లో 9,58;902 కూలీలు మాత్రమే పనిచేయగా వారికి 69,38,22,564రూ॥లు ఉపాధి హామీ క్రింద చెల్లించారని ఇంకా రూ॥ 19,83,31,227 ఉపాధిహామీ పనిముట్ల కోసం వ్యయం చేసినట్లు ఇటీవలే ప్రభుత్వం నిర్వహించిన సోషల్ ఆడిట్‌లో తేల్చడం జరిగింది.

మన దేశంలో ప్రభుత్వ రంగ సంస్థలు, పరిశ్రమలలో 30 శాతం అభివృద్ధి జరిగితే అందులో ఒక్క శాతం కూడా ఉపాధి అవకాశాలు మెరుగుపడే పరిస్థితి లేదు. అయితే ఇటువంటి పరిస్థితులలో రూపొందించిన ఉపాధి హామీ చట్టం ఎంత మందికి ఉపాధి కల్పించింది అనే కోణం నుండి కాకుండా గ్రామీణ ప్రాంతాల అభివృద్ధితో ఉపాధి అవకాశాల మెరుగుకు ఎంతవరకు తోడ్పడుతుంది అన్న కోణం నుండి పరిశీలించడం అవసరం. ఆ దృష్టితో పరిశీలిస్తే ఈ పథకం ఎక్కువగా ప్రజా ప్రతినిధుల స్వార్థ ప్రయోజనాలకు, అవినీతికి, ప్రభుత్వ అధికారుల మోసాలకు అవినీతి అక్రమాలకు నిలయంగా మారిందని చెప్పడంలో అతిశయోక్తిలేదు.

వరంగల్ జిల్లాలో 2006 సంవత్సరంలో ఒక్క మహబూబ్‌నగర్ మండలంలోనే వివిధ రకాలైన పనులలో అనేక రకాలైన అవినీతి అక్రమాలు జరిగినాయి. వాటిని క్రింద పట్టికలో పేర్కొనడం జరిగింది.

పట్టిక 1:

| | పనిపేరు | మొత్తం కూలీల సంఖ్య కూలీలు | వాస్తవంగా ఉపయోగించిన రూపాయలలో | డ్రాచేసిన నిధులు నిధులు | కూలీలకు చెల్లించిన |
|---|---|---|---|---|---|
| 1. | ఎత్తిపోతల పతకం, గాంధీపురం | 34 | 34 | 6,154 | 6,154 |
| 2. | మైసమ్మ చెరువు పంటక్వామరమ్మత్తులు | 24 | 16 | 23,112 | 5,000 |
| 3. | మొద్దులకుంట చెరువు మరమ్మత్తులు | 43 | 31 | 33,239 | 9,920 |
| 4. | రామన్న చెరువుకు మరమ్మత్తులు | 106 | 106 | 24,455 | 24,455 |
| 5. | అనంతారం మొగిలిచర్లరోడ్డుకు మొక్కల పెంపకం | 115 | 95 | 44,198 | 36,511 |
| 6. | బత్తిని రవి చెరువుకట్ట మరమ్మత్తులు | 52 | 52 | 11,532 | 11,532 |

పై పట్టికను పరిశీలిస్తే వాస్తవంగా పనిచేసిన కూలీలతోపాటు పని చేయనటువంటి మరి కొంతమంది బినామీ పేర్లను కూడా రికార్డులలో చూపించి అధికారులు కూలీ డబ్బులను బ్యాంకు నుండి డ్రా చేసి స్వాహా చేసినట్లు గమనించవచ్చు.

పరకాల మండలం నర్సక్కపల్లె గ్రామంలో 1400మంది కూలీలుండగా 614 జాబ్ కార్డులు మాత్రమే ఇవ్వగా వారికి కూడా కేవలం 16 రోజులు మాత్రమే పని కల్పించడం జరిగింది. దాంతో పూటగడవటం ఇబ్బందిగా ఉన్నటువంటి 30 పేద కుటుంబాలు చుట్టు ప్రక్కల ఉన్న శాయంపేట వంటి గ్రామాలకు ఇటుకల తయారీ వంటి కూలీల పనుల కోసం వలసవెళ్లటం జరిగింది. ఇందుకు ప్రధాన కారణం బినామి పేర్లతో ఫీల్డ్ అసిస్టెంట్ నిధులు స్వాహాచేయడమే అని అక్కడి ప్రజలు వాపోయారు.

వరంగల్ జిల్లాలో డిశంబర్ 2006నాటికి మొత్తం 4.14 లక్షల మందికి ఉపాధి హామీ పథకం ద్వారా 100 రోజులు పనికల్పిస్తామని జాబ్ కార్డులు అందజేయగా గడిచిన 9నెలల్లో కేవలం 2.73 లక్షల మందికి మాత్రమే పని కల్పించడం జరిగింది. ఇందుకు అధికారుల అలసత్వమే కారణంగా చెప్పవచ్చు. అంటే పనులు ఉండి నిధులు ఉన్నప్పటికీ కూడా కొన్ని మండలాల్లో అతి తక్కువ మందికి మాత్రమే పనికల్పించడం జరిగింది. వివరాలు ఈ క్రింది పట్టికలో చూడవచ్చు.

పట్టిక 2: (పక్కపేజీలో)

అంతేకాకుండా డిశంబర్ 2006నాటికి జిల్లాలోని 28 మండలాల్లో ఒక్క పనికూడా పూర్తి చేయకపోగా 8 మండలాల్లో ఒకటి రెండు పనులు మాత్రమే పూర్తి చేశారు. ఈ విధంగా పరిశీలిస్తే డిశంబర్ 2006నాటికి జిల్లాలో మొత్తం 8737 రకాల గుర్తించిన పనులుండగా అధికారులు పూర్తి చేసిన పనులు కేవలం 232 అంటేమొత్తం పనుల్లో 2.65 శాతం మాత్రమే. 2007 ఏప్రిల్‌లో వరంగల్ జిల్లాలో దినపత్రికల సమాచారం మేరకు నర్మెట మండలంలో బొత్తలపర్రే గ్రామంలో మర్రికుంట నుండి కన్నారం చెరువు వరకు చెరువు ఫీడర్ చానల్ మరియు గుట్టకుంట మట్టి పనులకు 35మంది 15రోజులు పనిచేయగా 4నెలల వరకు కూడా వారికి డబ్బులు ఇవ్వలేదని పేర్కొన్నారు. కాగా నెల్లికుదురు మండలంలో రత్తిరాం తండాలో ఆరు రోజులు చెరువు మరమత్తుల పనులకు వెళ్ళితే రోజుకు 39 రూ॥మాత్రమే చెల్లించారని మిగతా డబ్బులు అధికారులు స్వాహాచేశారని అక్కడి కూలీలు ఆవేదన వ్యక్తం చేశారు.

అదేవిధంగా మహబూబ్‌నగర్ మండలంలో జరిపిన సోషల్ ఆడిట్‌లో కూడా అనేక అక్రమాలు జరిగినట్లు దినపత్రికల సర్వేలో పేర్కొనడం జరిగింది. అందులో

1. వి.ఎస్. లక్ష్మిపురంలో ఫీల్డ్ అసిస్టెంట్ తన బందువుల కుటుంబీకుల ఇతర బినామి పేర్లతో పనిచేయకున్నా 20,524 రూ॥లు స్వాహా చేశారు.
2. బలిగొందలో బి.పియంలు (బ్రాంచ్ పోస్ట్‌మాస్టర్) బినామీ పేర్లతో 8694 స్వాహాచేశారు.

| క్రసం. | మండలంపేరు | దరఖాస్తుచేసుకొని జాబ్‌కార్డులు పొందిన కూలీల సంఖ్య | పనిపొందిన కూలీల సంఖ్య | పనిపొందిన కూలీల % |
|---|---|---|---|---|
| 1. | హసన్‌పర్తి | 6,074 | 924 | 15.04 |
| 2. | తాడ్వాయి | 3,987 | 986 | 24.73 |
| 3. | గీసుగొండ | 7,754 | 1,239 | 15.93 |
| 4. | గూడూరు | 9,705 | 1,826 | 18.81 |
| 5. | ధర్మసాగర్ | 11,168 | 2,276 | 20.37 |
| 6. | వెంకటాపూర్ | 9,054 | 2,692 | 29.73 |
| 7. | జఫర్‌గడ్ | 7,855 | 2,732 | 34.78 |
| 8. | కురవి | 10,146 | 2,907 | 28.65 |
| 9. | మరిపెడ | 14,033 | 2,967 | 21.14 |
| 10. | నెల్లికుదురు | 9,937 | 3,106 | 31.25 |
| 11. | మహబూబాబాద్ | 12,702 | 3,307 | 26.03 |
| | | 4,14,385 | 1,40,489 | 33.90 |

3. నడివాడలో జాబ్ కార్డుల కోసం ఫీల్డ్ అసిస్టెంట్ 1,950రూ॥లు పనులు చేశారు.

4. కంబాలపల్లిలో 50మంది కూలీలు ఒక రోజుపనిచేస్తే 11 రోజులు చేసినట్లు రిజిష్టరులో చేర్చి ఆ నిధులు స్వాహాచేశారు.

5. ఈదులపల్లిలో 17మంది బినామి పేర్లతో ఫీల్డ్ అసిస్టెంట్ 12 వేలు స్వాహా చేయడం.

దోర్నకల్ మండలంలో పనికొలతలలో ఎక్కువ చూపించామని ముఠా మేస్త్రీలు డబ్బులు వసూలు చేశారు. కూలీ డబ్బులు చెల్లించేటపుడు బి.పి.యంలు ఒక్కొక్కరి వద్ద 10రూ॥ల నుండి 30 రూ॥ల వరకూ వసూలు చేశారని సోషల్ ఆడిట్‌లో వెల్లడైంది.

గీసుకొండ మండలంలోని వివిధ గ్రామాల్లో కూడా అనేక అక్రమాలు జరిగినట్లు ఆడిట్‌లో వెల్లడైంది. అందులో ముఖ్యంగా:

1. ఎలుకుర్తి హవేలీ గ్రామంలో ఫీల్డ్ అసిస్టెంట్ ఉపాధి హామీ పథకంలో భాగంగా రోడ్డుకు ఇరువైపుల చెట్లునాటించి కూలీలలకు ఒక్కొక్కరోజుకు 120 రూపాయలు చెల్లించవలసి ఉండగా కేవలం 35 నుండి 40రూ॥లు మాత్రమే చెల్లించి 30 వేలు స్వాహా చేశారు. అదేవిధమైన పనిచేయించినందుకుగానూ ఆరెపల్లి ఫీల్డ్ అసిస్టెంట్ తన బంధువుల బినామి పేర్లతో 30 వేలు స్వాహాచేశారు

2. విశ్వనాథపురం గ్రామంలో కూలీలకు మంచినీరు పోయడానికి ప్రత్యేక కూలీని నియమించకపోయినా రికార్డులలో మాత్రం నియమించినట్లు చూపించి రూ॥ 1,000 ఫీల్డ్ అసిస్టెంట్ స్వాహా చేశారు.

3. కూలీలకు పోస్టాఫీసు ద్వారా డబ్బులు చెల్లించేందుకు ప్రభుత్వమే ఖాతాలు తెరిచినప్పటికీ ఖాతాలు తెరవాలని గొర్రెకుంట గ్రామ ఫీల్డ్ అసిస్టెంట్ ఒక్కొక్కరి వద్ద రూ॥లు 50 చొ॥న వసూలు చేశారు.

స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత మొదటిసారి గ్రామీణ కూలీలకు ఉపాధి కల్పించి వారి ఆకలిని కొంతవరకైనా తీర్చగలిగిన ఘనత జాతీయ ఉపాధి హామీ పథకానికే దక్కుతుంది. అయితే ఈ పథకం క్రింద చేవదుతున్నటువంటి వనుల్లో అవినీతి అక్రమాలు బయటపడటమే కాకుండా నాణ్యతాపరమైనటువంటి లోపాలు కూడా ఉన్నట్లు చెప్పవచ్చు. గ్రామీణ ప్రాంతాల్లో ఈ ఉపాధి హామీ పథకం అమలులో జరుగుతున్న అవినీతికి ముఖ్య కారణాలు స్థానిక రాజకీయ నాయకులు, పాలనాధికారులు. ఈ పథకంలో అవినీతిని అరికట్టడానికి సంబంధించిన చట్టాలున్నా కూడా వాటిని సైతం తమకు అనుకూలంగా మలచుకొని అవినీతిని తమ "హక్కు"గా భావిస్తున్నారు. నిజానికి ఈ ఉపాధి హామీపథకాన్ని సక్రమంగా అమలు చేసినట్లయితే గ్రామీణ ప్రాంతాల్లో సుమారు 40 శాతం పేద ప్రజలు రోజు రెండు పూటలు భోజనం చేసే అవకాశం దొరుకుతుంది. కానీ పథకం అమలు తీరును పరిశీలిస్తే అది జరగడం దుర్లభమనిపిస్తున్నది.

❋❋❋

# మహిళలు - భూ పోరాటం

పి. సోమయ్య

195 ప్రజా సంఘాలు, వామపక్షాల ఆధ్వర్యంలో రాష్ట్రంలో జరిగిన భూ పోరాటం చారిత్రాత్మకమైనది. మహత్తరమైన యీ పోరాటం ఆరు నెలలపాటు కొనసాగింది. అందరికీ ఇళ్ళు, ఇళ్ళ స్థలాలు, సాగుభూమి కోసం సాగిన యీ మహోద్యమంలో పట్టణ, గ్రామీణ పేదలు సమైక్యంగా కదిలారు. ఈ కదలిక పేదల ఐక్యతకు అడ్డు గీతలుగా వున్న రాజకీయ, కుల, మత, ప్రాంతీయ వాదాలను అధిగమించింది. అట్టడుగు పేదలకు భూమి, భుక్తి కోసం సాగిన యీ ఉద్యమం మన రాష్ట్రంలో భూ సమస్యను రాజకీయ ఎజెండాగా మార్చింది. అధికార కాంగ్రెస్ మినహా అన్ని పార్టీలు, సంస్థలు,శక్తులు, వ్యక్తులు యీ ఉద్యమాన్ని బలపరచకతప్పలేదు. కొన్ని చోట్ల అధికార



భూపోరాటంలో పాల్గొన్న మహిళలపై పోలీసులు వ్యవహరించినతీరు ఇది

పార్టీ నాయకులు సైతం యీ పోరాటంలో పాల్గొనక తప్పలేదు. భూమి, గూడు కావాలనే కోర్కెతో కదులుతున్న ప్రజలను, చెదిరిపోతున్న తమ పునాదిని ప్రత్యక్షంగా చూసిన అధికార పార్టీ నాయకులు రాష్ట్రంలో అక్కడక్కడా ప్రజలతో కలిసి తమ ప్రభుత్వ విధానాలపై పోరాడక తప్పని పరిస్థితి యీ నాయకులకు కలిగింది. యీ పోరాట వత్తిడికి లొంగి రాజశేఖరరెడ్డి కాంగ్రెస్ ప్రభుత్వం తనే నియమించిన కోనేరు రంగారావు సిఫార్సులలో కొన్నింటినైనా ఆమోదించకతప్పలేదు. అనేక అవకతవకలతోనైనా ఇందిరమ్మ ఇళ్ల పేరుతో కొన్నింటినైనా పేదలకు యిళ్ళ పంపిణీ చేపట్టక తప్పలేదు. అధికార, అనధికార పక్ష నాయకులు ముఖ్యమంత్రితో సహా అనేకమంది ధనవంతులు, రియల్టర్స్, పారిశ్రామికాధిపతులు, దళారీలు, పెత్తందార్లు, బహుళజాతి సంస్థాధిపతులు రాష్ట్రంలో పేదలకు చెందాల్సిన లక్షలాది ఎకరాల అసైన్డ్, మిగులు భూములను ఏ విధంగా అన్యాక్రాంతం చేశారో యీ పోరాటం జాతీయ స్థాయిలోనే దేశ ప్రజల దృష్టికి తెచ్చింది. రాష్ట్రంలో వంద పట్టణాలు, ఎనిమిది వందల మండలాలలో సాగిన యీ మహోద్యమంలో మహిళల పాత్ర కీలకమైంది. కదలికలోనూ, ప్రచారంలోనూ, ప్రభుత్వ నిర్బంధాన్ని, పోలీసుల ఆగడాలను, దౌర్జన్యాలను తిప్పి కొట్టడంలోనూ, సమరశీలతను ప్రదర్శించడంలోనూ 3,280 పోరాట కేంద్రాలలో మహిళలు వీరోచిత పాత్రను ప్రదర్శించారు. పోలీసుల లాఠీ దెబ్బలను వేల సంఖ్యలో మహిళలు భరించారు. "మా ఆయన రోజూ తాగొచ్చి కొడ్తాడు, దెబ్బలు తిని తిని నా వీపు కాయ కాసింది. యీ పోలీసోళ్ళ దెబ్బలు నన్నేం చేస్తాయ్, మా ఆయన దెబ్బలే వీటికన్నా బలంగా వున్నాయ్" అన్నదొక మహిళ. నిత్యం ఇందిరమ్మ రాజ్యం పేరు జపించే రాజశేఖరరెడ్డి ప్రభుత్వం 7వేల మంది మహిళలపై తప్పుడు కేసులు బనాయించింది. వెయ్యి మంది మహిళలను జైళ్ళకు పంపింది. ఖమ్మం జిల్లా ముదిగొండలో పోలీసు కాల్పులు జరిపించి ఒక మహిళతో సహా ఏడుగురి పేదలను ప్రభుత్వం కాల్చి చంపింది. ప్రభుత్వం పెద్ద ఎత్తున నిర్బంధం, ఉద్యమంపై అబద్దాలతో దుష్ప్రచారాన్ని కొనసాగించినప్పటికీ యీ పోరాటాన్ని అణచలేకపోయింది. భూమి కావాలనే ప్రజల కోర్కెను తొలగించలేకపోయింది. నిర్బంధాన్ని ఎదుర్కొంటూ పేదలంతా ఆరు నెలలు దాటినప్పటికీ భూ పోరాటాన్ని కొనసాగిస్తూనే ఉండడం గమనార్హం. ప్రభుత్వం సైతం భూ సమస్య నుండి ప్రజల దృష్టిని పక్కకు మరల్చలేకపోయింది.

## మహిళలలో భూమి కావాలనే కోర్కె బలీయంగా ఉంది.

భూములు పంచుతామని, పేదలకు యిండ్లు కట్టిస్తామని అనేక వాగ్దానాలతో రాజశేఖరరెడ్డి ప్రజల ఓట్లతో అధికారమెక్కాడు. ప్రజలకిచ్చిన వాగ్దానాలను తుంగలో తొక్కాడు. 'ఏరు దాటింతర్వాత బోడు మల్లయ్య' సామెతగా రాజశేఖరరెడ్డి వ్యవహరించాడు. భూములు పంచకపోగా, గత అనేక సంవత్సరాల నుండి పేదల చేతుల్లో వున్న భూములను సైతం గుంజుకునే ప్రయత్నం రాష్ట్ర ప్రభుత్వం మొదలెట్టింది. భూ కుంభకోణాలు, కబ్జాలు, అక్రమ లావాదేవీలు,

భూ మాఫియాలు పేదల భూములు లాక్కోవడానికి యథేచ్ఛగా పూనుకున్నారు. పేదల భూమి పేదలకు దక్కని పరిస్థితి ఏర్పడింది. అసైన్డ్ భూములపై పేదలకున్న హక్కులను సైతం కాలరాయడానికి ప్రభుత్వం సుప్రీంకోర్టుకెళ్ళి 'స్టే' తెచ్చింది. అన్యాక్రాంతమైన పేదల భూములను పెద్దలకు క్రమబద్దీకరించే ప్రయత్నాలు ప్రారంభించింది. రాష్ట్రంలో 60లక్షల ఎకరాల అసైన్డ్ భూములు అన్యాక్రాంతమయ్యాయని ముఖ్యమంత్రే స్వయంగా అసెంబ్లీలో ప్రకటించాడు. మరోవైపు ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రపంచీకరణ విధానాల వల్ల పట్టణీకరణ పెరిగిపోయింది. పట్టణ ప్రాంత భూములన్నిటినీ భూ మాఫియాలు, కబ్జాదారులు పేదలను అదిరించి, బెదిరించి ఆక్రమించడం మొదలుపెట్టారు. భూముల ధరలకు విపరీతంగా రెక్కలొచ్చాయి. పేదలకు పట్టణాలలో ఉండటానికి నిలువ నీడలేని పరిస్థితి ఏర్పడింది. గత్యంతరం లేని యీ స్థితిలో పేదలు పట్టణ, గ్రామీణ ప్రాంతాలలో ముఖ్యంగా మహిళలు ఉద్యమించక తప్పని పరిస్థితులను ప్రభుత్వమే కల్పించింది. సమాజంలో అందరికంటే ఎక్కువగా కష్టపడుతూ, తక్కువ ఆదాయం పొందుతూ నిత్యం అసమానతలు, వివక్షతలు, దౌర్జన్యాలు, అత్యాచారాలకు గురౌతున్నది గ్రామీణ, పట్టణ శ్రామిక మహిళలే. పెరుగుతున్న ధరల వల్ల గృహ భారం వహిస్తున్న మహిళలపై సంసార యీతి బాధలు మరింతగా పెరిగాయి. ఉపాధి అవకాశాలు దిగజారాయి. కూలీ రేట్లలో స్త్రీ, పురుష వ్యత్యాసం కొనసాగుతున్నది. భర్త సంపాదనలో సగ భాగం త్రాగుడుకు పోవడం, తనకు వస్తున్న ఆదాయం సరిపోకపోవడం ,భర్త పురుషాధిక్య పెత్తనం, కొట్టడం, దౌర్జన్యాలు, అవమానాలకు గురికావడం, పిల్లల పోషణ, కుటుంబ సభ్యుల సంఖ్య పెరగడం, ఉన్న గుడిసె యింటిల్లపాది అందరికీ సరిపోకపోవడం, నిలువ నీడకోసం భూమి కావాలనే కోర్కె మహిళలలో అధికంగా ఉన్నది. ఉపాధి కల్పన రేటు మహిళలకు 80వ దశకంలో మన రాష్ట్రంలో 8 శాతం ఉండగా, ప్రస్తుతం అది 2 శాతానికి పడిపోయింది. వ్యవసాయ కార్మిక మహిళల వేతనాల రేటు 1999-2000 సం॥లో దేశవ్యాపితంగా 2.5 శాతం ఉంటే మన రాష్ట్రంలో అది 1.3 శాతంగా ఉంది. గృహ భారం వహిస్తున్న మహిళలపై దారిద్ర్యం యొక్క ఫలితాలు అధికంగా వున్నాయి. యీ స్థితిలో ఎటూ దారిలేని, మూలకు నెట్టివేయబడిన పిల్లి ఎదురు తిరిగినట్లుగా నేడు గ్రామీణ, పట్టణ మహిళలు తిరగబడే స్థితిలో ఉన్నారు. అయితే మహిళలను మనం తట్టి లేపినప్పుడే యిది సాధ్యమౌతుంది. భూస్వామ్య, ఫ్యూడల్, పితృస్వామిక, పెట్టుబడిదారీ వ్యాపార, వినిమయ అవశేషాలన్నీ మహిళలను పట్టి పీడిస్తున్నాయి. ఆస్తి సంబంధాలకు మూలమైన 'భూమి'పై యాజమాన్యపు హక్కు పురుషునికే వుండడం వల్ల మహిళ ఎంత చాకిరి చేస్తున్నప్పటికీ గుర్తింపు లేదు. ఇంటి పని, బయటిపని రెండింటిలోనూ శ్రామిక మహిళపై విపరీతమైన భారం, దోపిడీ పెరిగిపోయింది. అనుభవించి వదిలివేసే విలాసవస్తువుగా శ్రామిక మహిళ మారిపోయింది. మహిళలపై దాడులు, దౌర్జన్యాలు, అత్యాచారాలు, అవమానాలు, వివక్షతలలో దేశంలోనే మన రాష్ట్రం అగ్రస్థానంలో ఉంది. 2001 నుండి 2005 వరకు మన రాష్ట్రంలో 63,951 మంది మహిళలపై అత్యాచారాలు జరిగాయి. 2001లో 20,227 అత్యాచారాలతో ఉత్తర ప్రదేశ్ మొదటి స్థానంలోఉండగా 16,477 అత్యాచారాలతో మన రాష్ట్రం ద్వితీయ స్థానంలోఉంది. 2002,2003 సంవత్సరాలలో దేశంలోనే మహిళలపై అత్యాచారాలలో మన రాష్ట్రంలో మొదటి శ్రేణిలో ఉంది. 2002లో 18,880 అత్యాచారాలు, 2003లో 18,594 అత్యాచారాలు మన రాష్ట్రంలో జరిగాయి. యీ పరిస్థితులే మహిళలను భూమి, గూడు కోసం తిరుగుబాటుకు ప్రోత్సహిస్తున్నాయి. నిర్బంధాన్ని ప్రతిఘటించేటట్లు చేస్తున్నాయి. "యిదేంటి సారూ! మీరు చాలా సౌమ్యుడిగా ఉంటారని అందరూ అంటారు! యిలా నా చీరెలాగడం ఎలా భావ్యం చెప్పండి"? అని తిరుపతి భూ పోరాటంలో ఒక మహిళ పోలీస్ ఉన్నతాధికారిని నిలదీసింది. ప్రశ్నించింది. మండుటెండలో తల్లి భూ పోరాటంలో పాల్గొంటే బిడ్డ తల్లికి అన్నం కోసం యింటికెళ్తూ రైలు ప్రమాదంలో మరణించడం హైదరాబాద్ నగరవాసులను కలచివేసింది. 70 ఏండ్ల వృద్ధ మాత భూమి కోసం అన్నపానీయాలు మరచి వరంగల్ దీక్షా శిబిరంలో కూర్చోవడం అందర్నీ ఆశ్చర్యపరచింది. 15నుండి 20 రోజులపాటు జైళ్ళలో గడిపిన మహిళలే 600మంది దాకా యీ పోరాటంలో వున్నారు. మా అమ్మ, నాన్న ఇద్దర్నీ రాజశేఖరరెడ్డి ప్రభుత్వం జైళ్ళలో పెట్టింది. ఐదికెళ్ళాలంటే మమ్ములను ఎవరు చూస్తారు? మాకు అన్నం ఎవరు పెడ్తారు? కలెక్టర్ గారూ మా అమ్మ, నాన్నలను జైళ్ళ నుండి వదిలిపెట్టి మమ్ములను ఆదుకోండని పసిబాలలు ఖమ్మం కలెక్టరేట్ వద్ద ధర్నా చేయడం అందర్నీ ఆకట్టుకుంది. జైలుకైనా వెళ్తాం, పోలీస్ దెబ్బలైనా తింటాం, కానీ జెండా పాతిన యీ భూమిని వదిలేది లేదని అనేక మంది మహిళలు విశాఖ, హైదరాబాద్, విజయవాడ, వరంగల్, గుంటూరు, తిరుపతి లాంటి అనేక పట్టణాలలో తెగేసి చెప్పారు. గోషా, బురఖాలతో బయటకు రాని ముస్లిం మహిళలు సైతం పెద్ద ఎత్తున వేలాదిగా కదలి భూ పోరాటంలో పాల్గొన్నారు. భూ పోరాటానికి కులాలు, మతాలు అడ్డుకావని, ఏ మతం, కులంలో వున్నప్పటికీ పేదల ఐక్యతే పోరాటానికి కీలకమని తెలిసింది. ప్రభుత్వ నిర్బంధ చర్యలు, పోలీసుల యెడల సహజంగా ప్రజలలో ముఖ్యంగా మహిళలలో ఉండే భయ సందేహాలను యీ పోరాటం వదలగొట్టింది. సమరశీలత, ధైర్యాన్ని, పట్టుదలను ప్రతిఘటించే పద్ధతులను పోరాటం మహిళలకు నేర్పింది. పోలీస్ లాకప్, ప్రాథమిక పాఠశాల, సబ్ జైలు మాధ్యమిక పాఠశాల, సెంట్రల్ జైలు హై స్కూలు లేదాకాలేజీగా రాజ్యాంగ యంత్రం యొక్క వివిధ భాగాలు మహిళలకు మిలిటెన్సీని, పట్టుదలను, పోరాట చైతన్యాన్ని నింపాయి. అనంతపురం, కడప



పట్టణాలలో మహిళలపై కొనసాగిన నిర్బంధం వారిని మరింత పోరాట వీరులుగా మార్చింది. కడపలో పోరాటానికి నాయకత్వం వహించిన సిపియం నాయకులను ప్రభుత్వం చేతులకు బేడీలు వేసి తిప్పింది.

**భూ పంపిణీ ద్వారానే మహిళా సాధికారిత సాధ్యమౌతుంది:**

ఆస్తి సంబంధాలకు, భూస్వామ్య ఫ్యూడల్, పురుషాధిక్య అవశేషాలకు కీలకమైన సమస్య భూ సమస్యే. భూమిపై యాజమాన్యపు హక్కు మహిళలకు కల్పించడం ద్వారానే మహిళల సమస్యలు పరిష్కరింపబడతాయి. మహిళా విముక్తి సాధ్యమౌతుంది. మహిళలందరికీ తిండి, బట్ట, గూడు, చేసుకోవడానికి పని, సమాన పనికి సమాన వేతనం, సామాజిక న్యాయం కల్పించాలి. పని కోసం సుదూర ప్రాంతాలకు వలసలు వెళ్ళే పరిస్థితిని నిరోధించాలి. వారిలో అక్షరాస్యత కల్పించాలి. ఆరోగ్యం, కాన్పుల కోసం ప్రభుత్వ ఆసుపత్రులకు వెళితే సరైన వైద్యం లభించడంలేదు. ప్రైవేట్ ఆసుపత్రులలో కాన్పుకు 4 నుండి 5వేల దాకా గుంజుతారు. యింత మొత్తం పేద మహిళలు యిచ్చుకోలేని పరిస్థితి. రిజర్వేషన్ ఫలితాలు కూడా నేటి పురుషాధిక్య సమాజంలో వారికి అందడంలేదు. భర్తలు, భూస్వామ్య, పెత్తందారీ శక్తులకు లోబడి మహిళా ప్రజా ప్రతినిధులు నడుచుకుంటున్నారు. మొత్తం పెత్తనం అంతా మగవాళ్ళదే. ఆత్మగౌరవం, సాధికారిత, స్వతంత్రత, స్వావలంభన, సామాజిక చైతన్యం వారికి అవసరం. అసమానతలు తొలగిపోవాలి. యీ సమస్యలన్నీ మహిళలకు పరిష్కారం కావాలంటే వారి ఆర్థిక, కొనుగోలు శక్తి పెరగాలి. ఆస్తి సంబంధాలు, భూమిపై యాజమాన్యపు హక్కులు కల్పించినపుడే యిది సాధ్యమౌతుంది. అందుకోసం మహిళలకు భూ పంపిణీయే కీలకం. పశ్చిమబెంగాల్ వామపక్ష ప్రభుత్వం మహిళా సాధికారతకు భూ పంపిణీకి చేసిన కృషి దేశానికే ఆదర్శంగా ఉంది. 80 వేల భూ పట్టాలు వామపక్ష ప్రభుత్వం భూమితో సహా మహిళలకు ప్రత్యేకంగా పంచింది. 4లక్షల భూ పట్టాలు భార్యాభర్తల పేరుతో జాయింట్ పట్టాలుగా పంపిణీ చేసింది. 33% రిజర్వేషన్లు పంచాయితీ ఎన్నికలలో మహిళలకు కల్పించింది. పాలనాధికారంలో వారిని భాగస్వామ్యం చేసింది. బెంగాల్ పంచాయితి ఎన్నికలలో 40 శాతానికి పైగా, మహిళా అభ్యర్థులు గెలవడం చారిత్రకమైన విషయం. వారికి రిజర్వు చేయబడిన 33శాతం కన్నా యిది అధికం. మహిళా సాధికారత సాధ్యమైంది. వామపక్ష ప్రభుత్వం సమాన హక్కులు మహిళలకు కల్పించింది. మహిళలు బెంగాల్‌లో ఉత్పత్తిదారులుగానూ, పాలనాధికారులుగానూ గ్రామస్థాయి నుండి ఉన్నత స్థాయి వరకు ఎదిగారు. మహిళలలో అక్షరాస్యత రేటు పెరిగింది. కొనుగోలు, ఆర్థిక శక్తిలో ఆ రాష్ట్ర మహిళలు ముందున్నారు. గ్రామీణ ప్రజల కొనుగోలు శక్తి 20వేల కోట్ల రూ.ల మేరకు పెరిగిందని ఆ ప్రభుత్వ లెక్కలు చెబుతున్నాయి. అక్షరాస్యత రేటు 1991లో 57.7శాతం వుంటే 2001 నాటికి అది 69.22 శాతానికి పెరిగింది. ధాన్యం ఉత్పత్తి 1977లో 89.77 లక్షల టన్నులువుంటే, 2004నాటికి యిది 1,59,54,000 టన్నులకు పెరిగింది. మహిళలపై అత్యాచారాలు, అవమానాలు తగ్గాయి.

**భూ పోరాటానికి నాయకత్వంలో మహిళలు ముందుండాలి**

భూస్వామ్య, పెట్టుబడిదారీ నేటి సమాజం మహిళలకు ప్రధానమైన శత్రువు. స్త్రీ, పురుష అసమానతల కొనసాగింపుకు యీ సమాజం కేంద్రంగా వున్నది. మహిళల అస్థిత్వం, ఉనికికి ఈ సమాజమే ప్రధానమైన ఆటంకం. మహిళ జీవితం ఆరు దశలుగా కొనసాగుతుంది. 1 పిండోత్పత్తి, 2. శిశువు, 3. కౌమారం, 4. మాతృత్వం, 5. మెనోపాజ్, 6. వృద్ధాప్యం. యీ ఆరు దశలలో కూడా ఫ్యూడల్ అవశేషాలకు కీలకమైన పురుషాధిక్య సమాజం మహిళల ఉనికిని కాటేయడానికి పంచపాళీలోని పాములలాగా పొంచి ఉంటాయి. పురుషాధిక్య సమాజం యీ ఆరు దశలలో ఏ దశలోనైనా మహిళను కాటేయడానికి సిద్ధంగా ఉంటుంది. తల్లి గర్భంలో పిండంగా వున్నప్పుడే 'హత్య'కు (గర్భస్రావం) గురికాకుండా తప్పించుకోవాలి. పుట్టిన తదుపరి మహిళా శిశువుగా పోషణ సంరక్షణలలో ప్రదర్శితమయ్యే లింగ వివక్షతను ఎదుర్కోవాలి. నేడు ఆసుపత్రులలో మహిళా శిశువుల అమ్మకం చూస్తూనే ఉన్నాము. 1981లో స్త్రీ, పురుష నిష్పత్తి 934:1000గా ఉంటే 1991లో అది 929:1000గా పడిపోయింది. భ్రూణ హత్యలు జరిగాయి. మగ పిల్లలకు చనుబాలు యిచ్చినంత కాలం ఆడపిల్లలకు యివ్వడం లేదు. మగ పిల్లలకు సగటున 25.3 మాసాలు చనుబాలు యిస్తే ఆడపిల్లలకు 23.6 మాసాలు చనుబాలు యిస్తున్నట్లు 1992-93 సం॥లో ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ పాపులేషన్ సర్వే రిపోర్టులు తెలియజేశాయి. 'కౌమార దశ'లో హత్యలు, అత్యాచారాలు, అవమానాలకు గురికావడం ఎదుర్కోవాల్సి ఉంటుంది. 'మాతృత్వ' దశలో భర్త చేతిలో శారీరక, మానసిక, గృహ హింసకు గురికావడాన్ని ఎదుర్కోవాలి. మెనోపాజ్ దశలో క్యాన్సరు, హృద్రోగాలు, మధుమేహం వంటి మొండి రోగాలతోపాటు కుటుంబీకుల అనాదరణకు గురి కావల్సివుంటుంది. ఆరవ దశకమైన వృద్ధాప్యంలో అధిక అనారోగ్యం, అనాదరణ, అనేక యీతి బాధలను శిక్షగా అనుభవిస్తుంది. యీ మొత్తం మహిళ అస్థిత్వానికి, ఉనికికి భూ స్వామ్య, పెట్టుబడిదారీ సమాజమే ప్రధానమైన కారణం. భూస్వామ్య వర్గ సమాజ లక్షణమైన 'భూ కేంద్రీకరణ'ను పెట్టుబడిదారీ అవశేషాలైన వ్యాపార, వినిమయ, సంస్కృతికి వ్యతిరేకంగా మహిళలు ముందుండి పోరాడడం వారి ప్రధానమైన బాధ్యత. భూ పోరాటంలో పాల్గొనడం, భూ పంపిణీకై డిమాండ్ చేయడంలో వారు ముందు వరుసలో వుండాలి. భూ పోరాటాలలో పాల్గొనడం వారిఅస్థిత్వం, ఉనికి, మనుగడ కోసం తప్పనిసరి అవసరంగా వారు గుర్తించాలి. భూ పోరాటాలలో మహిళల భాగస్వామ్యం మరింతగా పెంచడం మన అందరి కర్తవ్యం, మహిళల ప్రధాన బాధ్యత.

మహిళా ఉద్యమ అవశ్యకతపై మార్క్సిస్టు మహోపాధ్యాయులు దిగువ మాటలు సదా మన దృష్టిలో వుండాలి.

"ప్రైవేట్ డొమెస్టిక్ వర్క్"ను "పబ్లిక్ ఇండస్ట్రీ"గా మార్చాలి - ఎంగెల్స్

(ఇంటి పనిని సామాజిక పరిశ్రమగా గుర్తించాలి)

"ప్రతి వంటగత్తె ఒక రాజకీయవేత్తగా తయారవ్వాలి" లెనిన్

"మహిళలు తమ భుజాలపై ఆకాశంలో సగ భాగాన్ని మోస్తున్నారు. వారు దీన్ని గెలుచుకోవాలి" - మావో.

***

# చూడచక్కని చెల్లమ్మా

సాకి: ఆదర్శ వనితవి మా చెల్లి.......
సావిత్రి.......అందుకో జోహార్లు
అందుకో వందనాలు

పల్లవి: చూడచక్కని చెల్లమ్మా
చుక్కల్లో జాబిల్లి చెల్లమా
ఆట పాటల్లోను చెల్లమ్మా
నీకు ఆటల్లో పాఠమే చెల్లమా
ఆకలి దూపల్లో చెల్లమ్మా
నీవు అన్ని మరిచితివి చెల్లమ్మా ॥చూడచక్కని॥

చరణం: పలకా బలపం పట్టి చెల్లమ్మా
నీవు బడికి వెల్తివా చెల్లమ్మా
సంచి సంకకేసి చెల్లమ్మా
నీవు చదువుకోను వెల్తివే చెల్లమ్మా
పాలమూరు జిల్లా చెల్లమ్మా
కరువు కాటక జిల్లా చెల్లమ్మా ॥చూడచక్కని॥

పేదరైతు ఇంట్లో చెల్లమ్మా
నీవు పుట్టి పెరిగినావు చెల్లమ్మా
విద్యార్థి పోరులో చెల్లమ్మా
నీవు పిడికిలి బిగించి చెల్లమ్మా
గ్రాం: బిజ్జువారలో చెల్లమ్మా
బీజాలు వేస్తివె చెల్లమ్మా ॥చూడచక్కని॥

మహిళ ఉద్యమాల కొరకు చెల్లమ్మా
నీవు పట్నం వస్తివె చెల్లమ్మా
మహిళలందరిని చెల్లమ్మా
నీవు కూడగట్టినావు చెల్లమ్మా
స్నేహ ఇంటి పనివారలకు చెల్లమ్మా
సంఘం పెట్టినావు చెల్లమ్మా
పొదుపు గ్రూపు సంఘాలను చెల్లమ్మా
ముందుండి నడిపావు చెల్లమ్మా ॥చూడచక్కని॥

ఐద్వా జెండా పట్టి చెల్లమ్మా
నీవు త్యాగాల బాటలో చెల్లమ్మా
తెగించి పోరులో చెల్లమ్మా
నీవు నేలకొరిగినావు చెల్లమ్మా
శోక సముద్రంలో చెల్లమ్మా
జనం శోకాలు పెట్టిరి చెల్లమ్మా
జోహార్లు సావిత్రి చెల్లమ్మా
అందుకో జోహార్లు చెల్లమ్మా
నీవు అందుకో చెల్లమ్మా జోహార్లు

- పొన్న అంజయ్య

(24-3-2007 తేదీన అనారోగ్యంతో చనిపోయిన ఐద్వా హైదరాబాద్ నగర నాయకురాలు జి. సావిత్రికి జోహార్లు)

# కొంచం ఎక్కువ సమానం

- అమ్మాజీ

"ఏదో ముఖ్యమయిన విషయం మాట్లడాలి రమ్మన్నారు. వచ్చి అరగంట దాటింది. ఇంతవరకూ ఆ ప్రస్తావనే తేలేదు" చేతిలో వున్న ఖాళీ కప్పుని టేబుల్ మీద పెడుతూ అంది లోహిత.

"అదే! ఎలా మొదలుపెట్టాలా అని ఆలోచిస్తున్నాను. ఏ విషయమైనా స్ట్రయిట్‌గా మాట్లాట్టమే నాకలవాటు. సో, విషయాన్ని డైరెక్టుగా చెప్పేస్తాను. లోహితా! మనిద్దరం కలసి ఈ కంపెనీలో వర్క్ చేయటం మొదలుపెట్టి నాలుగేళ్ళు దాటింది. ఈ నాలుగేళ్ళలో ఒకర్ని ఒకరం పూర్తిగా కాకపోయినా చాలా వరకే అర్థం చేసుకోగలిగాం అనుకుంటున్నాను." చెప్పటం ఆపి లోహిత వైపు ప్రశ్నార్థకంగా చూశాడు రూపేష్.

అవునన్నట్టు తలూపింది లోహిత. మళ్ళీ చెప్పటం మొదలెట్టాడు. ఇంక అసలు విషయానికొస్తే ఈ నాలుగేళ్ళ పరిచయంలో నువ్వంటే నాకెంతో అభిమానం ఏర్పడింది. దానిక్కారణం నీ బిహేవియర్, వర్క్‌లో నీ ఎఫీషియన్సీ, స్టాఫ్‌తో నువ్వు మూవ్ అయే పద్ధతి, వీటన్నింటినీ మించి నీ చిరునవ్వు నాకెంతో నచ్చాయి. ముఖ్యంగా నీ ఓర్పు నన్నెంతగానో యింప్రెస్ చేసింది. అందుకే నీలాంటి అమ్మాయి నా జీవిత భాగస్వామి కావాలని కోరుకుంటున్నాను. లోహిత ముఖంలోకి పరీక్షగా చూస్తూ చెప్పాడు.



టేబుల్ మీదున్న ఖాళీ కప్పుని కుడిచేతి చూపుడువేలుతో గుండ్రంగా తిప్పుతూ అతను చెప్పేదంతా మౌనంగా, శ్రద్ధగా వింటోంది ఆమె. అతను తనతో పర్సనల్‌గా మాట్లాడాలి అన్నప్పుడే విషయాన్ని కొంతవరకు ఊహించగల్గింది ఆమె. కాబట్టి యిప్పుడు ఆమెకీ విషయం ఏమంత ఆశ్చర్యం అనిపించలేదు.

"థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్. మీరన్నట్లు మనిద్దరిమధ్య కొంత అవగాహన వుండటం వాస్తవమే. కానీ నేను ఈ రోజుదాకా మిమ్మల్ని కేవలం ఒక సహోద్యోగి మాత్రమే చూడగలిగాను. సో, ఆ యాంగిల్ నుంచే మిమ్మల్ని అర్థం చేసుకున్నాను. మీకు ఆఫీసులో ఎంతో మంచిపేరుంది. నిజానికి మీ ప్రపోజల్‌ని కాదనటానికి పెద్ద కారణాలేమీ లేవు. కానీ, ఇది జీవితానికి సంబంధించిన విషయం కదా! కాబట్టి నిర్ణయం తీసుకునే ముందు బాగా ఆలోచించుకోవటం మంచిదని నా అభిప్రాయం. అంతే కాకుండా మా పేరెంట్స్‌తో కూడా సంప్రదించాలి కదా! అందుకని నాకు కొంత టైం కావాలి" నిదానంగా, ఎంతో నిబ్బరంగా చెప్పింది లోహిత.

"నేను కూడా ఇప్పటికిప్పుడే చెప్పమనటం లేదు. బాగా ఆలోచించుకున్నాకే ఒక నిర్ణయానికి రండి. కానీ నువ్వు చెప్పే సమాధానం పాజిటివ్‌గా వుండాలనేది నా ఆశ". ఆమె కళ్ళల్లోకి చూసి చిన్నగా నవ్వుతూ చెప్పాడు రూపేష్.

ఆ క్షణంలో అతని కళ్ళల్లో లోహిత మీద అతనికున్న ప్రేమ, అభిమానం ఎంతో స్పష్టంగా కనిపించింది. అది చూసిన లోహిత తనకు తెలీకుండానే కొద్దిగా సిగ్గుపడింది.

మళ్ళీ యిద్దరి మధ్య కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

ఆ కొద్ది క్షణాల్లో లోహిత మనసులో ఏం ఆలోచిస్తోందో రూపేష్‌కి తెలీదు కానీ, అతను మాత్రం హాసినిని గురించి ఆమెకి చెప్పాలా? వద్దా? అనే మీమాంసలో వున్నాడు.

లోహితకి మాత్రం అక్కణ్ణుంచి ఎంత తొందరగా బయట పడదామా అని వుంది. ఆమె ఇంతకు ముందెప్పుడూ ఇలాంటి సిట్యుయేషన్ ఫేస్ చేయకపోవటం వల్ల కొంచెం యిబ్బందిగానే వుంది. విషయం మాట్లాడటం అయిపోయింది కాబట్టి ఇంక బయల్దేరటం మంచిదనిపించింది.

"రూపేష్! నేనింక వెళతాను. ఇంట్లో మా పేరెంట్స్ ఎదురు చూస్తుంటారు". అంటూ లేవబోయింది.

"లోహితా! కొంచెం సేపు కూర్చో. నీతో యింకో ముఖ్య విషయం మాట్లాడాలి." ఈసారి అతని గొంతు ఎంతో గంభీరంగా మారింది. ఆమె కూర్చుంది.

రూపేష్ చెప్పటం మొదలుపెట్టాడు.

"లోహితా! మన పెళ్ళి గురించి నువ్వు నిర్ణయం తీసుకునే ముందే నీకొక ముఖ్య విషయం చెప్పాలి. ఒకవేళ మనం భార్యా భర్తలం అయితే మన మధ్య ఎలాంటి రహస్యాలు వుండకూడదు. అందుకే నీకీ విషయం చెప్పాలని నిర్ణయించుకున్నాను.

నేను ఎం.బి.ఎ. చేసేటప్పుడు నా క్లాస్‌మేట్ 'హాసిని' అని ఒకమ్మాయి వుండేది. మేమిద్దరం ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకుని కలసి బ్రతకాలని ఎంతో ఆశపడ్డాం. దాదాపు ఐదేళ్ళు యిద్దరం ఒకర్ని

విడిచి ఒకరం వుండలేమనట్లుగా కలిసి తిరిగేవాళ్ళం. కానీ దురదృష్టవశాత్తు హాసిని తల్లిదండ్రులు కులం పేరుతో మాపెళ్ళికి ససేమిరా అన్నారు. ఆమెకిష్టం లేకపోయినా బలవంతంగా వాళ్ళకి నచ్చిన కుర్రాడికిచ్చి పెళ్ళి చేశారు. పాపం! హాసిని ఎంత ఏడుస్తూ ఆపెళ్లి చేసుకుందో నాకు తెలుసు. వాళ్ళ పేరెంట్స్ అన్న మాటలకి మా వాళ్ళకి కూడా పౌరుషం పొడుచుకొచ్చింది. దాంతో నన్ను నోరెత్తనియ్యలేదు. పోనీ యిద్దరం వెళ్ళిపోయి పెళ్ళి చేసుకుందాం అనుకున్నాం. కానీ హాసినిని పెళ్ళి రోజుదాకా గదిలో పెట్టి బంధించారు. ఇన్ని పరిస్థితుల మధ్య నేను చేతకాని వాడిలాగా వుండి పోవాల్సివచ్చింది. చెవ్పటం ఆపి కొంచెం భారంగా శ్వాస తీసుకున్నాడు. రూపేష్ ఇదంతా చెప్తున్నప్పుడు అతని కళ్ళల్లో ఉబికిన కన్నీళ్ళని లోహిత చూసింది. కానీ రూపేష్ వాటిని బయటికి రానీకుండా టేబుల్ మీదున్న మంచినీళ్ళ గ్లాసు అందుకుని గటగట తాగేశాడు. హాసినిని అతను ఎంత గాఢంగా ప్రేమించాడో అర్థమయింది లోహితకి.

ఆ టైంలో ఏం మాట్లాడాలో అర్థం కాలేదు లోహితకి. కానీ మౌనంగా కూర్చుంటే బాగుండదని రూపేష్ భుజం మీద చేయివేసి "రూపేష్! ప్లీజ్ రిలాక్స్" అంది అనునయంగా

'ఇట్స్ ఓ.కె' అంటూ కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుని మళ్ళీ చెప్పటం మొదలు పెట్టాడు. 'హాసిని దూరం అయాక మానసికంగా ఎంతో దెబ్బతిన్నాను లోహితా! జీవితంలో అసలు పెళ్ళే చేసుకోకూడదని నిర్ణయించుకున్నాను. కానీ నీతో పరిచయం మళ్ళీ నా జీవితంలో కొంత మార్పు తెచ్చింది. నిన్ను పెళ్ళి చేసుకుంటే నువ్వు నన్ను బాగా అర్థం చేసుకోగలవని, నేను కోరుకునే ప్రేమని తిరిగి నాకు అందించగలవని నాకనిపించింది. అందుకే నేనీ నిర్ణయానికొచ్చాను" చెప్పటం ఆపాడు.

లోహిత ఆలోచిస్తోంది. ఈసారి చాలా తీవ్రంగా ఆలోచిస్తోంది. పెళ్ళి గురించి నిర్ణయం తీసుకునే ముందే నీకు అన్ని విషయాలు తెలియటం మంచది కదా! అందుకే నీ దగ్గర ఏమీ దాచదల్చుకోలేదు." అన్నాడు రూపేష్.

ఆమాటలు చెప్పేటప్పుడు అతని గొంతులో ధ్వనించిన సిన్సియారిటీ లోహితకెంతో నచ్చింది. ప్రస్తుతం అతను చెప్పింది వినటం తప్ప తను మాట్లాడేది ఏమీ లేదనిపించింది.

కొంతసేపటి తర్వాత రూపేష్ దగ్గర శలవు తీసుకుని కాఫీ డేలో నుంచి బయటికి నడిచింది లోహిత.

వారం రోజుల తర్వాత

అదే కాఫీ డే

అనుకోకుండా అదే టేబుల్

ఆ టేబుల్ ముందు మళ్ళీ వాళ్ళిద్దరే.

పది నిమిషాల మౌనం తర్వాత అడిగాడు రూపేష్ "మన పెళ్ళి గురించి ఏం నిర్ణయం తీసుకున్నారు? మీ పేరెంట్స్‌తో మాట్లాడావా?"

'మాట్లాడాను. మన పెళ్ళి జరగటమా? లేదా? అనేది ఇప్పుడు పూర్తిగా మీ నిర్ణయం మీదే ఆధారపడబోతోంది." చెప్పింది లోహిత.

ఆ మాటలకి కొంచెం షాక్ అయాడు రూపేష్. నిజం చెప్పాలంటే అతనికి లోహిత మాటలు సరిగ్గా అర్థమే కాలేదు. అదే చెప్పాడు ఆమెకి "మీరంటున్నది ఏంటో నా కర్థం కాలేదు".

"మీ గురించి, మీరుచెప్పిన విషయాల గురించి మా పేరెంట్స్‌కి చెప్పాను. ఆఫీసులో మీకెంత మంచి పేరుందో కూడా చెప్పాను. వాళ్ళెంతో సంతోషించారు. ముఖ్యంగా మీరు ఏ దాపరికం లేకుండా మీ వ్యక్తిగత విషయాలన్నీ చెప్పటం మా నాన్నగార్ని ఎంతో ఇంప్రెస్ చేసింది". చెప్పటం ఆపింది.

'అలాంటప్పుడు ప్రత్యేకించి మళ్ళీ నా నిర్ణయం ఎందుకు అడుగుతున్నారు?" అయోమయంగా అడిగాడు.

"మీరు మీ ప్రేమ గురించి చెప్పారని తెలియగానే మా నాన్నగారు నాకు ఒక సలహా యిచ్చారు. నిజం చెప్పాలంటే హీ ఈజ్ మై బెస్ట్ ఫ్రెండ్. ఏ విషయాన్నయినా మేమిద్దరం ఒకరితో ఒకళ్ళం షేర్ చేసుకుంటాం."

"ఇంతకీ మీ ఫాదర్ యిచ్చిన సలహా ఏంటి?" అడిగాడు రూపేష్. అతని గొంతులో ఆతృత, అసహనం రెండూ తెగ పోటీపడుతున్నాయి.

"మీకున్నట్టే నా జీవితంలో కూడా ఒక ప్రేమ కథ వుంది. మీరింత ఓపెన్‌గా మీ గురించి చెప్పుకున్నప్పుడు నేను నా విషయం దాచిపుచ్చటం మంచిది కాదన్నది మా నాన్నగారి అభిప్రాయం. అదే కాక ఒక వేళ మనకి పెళ్ళయితే ప్రతిక్షణం నేను మిమ్మల్ని మోసం చేశానేమో అనే భావన నాక్కూడ కలగవచ్చు. అందుకే మా నాన్నగారు మీకు నా ప్రేమ విషయం చెప్పటం మంచిదని సలహా యిచ్చారు". చెప్పింది లోహిత.

ఆ మాటలకి కొంచెం ఖంగుతిన్నాడు రూపేష్. అంతలోనే తేరుకుని "ఓ.కె. చెప్పు" అన్నాడు.

లోహిత చెప్పటం మొదలుపెట్టింది.

"నేనీ ఉద్యోగంలో చేరిన కొత్తల్లోనే మా అక్క పెళ్ళయింది. పెళ్ళికి మా బావ ఫ్రెండ్స్ చాలామంది వచ్చారు. వాళ్ళలో ఒకతనికి నేను బాగా నచ్చానట. బావ దగ్గర నా సెల్ నెంబరు తీసుకుని అప్పుడప్పుడు ఫోన్ చేస్తూ ఉండేవాడు. అలా ఫోన్లతో మొదలైన మా పరిచయం ప్రేమగా మారింది. ఇద్దరం అప్పుడప్పుడు సరదాగా సినిమాలకని, షికార్లకని వెళ్తుండేవాళ్ళం. అతను ఎన్నోసార్లు నాతో "నువ్వు లేకుండా నేను బ్రతకలేను" అంటుండేవాడు. అతనలా అన్నప్పుడల్లా నాకెంతో గర్వంగా, వట్టరాని ఆనందంగా వుండేది. అలా రెండేళ్ళు గడిచిపోయాయి.

తర్వాత అతను చిన్న చిన్నగా ముఖం తప్పించటం మొదలుపెట్టాడు. నాకెందుకో అనుమానం వచ్చింది. ఎందుకైనా మంచిదని ఒకరోజు గట్టిగా పట్టుబట్టాను. 'మన పెళ్ళి విషయం మా పేరెంట్స్‌తో చెపుదాం. తర్వాత వాళ్ళే వచ్చి మీ వాళ్ళతో మాట్లాడతారు ఇంటికి రమ్మని' బలవంతం చేశాను. నాకు మా అమ్మ నాన్నల గురించి బాగా తెలుసు. వాళ్ళు పిల్లల్ని అర్థం చేసుకోగలరు. వాళ్ళు తమ పెంపకంలో పిల్లలకి స్వేచ్ఛనివ్వటంతోపాటు మంచి చెడులను గురించి ఆలోచించగల విజ్ఞతని కూడా నేర్పారు. అందుకే అతనితో అంత నమ్మకంగా చెప్పగలిగాను.

అసలు సంగతి అప్పుడు బయటపెట్టాడు. అతనికి వేరే అమ్మాయితో మ్యారేజ్ సెటిలయిందట. ఆ విషయం నాకెలా చెప్పాలో

తెలియక పాపం చాలా యిబ్బంది పడుతున్నాడట. అంతేకాదు. ఆ పెళ్ళికి తను ఎలాంటి పరిస్థితుల్లో ఒప్పుకోవాల్సి వచ్చిందో కూడా చెప్పబోయాడు. నేనే చెప్పొద్దన్నాను. ఆ వివరాలన్నీ నాకవసరం లేదనిపించింది. అతన్ని నేను ఒక్కటే అడిగాను 'నువ్వు చెప్పేది నిజమేనా? నన్నేడిపించటానికి జోక్ చేస్తున్నావా?' అని.

'జోక్ కాదు లోహిత. నేను చెప్పేది అక్షరాల నిజం' అని ఒట్టేసి మరీ చెప్పాడు.

అదే మాయిద్దరి చివరి కలయిక. ఆతర్వాత అతన్ని నా ఆలోచనల్లోంచి బలవంతంగా,నిర్ధాక్షిణ్యంగా నెట్టేశాను. ఆ అనుభవం తర్వాత మళ్ళీ పెళ్ళి గురించి గానీ, కాబోయే భర్త గురించి గానీ ఆలోచించాలనిపించలేదు.

మీరు ఆ రోజు నాతో మాట్లాడిన తర్వాత యింటికెళ్ళి రెండు రోజులు చాలా తీవ్రంగా ఆలోచించాను. ఇద్దరం ఒకే పడవలో ప్రయాణం చేస్తున్న ప్రయాణికుల్లా అనిపించింది నాకు. ఇద్దరం ప్రేమించి గాయపడ్డ వాళ్ళమే. కాకపోతే పరిస్థితులే భిన్నంగా వున్నాయి. మనిద్దరి జీవితంలో కావల్సింది ఒక్కటే. మన బాధని అర్థం చేసుకుని మనల్ని ప్రేమించే వ్యక్తి. సో, మనం భార్యాభర్తలమయితే 'మనం పోగొట్టుకున్నాం' అనుకుంటున్న ప్రేమని పరస్పరం పొందగలమని అనిపించింది. అందుకే మిమ్మల్ని పెళ్ళి చేసుకోవటానికి నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను."

లోహిత తనుచెప్పదలుచుకున్న విషయాలన్ని స్పష్టంగా చెప్పింది.

ఆమె మాట్లాడుతున్నంతసేపు రూపేష్ మౌనంగా వింటూ కూర్చున్నాడు.

రెండు నిమిషాలు నిశ్శబ్దం తర్వాత మళ్ళీ లోహితే అంది. "రూపేష్ యిప్పటిదాకా మీకు తెలిసింది మీ కొలీగ్ లోహిత మాత్రమే. బహుశ లోహిత గురించి యిప్పుడు మీకు పూర్తిగా అర్థం అయుంటుంది. సో, మన పెళ్ళి గురించి మీరు మళ్ళీ ఒకసారి ఆలోచించుకుని మీ అభిప్రాయాన్ని చెప్పండి."

'సరే' అన్నట్టు తలూపాడు రూపేష్. ఇద్దరూ కాఫీడే లోంచి బయటికి నడిచారు.

నెల రోజుల తర్వాత

అదే కాఫీ డే.

కానీ టేబుల్ మాత్రం అదికాదు

టేబుల్ ముందు కూర్చుని లోహిత, రూపేష్.

రూపేష్ వెళ్ళి రెండు కాఫీలు తెచ్చి ఒకటి లోహిత ముందు పెట్టి తీసుకోమన్నట్టు కప్పు ఆమె ముందుకు జరిపాడు. రెండు నిమిషాల తర్వాత చేతిలో వున్న బ్యాగ్‌లోనుంచి ఒక కవరు తీసి లోహితకి అందిస్తూ "తీసుకోండి" అన్నాడు.

"ఏంటిది శుభలేఖలా వుందే" అందుకుంటూ అంది లోహిత.

"అవును. నా పెళ్ళి శుభలేఖ. పెళ్ళి ఈనెల ఇరవైమూడున. మీరు తప్పకుండా రావాలి" రూపేష్ ఆ మాటలు ఎంత సహజంగా చెప్పాలని ప్రయత్నించినా అతని గొంతు మాత్రం కొంచెం తడబడింది.

"ష్యూర్ బైదిబై కంగ్రాట్స్" చిరునవ్వుతో చెప్పింది లోహిత.

శుభలేఖ తీసి చదువుతూ ''పెళ్ళి కూతురు ఎవరు? బంధువులమ్మాయా?''అడిగింది.

"బంధువులమ్మాయి కాదు. కానీ చిన్నప్పట్నుంచి మాకు బాగా తెలిసినమ్మాయి. ముఖ్యంగా అమ్మా నాన్నలకి ఆ అమ్మాయి అంటే చాలా యిష్టం. తను కూడా యిక్కడే జాబ్ చేస్తోంది". కాఫీ కప్ అందుకుని సిప్‌చేస్తూ చెప్పాడు.

"గుడ్ మరి ఆ అమ్మాయికి హాసిని గురించి చెప్పారా?" అతని ముఖంలోకి పరీక్షగా చూస్తూ అడిగింది.

"చెప్పలేదు" అన్నాడు అతను.

"ఒక వేళ పెళ్ళి అయాక ఆమెకి హాసిని గురించి తెలిస్తే".

"అప్పుడు నేను ఆమెని కన్విన్స్ చేసుకోగలనన్న నమ్మకం నాకుంది."

"ఆమె గురించి పూర్తిగా తెలుసుకున్నారా?"

"అఫ్‌కోర్స్. తెలుసుకోవల్సిన అవసరం లేదనిపించింది." ఇద్దరూ కాఫీ తాగటం పూర్తయింది.

రూపేష్ లేచి నుంచుంటూ "లోహిత! వెళ్దామా?"అన్నాడు.

"సారీ! నాక్కొంచెం పనుంది. మీరు వెళ్ళండి. నేను తర్వాత వస్తాను." అంది.

రూపేష్ వెళ్ళిపోగానే లోహిత తన హ్యాండ్ బ్యాగ్ లోంచి సెల్ తీసి గబగబా నెంబర్ డయల్ చేసింది.

''హలో డార్లింగ్! చెప్పు'' అవతల్నించి తండ్రి గొంతు వినిపించింది.

" హాయ్ డాడీ! నీకో గుడ్ న్యూస్". లోహిత ఎంతో ఉత్సాహంగా చెప్పింది.

"గుడ్ న్యూస్? ఏంటది?"

"రూపేష్ మ్యారేజ్ సెటిలయింది డాడీ. ఈ నెల ట్వెంటీ థర్డ్‌న" పక పకా నవ్వుతూ చెప్తోంది.

"ఐసీ! అదా నీ ఆనందం. కంగ్రాట్స్" అవతల్నించి ఆమె తండ్రి కూడా నవ్వుతూ చెప్పాడు.

"ఎవరికి? నాకా? అతనికా?"

"ఇద్దరికీ. పెళ్ళి కుదిరినందుకు అతనికి. ఒక మంచి నిర్ణయం తీసుకోగల్గినందుకు నీకు."

"థాంక్యూ డాడీ! ఆ రోజు నేను చెప్పిన మాటలు ఎంత కరక్టో చూశారా? అతనికి కేవలం అతన్ని ప్రేమించే మనిషి, అతన్ని సుఖపెట్టే మనిషి కావాలి. కానీ నాకు మాత్రం పరస్పరం ప్రేమని పంచుకోగల వ్యక్తి కావాలి. అందుకే చిన్న అబద్ధం చెప్పాను. విషయం క్లియర్ అయిపోయింది. మరి అదే డాడీ మగాళ్ళంటే". చివరి మాటని వత్తిపలుకుతూ చెప్పింది లోహిత.

"ఓ.కె.! ఒప్పుకుంటున్నాను. ఒక విషయం చెప్పు. ఆ రోజు రూపేష్ గురించి నీ అభిప్రాయం చెప్పమంటే 'అప్పుడే చెప్పను డాడీ. అతన్ని పూర్తిగా స్టడీ చేయాలి.' అన్నావు కదా! బహుశా ఈ పాటికి అతని మీద నీకొక అభిప్రాయం ఏర్పడే వుండాలి. అవునా? సో, యిప్పుడు చెప్పు. అతని గురించి నీ అభిప్రాయం ఏంటి?" సాలోచనగా అడిగాడు లోహిత తండ్రి.

'ఇట్స్ వెరీ సింపుల్ డాడ్. అతను ఒక అసంపూర్ణ వాక్యం. దట్సిట్" నవ్వుతూ చెప్పింది.

***

# గౌరవ హత్యలపై ఐద్వా సమరం

-సుధాకిరణ్ .వి.

దీ హర్యానా రాష్ట్రం లోని ఓ పట్టణం. అక్కడి నుండి సమీప గ్రామాలకి బస్సు బయలు దేరింది. ఆ బస్సులో బిక్కు బిక్కు మంటూ ఓ జంట. రక్షణ కలిపించమంటూ కోర్టు పోలీసులకి యిచ్చిన ఆదేశాలు వారి చేతిలో.... ప్రాణాలన్నీ ఆ కాగితాల్లోనే పెట్టుకుని భయం.. భయంగా వారు! అంతలో వారి బస్సుకి అడ్డంగా పోలీస్ జీపు వచ్చింది. పోలీసులను చూడగానే వారికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లు అయ్యింది. ఆనందంగా పోలీసు రక్షణలోకి వెళ్ళారు. ప్రయాణం బస్సు నుండి జీపులోకి మారింది. తారురోడ్డు నుండి మట్టి బాటకు వచ్చాక జీపు ఆగింది. అప్పటివరకు దాపులనే ఉన్న అమ్మాయి తరుపు బంధువులు అబ్బాయి పీకకు తాడువేసి లాగి లాగి ఈడ్చి చంపారు. అమ్మయికి బలవంతంగా నోట్లో విషం పోసి చంపారు. ఇద్దరి శవాల్ని బరువు పెట్టి తాడుతో కట్టి దాపులనే ఉన్న కెనాల్‌లో పోలిసుల సాయంతో వేశారు.

ఒకే గోత్రంకి చెందిన ఇద్దరు ప్రేమించి పెళ్ళి చేసుకోవడమే వారు చేసిన తప్పు. ఇరుపక్షాల బంధువులు ఆగ్రహించారు. అమ్మాయి తరపు బంధువులు ఈ పాశవిక హత్యా కాండను చేశారు. ఇలా చేసిన హత్యలను 'గౌరవ హత్యలని" హర్యానా రాష్ట్రంలో ఘనంగా పిలుస్తున్నారు. వీటిని హర్యానా సమాజం సైతం మౌనంగా వీక్షిస్తోంది. ఏ గ్రామము వీటికి మినహాయింపు లేదు. వెలుగులోకి వచ్చేవి చాలా తక్కువ. కేసుల దాక వచ్చేవి ఇంకా తక్కువ. "హర్యానా రాష్ట్రంలో చాలా గ్రామాల్లో కులపంచాయితీలదే రాజ్యం". "గ్రామ పెద్దలు చెప్పిందే వేదం". దీన్ని అతిక్రమించి వెళ్లిన వారికి ఇంచుమించు ఇలాంటి శిక్షనే వారు నిర్ణయిస్తారు. పోలీసు వ్యవస్థ మద్దతు కూడా వీరికే ఉంది. ఐద్వా బాధిత వ్యక్తులకు అండగా నిలుస్తోంది. బహిరంగ విచారణకు సిద్దం కమ్మని రాష్ట్ర ప్రభుత్వాన్ని సవాలు చేస్తుంది. జాతీయ మహా సభలు కోల్‌కటాలో జరిగిన సంధర్భంగా హర్యానా రాష్ట్ర కార్యదర్శి 'జగ్‌మతి సాంగ్వ' యిచ్చిన యింటర్వ్యూ విశేషాలు...

మా రాష్ట్రంలో కులాంతర వివాహాలు, మతాంతర వివాహాలు, ఒకే గోత్రంకి చెందిన అబ్బాయి అమ్మాయి పెండ్లి చేసుకోవడం చాలా పెద్ద నేరంగా భావిస్తారు. పంచాయితీ పెద్దలు ప్రతి విషయంలోనూ జోక్యం చేసుకుంటూనే ఉంటారు. తింటానికి తిండి లేకపోయినప్పటికీ తమ గౌరవానికి భంగం కలిగించే ఇలాంటి వివాహాలు తమ బిడ్డలు చేసుకుంటే వెతికి వెతికి హతమారుస్తారు. దీనికి అన్ని వర్గాల ప్రజల మద్దతు ఉంది. అందుకే ఇష్టపడ్డ ఇద్దరూ పెళ్ళి చేసుకుని బొంబాయి, ఢిల్లీ లాంటి పట్టణాలకు పారిపోతారు. లేదా చాలా కేసుల్లో కలసి చనిపోతారు. అది పెండ్లికి ముందు అవ్వచ్చు. తరువాత అవ్వచ్చు. ఈ విషయంలో ఇంట్లో ఆడవాళ్ళ మాట చెల్లదు. తల్లి కొద్దిగా పాజిటీవ్‌గానే ఉంటుంది. కాని పంచాయితీ పెద్దలు, కులపెద్దలు మాట కాదని ఏం చేయలేరు. అందుకే ఆడపిల్లలకి చిన్న వయస్సులోనే పెండ్లి చేస్తారు. లేదా ఆడపిల్లని తెలిస్తే పిండ దశలోనే హతమారుస్తారు. కొన్ని కేసులను పరిశీలిస్తే మనం మానవ



హర్యానా ఐద్వా రాష్ట్ర కార్యదర్శి జగ్మతి

సమాజంలో ఉన్నామా! ఆటవిక సమాజంలో ఉన్నామా అనిపించకమానదు.

"సోనిపట్ జిల్లాలో బ్రాహ్మణులు అమ్మాయి వాల్మీకి కులానికి చెందిన అబ్బాయిని పెళ్ళి చేసుకుంది. దీనికి అబ్బాయి కుటుంబ సభ్యుల మద్దతు ఉంది. అమ్మాయి తరపు వారు దాడి చేసి అబ్బాయిని చంపేశారు. హతుడి తల్లి కాలేజిలో స్వీపర్. సెక్యూరిటీ కోసం కాలేజి క్యాంటిన్‌లో ఉంటున్నారు. పంచాయితీ పెట్టి కేసు విత్‌డ్రా చేసుకోకపోతే నీకూ ఆడపిల్లలున్నారని ఆమెను బెదిరిస్తున్నారు. దళిత కులానికి చెందిన ఇరువురు బొంబాయి పారిపోయి పెండ్లి చేసుకున్నారు. రెండు సంవత్సరాల తరువాత తమ బిడ్డతో గ్రామానికి వచ్చారు. వారిని ఇంటికి కూడా వెళ్ళ నివ్వకుండానే పంచాయితీ పెట్టారు. వారిద్దరూ అన్నా చెల్లి వరస అవుతారని వాళ్ళిద్దర్ని విడదీశారు. అంతే కాకుండా పసిబిడ్డను అనాధాశ్రమంలో వదిలేయాలని తీర్పు చెప్పారు. దీనిలో మేము, ఇతర దళిత సంఘాలు జోక్యం చేసుకోవడంతో దళిత పంచాయితీ పిల్లాడ్ని తల్లికి అప్పగించారు. ఆ కుటుంబం తెల్లారేసరికి సొంత ఊరు వదిలి వెళ్లిపోయారు.

చిన్న చిన్న కేసుల విషయంలో కూడా మేము ప్రభుత్వ వత్తిడిని ఎదుర్కొని నిలబడటం కష్టంగానే ఉంటుంది. ఇటీవల కాలంలో జరిగిన ఒ కేసు ...కరోడ్ జిల్లా కెత్తే గ్రామానికి చెందిన మనోజ్, బొబ్బిలి ఒకరినొకరు యిష్టపడ్డారు. గ్రామం వదిలి పట్టణానికి పారిపోయారు. అక్కడ రిజిష్టర్ మేరేజ్ చేసుకుని జూన్ 15న హైకోర్టులో తమ రక్షణ కోసం స్టే తెచ్చుకున్నారు. వారిరువులు తమ గ్రామానికి బయలుదేరారు. వారి బంధువుల దారికాచి వారిని దారుణంగా

హతమార్చారు. వారు బయలు దేరిన విషయం పోలీసులు అమ్మాయి బంధువులకు ముందే తెలియజేశారు. వారు అమ్మాయిని అబ్బాయిని దారికాచి దారుణంగా చంపేశారు. ఇరువురి శవాలను బరువుతో కట్టి దాపులనే ఉన్న కెనాల్‌లో వేశారు. పైన నీళ్ళు ఆపేయడంతో శవాలు బయట పడ్డాయి. పోలీసులు ఆ శవాలను రెండు జిల్లాల అవతల లాకుల్లో పడేసి వచ్చారు. ఇవి అన్ని హతుడి అక్క 'కర్నాల్' కేసు పెట్టడంతో వెలుగులోకి వచ్చాయి. బస్ డ్రైవర్ జీపు నెంబర్ చెప్పడంతో విషయం వెలుగులోకి వచ్చింది. 'కెత్తే' గ్రామం దగ్గర కెనాల్‌లో వేసిన శవాలు, రెండు జిల్లాల అవతల దొరికాయి. కుటుంబ సభ్యులకీవిషయం తెలిసే సరికి ఆ శవాలను అనాధ శవాల పేరుతో పోస్ట్‌మార్టం, దహనం పోలీసులే చేశారు. శవాల బట్టల్ని పిల్లాడి కుటుంబ సభ్యులు గుర్తుపట్టారు. ఇది మీడియాలో వచ్చింది. బండి నెంబరు ఆధారంగా దోషులను గుర్తించాము. దీనిలో స్థానిక కాంగ్రెస్ నాయుకుడు గంగరాజు ది ప్రదాన పాత్ర ఉంది. దీనిని మేము సీరియస్‌గానే తీసుకుని పంచాయితీ ఆఫీసు ముందు, పోలీస్ స్టేషన్ ముందు ధర్నాలు చేశాము. మొదట మమ్మల్ని అమ్మాయి తల్లిని కూడా కలవనివ్వలేదు. కులపంచాయితీలో మేము గొడవ చేశాము. జాతీయ మహిళా కమీషన్ కూడా వచ్చి పరిశీలించింది. ఎస్.పి., డి.ఎస్.పి. వచ్చారు. 500మందితో ఇలాంటి సంఘటనలు పునరావృతం కాకూడదని మేము సదస్సు పెట్టాము. అమ్మాయి గోత్రీకుడైన గంగరాజుని సాక్ష్యాలున్నప్పటికీ అరెస్టు చేయలేదు. మిగతా దోషులు కూడా బెయిల్ మీద బయటకు వచ్చారు. గంగరాజు ముఖ్యమంత్రిని కలవడానికి వెళ్లిన పిల్ల తల్లిని కూడా అడ్డుకున్నాడు. కమీషన్ వచ్చి వెళ్లాక ముఖ్యమంత్రి ఆగ్రామానికి వస్తే స్వాగత ఏర్పాటు అన్నీ గంగరాజే చూశాడు. ప్రభుత్వం ఇలాంటి కేసుల్లో ఎంత ఉదాసీన వైఖరి అవలంబిస్తుందో అర్థం అవుతుంది.

పిల్ల తల్లికి ఈవిషయంలో దోషులకు శిక్ష పడాలి అని ఉన్నప్పటికీ ఆమె ఏమీ చేసే పరిస్థితిలో లేదు. ఈకేసు విషయంలో పిల్లాడి తల్లి, అక్క గట్టిగా ఉన్నారు. ఆమెకి కూడా బెదిరింపులు వచ్చాయి. కేసు విత్‌డ్రా చేసుకోకుంటే నీకు కూడా నీ తమ్ముడికి పట్టిన గతే పడుతుందని. అయినా వారు తమకు న్యాయం జరిగే వరకు పోరాడతామన్నారు. జూట్ కులస్తులు ఆధిపత్యం ఎక్కువ. పంచాతీలలో వీళ్ళదే రాజ్యం. వీరికి వ్యతిరేకంగా రావడానికి ఇతర సంఘాలు భయపడేవారు. కాని ఇప్పుడు అపరిస్థితి కొంత మారింది. దళిత సంఘాలు, ఆర్యసమాజం, జాగరణ వేదిక, వ్యక్తులుగా ఉండే కొద్దిమంది మేధావులు, ఉన్నతోద్యోగులు మాతో కలసి వస్తున్నారు.

ఈహత్యలు జూలై నెలలో జరిగాయి. అప్పటి నుండి మేము వివిధ రూపాలలో పోరాటం చేస్తూనే ఉన్నాము. ఐద్వాగా మేము ప్రభుత్వాన్ని హెచ్చరించాము. దోషులను అరెస్టు చేసి బాధితులకు న్యాయం చేయక పోతే నవంబర్ 26న ఘెరావ్ చేస్తామని తదనంతరం తీవ్ర పరిణామాలు ఎదుర్కొవాల్సి ఉంటుదని చెప్పాము. పిల్ల తరపు బంధవులు, గంగరాజు మేము ఆగ్రామంలోకి వస్తే మమ్మల్ని ఘేరావ్ చేస్తామని, చంపినవాడికి సన్మానం చేస్తామని పేపరు ప్రకటనలిచ్చారు. పంచాయితీ పెద్దలు కూడా మా సంగతి చూద్దానికి సిద్ధంగానే ఉన్నారు. ఇది వాళ్ళ ఉన్మాదానికి పరాకాష్ట. చూడాలి... రేపు ఏం జరుగుతుందో...!

***

## ఆయన మనస్సు

మొన్న
పెండ్లి చూపులనాడు
నేనేమిటో తెలుసుకోవాలనే
ఆలోచన లేక
తలవంచిన నీ సిగ్గు
నాకు నచ్చింది
నిన్న
నీ ఆశల్ని తుంచేసినా..
అర్ధరాత్రి దాటినా...
ఆదుర్దాగా నా కోసం
ఎదురు చూసే నీ
బేలతనం నచ్చింది
నేడు
తండ్రిగా నీ పాత్రేమిటని
నువ్వు ప్రశ్నించకపోయినా
పసి పిల్లలతో సతమతమౌతూ
చూపిన నీ...
ఉదాసీనత
నన్ను వెక్కిరించింది!
రేపు
వాళ్ళ కోసం నన్నెదిరిస్తావని
ప్రశ్నలతో నా
మగతనాన్ని ధిక్కరిస్తావని
మరి,
నువ్వు నాకిప్పుడు
నచ్చట్లేదు

-ఆర్. దుర్గా ప్రసన్న

# పెండేల సత్యభామ

- వకుళాభరణం లలిత

పెండేల సత్యభామ నర్తకుల కుటుంబంలో జన్మించింది. అమ్మమ్మ పెద్ద సత్యభామ వద్ద కలాపం విద్యను నేర్చుకున్నది. కొట్లూరివారు ఆట గురువులు. చెళ్ళపిళ్ళ వద్ద సంస్కృతాంధ్రాల్లో పాండిత్యం గడించింది. నవజనార్ధన పారిజాతం అభినయించడంలోనూ,గొల్లకలాపాన్ని అభినయించడంలోనూ దిట్ట ఈమె. భాగవత కళాభినయంలో పెండేల సత్యభామకు పోటీ పడేవారెవ్వరూ లేరు. పాడటం, వీణ వాయించడంలో ఆమెకు ఆమే సాటి.

సత్యభామకు నృత్య సంపద కొన్ని తరాల నుంచి సంక్రమించింది. పెండేల నాగి, పెండేల గంగి అనే ఇద్దరు కళామూర్తులను గూర్చి మన చరిత్రలో కవులు, పండితులు, శాస్త్రవేత్తలు ప్రస్తావించారు. ఈనాటి కళాకారులు వారిరువురిని పెండేల నాగమ్మ, పెండేల గంగమ్మ అని స్మరిస్తారు. ఆ ఇద్దరు కళామూర్తులు భాగవత యక్షగానాలను, కేళికలు చేస్తుండేవారన్నది చారిత్రక సత్యం. పెండేల వారి వంశంలో చిట్ట చివరి నర్తకీమణి శ్రీమతి పెండేల సత్యభామగారు. చిన్న నాటి నుంచి అమ్మమ్మతో కూడి ప్రదర్శనలకు వెళ్ళి వస్తుండేవారు.



కేళికలు ప్రదర్శిస్తుండడంలో నిష్ణాతురాలు సత్యభామ. సుమారు 70 సంవత్సరాలపాటు నవజనార్ధన పారిజాతం అనే కేళికను కుంతి మాధవుని సన్నిధిలో ప్రదర్శించి తన 75వ ఏట పరమపదించారు. ఈమె వరుసగా నవరాత్రులు భామాకలాపాన్ని ఆడేవారని, పదో రోజు భాగవతంలోని దశమస్కంద పారాయణంలో ఈ కేళిక ముగిసేదట. విశిష్ట కలాపరీతి ఈమెది. నవరాత్రులు భామా కలాపాన్నే ప్రదర్శించినందువల్ల ఈ ప్రదర్శనకు నవజనార్ధనం అని పేరువచ్చింది.

నవ జనార్ధనాన్ని పూర్తిగా అభ్యసిస్తే భరత శాస్త్రాన్ని, అడవులను, పద్ధతులను, రస ప్రకరణాన్ని, నాయిక ప్రకరణాన్ని ఇక అభ్యసించనవసరముండదు. దీనిలో కృష్ణ భక్తి, మధుర భక్తి మిళితమై ఉంటాయి. సత్యభామ తొమ్మిది రాత్రుళ్ళు కృష్ణ భగవానున్ని బహువిధాల స్మరించి, తపించి, తరించినా ఆ దివ్య సుందరమూర్తి సందర్శనం ఆమెకు లభించేదికాదట. అందుకే 10వ నాడు కుంతి మాధవుల్ని సందర్శించి కేళికను ముగించేవారట. అందువల్ల ఆమె ప్రదర్శనలో కృష్ణ పాత్రను ప్రవేశపెట్టడం మాని మాధవి అనే హాస్య పాత్రను ప్రవేశపెట్టడం జరిగింది. ఆనాడు పాత్రధారులే స్వయంగా పాడి, ఆడి, అభినయించి గద్యాన్ని పఠించేవారట.

సత్యభామ స్వాధీన పతిక హుందాతనం, గర్వం, నిర్లక్ష్యం వాక్చాతుర్యం విషయంలో పెండేల సత్యభామ కృష్ణుని భార్య సత్యభామను తలపింపజేసేది. “దండమని తెలుపరే వేదండయాన నాసామికి” అనే పాట పాడుతూ ఆడుతుంటే ప్రజలు మైమరచేవారట. పెండేల సత్యభామ ఆంధ్రదేశంలోని పెక్కు దేవాలయాల్లోను, శ్రీమంతుల ఇళ్ళల్లోను అనేక ప్రదర్శనలు యిచ్చేవారట. ఆమె నాట్య విద్యాభ్యాస గాథలు కళా ప్రియులకు ఆహ్లాదంగా ఉంటాయి. సత్యభామ పేర్కొన్న యథార్థ సంఘటనలు, అనుభవాలు ఆంధ్ర దేశపు జమిందారుల కళా పోషణకు, భాషా పోషణకు తార్కాణాలు. పిఠాపురం జమిందారుగారైన మహాపతి గంగాధర రామారావు బహద్దూరుగారి కళాభిమానానికి, కళా పోషణకు, వితరణకు ఉదాహరణమే ఆయన నాట్య కళాపోషణ. అందుకే పెండేల సత్యభామ వంశ చరిత్ర ఈ జమిందారీ విధానంతో ముడివడి ఉంది.

ఒక చిన్న ఉదాహరణతో భామా కలాపాన్ని గూర్చి వివరించవచ్చు. పిఠాపురానికి క్రోసు దూరంలో గొల్లప్రోలు జమిందారీ గ్రామం ఉండేది. ఆ గ్రామంలో శ్రీరామనవమి ఉత్సవాల్లో ఆ ఊరి కరణం నవమి నాటి రాత్రి భాగవత ప్రదర్శన ఏర్పాటు చేయగా ప్రార్ధనాదికార్యక్రమాలు జరుపుతూ భామ ఎంతకూ తెరలోనుంచి బయటకు రాలేదు. దానికి కోప్పడ్డ కరణం కాగడాలనార్పించి ఇంటికి వెళ్ళాడు. హంగుదారులు తాటాకు మంటలువేయించి ప్రదర్శనమును ఆరంభించారు. కల్లోల మణిగిపోయింది. ఇంతలో శ్రీ గంగాధర రామారావు బహద్దూరు ప్రవేశించగా పాత్రధారులు కథాఘట్టమున కనుకూలించినట్లుగా

"రావుకులాంభుది చంద్ర!

రామ రాయ భోగ దేవేంద్ర!

బహుపరాకు! సరసగుణ సాంద్ర!

భళిరా మహారాజా!" అంటూ అభినయించారు. అప్పుడు జమిందారుగారి నౌకరు సత్యభామా! ఈ చల్లని రాత్రివేళ నీవాలాపన చేసిన రాగం కోటలోనున్న ప్రభువులకిన్పించి నౌకరైన దొరప్పుతో సత్యభామ గొంతువలెనున్నదని అన్నాడు". సత్యభామ తన అభినయంతో మహారాజును ముగ్ధుల్ని చేసినందువల్ల ప్రభువు "కాగడాలను మాని తాటాకు వెలుగులో భాగవతమాడటానికి కారణమేమి" అని ప్రశ్నించారు. కరణం సంగతి విని గోష్పాదమంత జుట్టు కత్తిరించి శృంగభంగం చేయించి సత్యభామకు తన జమిందారీ దేవాలయాల్లో కలాపాలు చేయమని అనుజ్ఞ యిచ్చాడు. ఈ ఉదంతం పెందేల సత్యభామ గారి అమ్మమ్మ పెద్ద సత్యభామ గారి కాలంలో జరిగింది.

ఆనాడు పంచమాధవుల దేవాలయాలు ఉండేవి. అవి వేణుమాధవ, బిందు మాధవ, కుంతిమాధవ మొదలైనవి. పిఠాపురంలో కుంతి మాధవ దేవాలయముండేది. పెందేల సత్యభామ భాగవత విద్యనే గాక కచేరి బాణీలో పదాలు, వర్ణాలు అభ్యసించింది. ఆమె విద్యలో, భాగవతంలో ఉండే బిగి, కచ్చేరి ఆటలోని సౌకుమార్యం రెండూ ఉండేవి. నిండైన గాత్రం, స్ఫుటమైన వాక్కు, స్వచ్ఛమైన పలుకు, "ఏదమ్మా నా నాథుడేదమ్మా" అని కంఠమెత్తి పాడుతూ, ఆలాపన చేస్తూ, అభినయిస్తూ అడుగులు పడుతూ ఉంటే చూడముచ్చటగా ఉండేదట. వృద్ధాప్యంలో కూడా మాధవస్వామి ఉత్సవాలప్పుడు వేషం కట్టేదట. ఆనాడు దేవనర్తకులకు, భాగవతులకు మాన్యాలుండేవి.

పాండిత్యంలోను, నృత్య ప్రదర్శనలోను సత్యభామతో తులతూగదగ్గవారు ఎవ్వరూ లేరు. పెందేల సత్యభామకు అన్నవరంలో జరిగిన పండిత సభలో ఆమెకు రెండు తాంబూలాలిచ్చారట. ఒకటి పాండిత్యానికి రెండోది నృత్యానికి. పండితులకు మాత్రం ఒకే తాంబూలం. అందులోనూ సత్యభామ పాత్రను అర్థం చేసుకోవాలంటే చాలా కష్టం. ఆమె సాధ్వి, ప్రగల్భ, సౌందర్య గర్విత, వీరవనిత, సత్రాజిత్తుకూతురు. ఇన్ని లక్షణాలున్న ఆ పాత్రను అవగాహన చేసుకొని అభినయించాలి. అలాంటి అభినయం చేసిన సత్యభామ కనుకనే రథోత్సవాన్ని ఆమే ప్రారంభించి తీరాలి. లేకుంటే తేరు కదలదు. సత్యభామకు సమాజంలో ఎంతటి గౌరవముండేదో దీన్ని బట్టి అర్థమవుతుంది. అందుకే ఆమెకు పంపే పల్లకిని 6మంది బోయీలు ఆమె నింటినుండి తేవాలి.

పెందేల సత్యభామ గొప్ప కళాకారిణి. భాగవత బాణీని ఆమె ప్రదర్శించినట్లు మరెవ్వరూ ప్రదర్శించడం కష్టం. ఆమెకు భావావేశము ఎక్కువ. పాత్రలో పూర్తిగా లీనమై తన్ను తాను మరచిపోయి నృత్యం చేయటం విశేషం. ఆమె చరమదశలో నటరాజ రామకృష్ణ ఆమెకు శిష్యుడై రెండు సంవత్సరాలపాటు నవజనార్ధన పారిజాతాన్ని నేర్చుకున్నాడు. కనీసం ఆ సమయంలోనైనా ఆ విద్యను నేర్చుకొనకుంటే నవజనార్ధన పారిజాతం ఆంధ్ర దేశానికి లభ్యమై ఉండేదికాదు. అటువంటి కళాకారిణి కాబట్టే పెందేల సత్యభామను ఏ ఒక్కరు మరువడానికి ఆస్కారం లేదు.

***

## భూమి సాధించే వరకు భూపోరాటం

కదిలింది కదిలింది మహిళా దండు గూడు కోసం
ఉవ్వెత్తున కదిలారు మహిళలు కదం కలుపుతు!
రాష్ట్రాన్ని కదిలించింది సెంటు జాగా కోసం
పోలీసులు రాక్షసంగా లాఠీలను,
తూటాలను ఝుళిపిస్తున్నా
ఎండనక వాననక జానెడు జాగా కోసం ఆరాటం
ఊరుకోము ఊరుకోము
ఎర్ర జెండా చేతబట్టి ముందుకు సాగుతూ
తీవ్రంగా ఉద్యమాలను అణుస్తోంది
ధృతరాష్ట్ర ప్రభుత్వం
సాగుతుంది సాగుతుంది ముందుకూ మాపోరాటం!
లాఠీలకు తూటాలకు బెదరం, అరెస్టులకు అదరం!
పోలీసులు సర్కారు ఆదేశాలతో
గుడిశలు పీకి కుప్పేడుతున్నారు!
పోరాటాల ద్వారా
నైజాం సర్కార్‌ను తుదిముట్టించాము.
పేద ప్రజల ఆగ్రహోజ్వాలల మధ్య
ఈ ప్రభుత్వం బూడిద కుప్పగా
మారే రోజు దగ్గరలోనే ఉంది.
మంచిరోజుల కోసం సాగే ఈ పోరాటం
అమరవీరుల
ఆశయాల స్ఫూర్తితో గూడు సాధించే వరకూ
సాగుతూనే ఉంటుంది.

గద్దె ఉమశ్రీ

# పరుగుల పోటీల్లో స్త్రీలు ఎక్కడ?

- పి.ఎ. దేవి

రాజకీయ రంగంలో అసెంబ్లీకి పార్లమెంటుకు మూడో వంతు సీట్లు రిజర్వేషను కావాలని మహిళా ఉద్యమం ఒక్క గొంతై అరుస్తున్నది. స్థానిక సంస్థల్లో మహిళలు సమర్ధవంతంగా పని చేస్తున్న ఉదాహరణలు కోకొల్లలుగా చూపుతున్నది. మరో వైపు అమ్మాయిలు సమాచార సాంకేతిక రంగంలో కూడా దూసుకుపోతున్నట్టే కనబడుతున్నది. ఐసిఐసిఐ బ్యాంకులోనే కాక కోకోకోలా వంటి కార్పొరేటు సంస్థల్లో కూడా అతి ఉన్నత స్థాయి ఉద్యోగాల్లో నిర్ణయాత్మక అధికార స్థానాల్లో ఉండటం ఇటీవలి కాలంలో వత్రికలు మహిళల విజయగాధలుగా ప్రచురిస్తూనే ఉన్నాయి.

నిజంగానే మహిళలు అంత వేగంగా పురోగమిస్తున్నారా? వారి పురుష సహచరులతో పోలిస్తే వారి ఎదుగుదల సమంగా ఉందా? అసలు మొత్తం మహిళల సంఖ్యతో పోలిస్తే భద్రత కలిగిన ఉద్యోగం గల స్త్రీల శాతం ఎంతనేది అసలు మొలిక ప్రశ్నే అయినా పై రెండు ప్రశ్నలకూ కూడా జవాబులు అవసరమే.



ప్రపంచ వ్యాప్తంగా ప్రధమ పంక్తిలో 500 కార్పొరేటు సంస్థల్లో మేనేజర్ల స్థాయిలో కేవలం 10 శాతం మందే స్త్రీలు. అందులోనూ నాలుగు శాతం కంటే తక్కువగానే ఎగ్జిక్యూటివ్‌లు, వైస్ ప్రెసిడెంట్ల స్థాయిలో ఉండగా వీరిలో 3 శాతం కంటే లోపుగానే కార్పొరేటు కంపెనీల అత్యున్నత స్థాయి పదవి గలవారు ఆర్జించేంత జీతం పొందుతున్నారు.

ప్రభుత్వ రంగ సంస్థల్లో మొత్తం దాదాపుగా 6శాతం మహిళా ఉద్యోగులు. 21 వేల మంది మేనేజర్లు కాగా కేవలం 250మంది మాత్రమే ఉన్నత శ్రేణి పదవుల్లో ఉన్నారు.

ఒకే రకం అయిన విద్యార్హతలు, అనుభవం, తెలివి, కార్యదక్షత కలిగి కూడా పురుషులంత త్వరగానూ, తేలికగానూ మహిళలు పై పదవులకు ఎగబాకలేకపోతున్నారనేది ఏ సంస్థను పరిశీలించినా కొట్టవచ్చినట్లు కనబడే అంశం. ప్రభుత్వ రంగంలో ఇది మరీ ప్రస్ఫుటంగా కనబడుతున్నది.

నిర్వహణా సామర్థ్యం గురించి చర్చ జరిగితే మగవారు కూడా స్త్రీలు బాగా చక్కగా పనిచేస్తారని ప్రశంసిస్తారు. ఆఫీసు పని భారం మోయటంలో వారు వెనుకంజ వేయరు. పురుష ఉద్యోగస్తుల కుండే వ్యాపకాలు స్త్రీలకు ఉండవు. ఎక్కువ మంది స్త్రీలు పొందిగ్గానూ చకచకా పని పూర్తి చేస్తారు. అయినా వారికి ప్రమోషన్లు వేగం రావు. ప్రమోషన్ల నిచ్చెనలో కొన్ని మెట్లు ఎక్కి దిగువనో, మధ్యలోనో ఆగిపోతారు. ఎందుకని అని ప్రశ్నిస్తే అనేకానేక కారణాలు కనబడతాయి.

ఎంత చదువులు చదివినా ఒక స్థిరమయిన సంపాదనకు వచ్చినా రాకున్నా అమ్మాయిల లక్ష్యం పెళ్ళే. ఉద్యోగం రాగానే ఇంక ఆలస్యం లేకుండా పెళ్ళి ఏర్పాట్లు జరుగుతాయి. ఉద్యోగం ఎక్కడ చేయాలి అనేది భర్తని బట్టి ఉంటుంది. చేస్తున్న ఉద్యోగం వదిలి మరొకటి వెతుక్కోవడానికి కుటుంబాలు సంకోచించవు. అంత తేలిగ్గా ఇదే మాట మగవాడికి చెప్పరు..నీ భార్య ఉద్యోగం మంచిది కాబట్టి నీవు ఆమెకు అనుగుణంగా ఉండేలా ఉద్యోగం దగ్గర్లో చూసుకో అని వివేకవంతులెవరయినా పొరపాటున చెప్పారంటే అది అవమానంగా భావించని వారు అరుదనే చెప్పాలి. పై సలహా ఎంత సమంజసంగాఉన్నా అహం ఎంతో కొంత దెబ్బతింటుంది. ఒకవేళ అతను ఆవిధంగా చేస్తే అది పెద్ద త్యాగంగా భావిస్తాడు.. అదే స్త్రీ అయితే వేరే ఆలోచన చేయదు.

దీనికి ప్రధాన కారణం ఎవరి సంపాదన ఎక్కువయినా కుటుంబ పోషణ మగవాడిదే ననే భావన చాలా బలంగా వేళ్ళూనుకుని ఉంది. స్త్రీల సంపాదన అదనపు ఆదాయం మాత్రమే. స్త్రీలు కూడా అలాగే భావిస్తారు. ఉద్యోగం చేసే స్త్రీలు ఇంటి పనుల్లో కుటుంబ వ్యవహారాల్లో అలసత్వం చూపితే దాన్ని ఉద్యోగంపైకి తద్వారా వచ్చిన పొగరుకి అంటకట్టడం తరచుగా జరుగుతుంటుంది. "ధరలు పెరిగాయి. మాకు అర్హత ఉంది. కుటుంబం కాస్త హాయిగా బతకాలనే నా సంపాదన. అది నా కోరికే" అన్నట్లు ఉద్యోగినులు వ్యవహరిస్తారు. ఉద్యోగం మనిషి లక్షణం. అది స్వావలంబనకు, ఆర్ధిక స్వాతంత్ర్యానికి,

స్వాభిమానానికే కాక సామర్థ్యం నిరూపించుకునే అవకాశంగా తక్కువ మంది భావిస్తారు. ఇంక పిల్లలు కూడా పుడితే స్త్రీలకు బాధ్యత కుటుంబమే అవుతుంది. ఏ ఉద్యోగంలో, ఏ పదవిలో, ఏ బాధ్యతల్లో ఉన్నా స్త్రీలకు అవి రెండో ప్రాధాన్యతేనన్నది ప్రబలంగా ఉన్న భావన. వృత్తి అవసరాల రీత్యా సమయం, శక్తి కేటాయించడాన్ని స్త్రీల నుండి ఆశించరు. వృత్తిలో నైపుణ్యం అనుభవం అధ్యయనం పొంది పై స్థానానికి పోవలసిన వయస్సులో ఆడవాళ్ళు కుటుంబం, పిల్లల బాధ్యతల్లో తలమునకలై ఉంటారు. భర్త ఉద్యోగంలో ప్రమోషను ప్రాధాన్యత స్త్రీలకు ఉండదు. ఇపుడిపుడు భర్తలు కొంత పని పంచుకునే ప్రయత్నం చేస్తున్నా ఈనాటికీ పిల్లల ఆలనాపాలనా, చదువు, యింటిపని, వంట పని బాధ్యత ప్రధానంగా స్త్రీలదే. తమ వృత్తిలో పైకి పోవడానికి అవసరం అయిన సమయం వారికి లభించదు. రెండు భారాలూ ఒకేసారి తలకెత్తుకోలేక ఎక్కువమంది ఉన్నదాంతో సరిపెట్టుకుంటారు. ఒకవేళ ఎవరయినా పట్టుదలగా ప్రయత్నిస్తే వారికి పెద్ద ప్రోత్సాహం లభించదు. అనవసర శ్రమగా మొండితనంగా భావిస్తారు.

వృత్తిలో పైకి వెళ్ళడానికి అవసరం అయిన పరీక్షలు వ్రాయడానికి సభలూ, సదస్సులకు, చర్చా గోష్ఠులకూ హాజరుకావడానికి స్త్రీలు పెద్దగా ఉత్సాహం చూపరని ఒక అధ్యయనం వెల్లడిస్తున్నది. కొత్తవి తెలుసుకోవడానికి ఎదుటివారిని అధిగమించి పోవడానికి అంతగా ఆసక్తి కనబర్చరని కూడా వెల్లడయ్యింది. దీనికి కుటుంబ బాధ్యతలు సాకుగా చూపడంతో పోటీపడాల్సిన ఉద్యోగినులు కూడా వెనుకంజవేస్తారు.

దీనికి తోడు చిన్నతనం నుండి అమ్మాయిలను తక్కువ చేసి చూస్తారు. వివక్షత ఉంటుంది. వారి అభిరుచుల్ని సామర్థ్యాల్ని అంతగా గమనించరు. పెళ్ళయినాక యింటి పనుల సామర్థ్యం తప్ప మిగిలిన నైపుణ్యాలకు గుర్తింపు ఉండదు. భార్య వృత్తి సామర్థ్యాన్ని గమనించే భర్తలు ఎంతమంది ఉంటారు? వీటన్నింటి ఫలితంగా ఎక్కువమంది స్త్రీలకు తమ శక్తి పై తమకు నమ్మకం ఉండదు. బాధ్యతలు అప్పగిస్తే చేయలేమని భయపడతారు. కాబట్టి అవకాశం ఉన్నా పోటీకి దిగరు. ఆ అవకాశం మరొకరు తీసుకున్నా ప్రశ్నించరు. ఉన్నత శ్రేణి పదవుల్లో స్త్రీల సంఖ్య పెరగకపోవడానికి ఇదొక కారణం.

పైకి పోవడానికి అవసరం అయిన ఉద్యోగ సంబంధాలు - సామాజిక సంబంధాలు ఏర్పరచుకునేందుకంటే పిల్లలతో కుటుంబంతో కాలం గడపడానికి స్త్రీలు ఇష్టపడతారు. ఉదయం పది నుండి సాయంత్రం ఐదుకి అయిపోయే ఉద్యోగం అయితే మంచిదని అత్యధిక ఉద్యోగినులు భావిస్తున్నారు. పై ఉద్యోగాల్లో బాధ్యతలు పెరిగితే ఆఫీసులో ఎక్కువ సమయం కేటాయించాల్సి వస్తుందని, అది యిబ్బంది అనీ అనుకుంటున్నారు.

కుటుంబం - ఉద్యోగం సమన్వయంలో స్త్రీల త్రాసు కుటుంబం వైపే మొగ్గేలా మన సామాజిక ప్రచారం ఉంటున్నది. పని వత్తిడినీ సామాజిక వత్తిడినీ కూడా భరించి పై స్థాయికి చేరడం తలకు మించిన భారంగానే ఉంటున్నది. దానికి తోడు తాము పనిచేయటం వలన తమ పిల్లల పోషణలో లోపం జరుగుతున్నదనే అపరాధ భావన కూడా ఉద్యోగినుల్లో కలుగుతున్నది. పిల్లల చదువు చూడకపోతే (తమ ఉద్యోగంలో పైకి పోవడానికి) వారి భవిష్యత్తు పాడవుతుందనీ పిల్లలపై చదువుల భారం తగ్గించాల్సిన బాధ్యత తమదేనని తల్లులు భావిస్తుంటారు.

అదనపు శ్రమనూ పని భారాన్ని భుజానికెత్తుకోవడం యిష్టం లేని ఉద్యోగినులు "ఆడవాళ్ళం కదా" అని తప్పుకుంటారు. ఏదయినా ఆటంకం ఎదురుకాగానే ఎందుకులే అని వెనక్కి తగ్గుతారు. స్త్రీలపట్ల చిన్నచూపు ఉండటం అనేది తమ ఎదుగుదలకు అదృశ్యంగా అడ్డం పడుతున్నా దానితో ఘర్షణకు సిద్దపడరు....సర్దుకుపోతారు లేదా పక్కకు వైదొలిగిపోతారు.

అట్లాగే స్త్రీలకు అప్పగించే ఉద్యోగ బాధ్యతలు కూడా వివక్షతా పూర్వకంగానే ఉంటాయి. పనిభారం ఎక్కువ, సవాళ్ళు తక్కువున్న ఉద్యోగాలు కేటాయిస్తారు. ప్రయాణాలు, క్యాంపులు, బయటవారితో చర్చలు అవసరం అయ్యే బాధ్యతలు కేటాయించరు.

ప్రభుత్వ రంగ సంస్థల్లో చూస్తే సంస్థ ఆదాయంతోనూ ఉత్పత్తిలోనూ ప్రత్యక్షంగా సంబంధం ఉండే ఉద్యోగాల్లో అతి తక్కువ మంది స్త్రీలు ఉన్నారు. సంస్థ లాభ నష్టాల్లో వారికి భాగస్వామ్యం ఉండదు. ఫైళ్ళు, రాతపని ఎక్కువ వుండే ఆఫీసు ఉద్యోగాల్లో ఎక్కువగా మహిళలు ఉన్నారు. ఆదాయ వనరులు పెంచే పదవుల్లో అతితక్కువగా ఉన్నారు.

దానితో ఉన్నత స్థాయి పదవుల్లోకి చేరడానికి కీలకం అయిన సాధారణ పరిపాలనాంశాల్లో స్త్రీలకు అనుభవం రాదు. అట్లాగే కార్మిక, ఉద్యోగ యూనియన్లలో వారి భాగస్వామ్యం నిర్ణయాత్మకంగా లేకపోవటం సత్సంబంధాలు ఏర్పరచుకునే అవకాశం స్త్రీలకు తక్కువ ఇటువంటి ఏ పరిణామాలకు దారితీస్తాయోనని కూడా వారు వెనక్కి తగ్గుతారు.

అయితే ఇటీవల స్త్రీల శక్తి సామర్థ్యాలను కొంచెం తక్కువ వేతనంతో (పురుషులతో పోలిస్తే) ఉపయోగించుకోవచ్చని అర్థం చేసుకున్న కార్పొరేటు కంపెనీలు స్త్రీలకు ప్రాధాన్యం ఇస్తున్నాయి. ఒకే రకం ఉద్యోగంలో ఒకే జీతం లభిస్తున్నా స్త్రీలు తమని తాము నిరూపించుకోవడానికి తోటి పురుషుని కంటే ఎక్కువ కష్టపడతారని కూడా తేలడంతో ఇపుడు బహుళజాతి సంస్థలు స్త్రీలపై ప్రత్యేక శ్రద్ధ పెడుతున్నారు. ప్రభుత్వ రంగంలో ప్రతి వెయ్యిమంది పురుష ఉద్యోగులకు **176**మంది మాత్రమే స్త్రీలు కాగా ప్రైవేటు రంగంలో **319**మంది స్త్రీలున్నారు.

కార్పొరేటు రంగంలో పనిచేసే మహిళలు వారి పనికి తగిన ప్రతిఫలం పొందే దిశగా పావులు కదుపుతున్నారు. పోటీ ప్రపంచంలో పురుషాధిక్యతను తట్టుకుని ముందుకుపోవడానికి సన్నద్ధం అవుతున్న మగువల సంఖ్య క్రమంగా పెరుగుతున్నది. ప్రపంచీకరణ కార్పొరేటీకరణల పరుగు పందెంలో పోటీకి నిలబడుతున్నారు. విద్యావకాశాలతోపాటుగా మహిళా ఉద్యమ ఫలితంగా వస్తున్న సాధారణ చైతన్యం కూడా వారికి ధైర్యం కలిగిస్తున్నదని చెప్పవచ్చు.

***

# మేం కూడా మనుషులమే

-బాసింగాల రాధాదేవి
కాకతీయ విశ్వవిద్యాలయం

ఎక్కడ అణచివేత మొదలవుతుందో అక్కడే తిరుగుబాటు మొదలవుతుంది. ఎంతో బలమైనది ఈ అణచివేత క్రమం. అనాది నుండి ఇప్పటిదాకా నిరంతరం కొనసాగుతూనే ఉన్నది. చలం అన్నాడు ఆడవాళ్ళు భరించటం, సహించటమే నేర్చుకున్నారు కాని తిరగబడటం నేర్చుకోలేదు.

మనిషి ఆడయినా, మగయినా మొదట మనిషే కదా! ఈ మనిషిగా ఉన్న ఆడ, మగలకు సృష్టి సంబంధమైన ఆహార్యాలు కొన్ని ఉన్నాయి. న్యాయానికి 'మనిషి'గా ఇద్దరూ సమానులే ఇది జగద్విదిత సత్యం. అయినా స్త్రీ పట్ల ఎందుకీ వివక్ష? తరాల, యుగాల అంతరంలో స్త్రీ బలహీనురాలుగా మగ పోషణలో 'వస్తువు'గా మిగిలి కనిపిస్తున్నది. ఇందుకు కారణాలు మనంగా వెతకాల్సిన పనిలేదు. ఆడదానికి ఉన్న మొదటి అంశం గర్భం ధరించడం నెలల తరబడి మోయడం, కనడం, సాకడం సంభాళించడం, నడకా, నడతా నేర్పేదాకా బాధ్యతగా శ్రమించడం అదో లోకం. నిజం మాట్లాడితే ఈ లోకంలో ప్రతి ' అమ్మా' ఓ సృష్టికర్త ఆవిడ తన బిడ్డను తీర్చిదిద్దేందుకు ఉపయోగించేది అనంత భాష. ప్రతి సృష్టికీ ఆ తల్లే 'వేదిక'. సృష్టిలో బీజక్షేత్రాలలో బీజానికి లేని సంఘర్షణ, కష్టం, క్షేత్రానికుండడం మనకు తెలుసు.

ఈ శ్రమ, మానసిక వేదనా, ఉత్పాదికత నిచ్చేదికాదు దానికి అవసరమైన మనుషులను మాత్రమే తయారు చేసేది కాని న్యాయానికి అది స్త్రీలకు ఒక ప్రత్యేకతను మాత్రమే కల్పించిందని చెప్పవచ్చు. శ్రమ అనేది పురుషులకంటే స్త్రీలకే ఎక్కువగా ఉన్నా, పురుషుడే పోషణ కర్తగా ( ఈ ఆటుపోట్లలో) మారాడు, ఎదిగాడు, అధికుడయ్యాడు. కాగా సృష్టిలో శారీరకంగా దృఢత్వం పురుషునిదీ, సౌకుమార్యం స్త్రీది అయ్యింది. దీన్ని ఆలంబనగా చేసుకొని ఆర్థిక సంబంధాలలో చొరవ చూపి, నిలిచి, ఆధారపడేలా చేసుకొనగలిగాడు. దీనితో సమాజంలో ముఖ్యుడయ్యాడు. అయ్యాక ఆధారితులను అదుపు చేసుకున్నాడు. ఈ పునరుత్పత్తి విధులు, పని విభజన స్త్రీ ఉత్పత్తి రంగంలోకి రావటానికి ప్రతి బంధకం కల్పించిందని చెప్పవచ్చు.

అంచేత పురాణకాలం నుంచీ ఇప్పటిదాకా ఆ స్థితి అలాగే కొనసాగుతున్నది. దీన్ని స్థిరం చేసుకోవడానికి కాలగమనంలో అల్లిన కట్టుబాట్లే ఈ సాంప్రదాయాలు, ఆచారాల చెర నుండి కాసింత బయట పడి ఇవ్వాళ ఆర్థికంగా బలపడినా ఆ బెరుకుదనం అరకొరగా వదలడమే కాని దాని నుండి పూర్తిగా బయటకు రాలేకపోవడం గమనార్హం.

పితృస్వామ్య వ్యవస్థలో ఆడపిల్లకు అన్ని నిబంధనలే. ఆమె ఉత్పత్తిపై, పునరుత్పత్తిపై, లైంగికత్వంపై అన్నీ కట్టుబాట్లే అందువల్లనే పితృస్వామ్య వ్యవస్థ ఆడపిల్లలను చూసే తీరు వేరుగా ఉంది. 20 ఏళ్ళ ఆడపిల్ల ఉద్యోగం చేసి సంపాదిస్తున్నా ఒక గంట ఇంటికి రావడం ఆలస్యమైతే ఎదురుచూపులు, అనుమానాలు, పనిచేసే దగ్గర ఆకలి చూపులూనూ. అదే పాతికేళ్ళ మగాడు ఎలా జులాయిగా తిరిగొచ్చినా ఏమీ లేదు. పట్టించుకోరు. ఇదీ మన వ్యవస్థ.

ఈ వ్యవస్థలో ఒక ఆర్థిక పరిపుష్టి ఎంతో కొంత ఆసరా అవుతుందే తప్ప వేరుగా ఉపయోగం లేదు. ఆడపిల్ల సంపాదన వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు తోడ్పాటు తప్ప సమాజపు దృక్కోణంలో మనం మనుషులం (ఆడ, మగ) అన్న భావన స్థూలంగా రానంత వరకూ సృష్టిపరంగా ఆడవారికి ఉన్న అన్ని అడ్డంకులను ఇప్పటి సమాజం నిర్దాక్షిణ్యంగా వినియోగించుకుంటుంది బురద జల్లుతుంది.



ఎక్కడో ఓ ఇందిర, ఓ గోల్డామేర్, ఓ సిరిమావో లేరని కాదు మనం మనసు పెట్టి పరిశీలనగా గమనిస్తే ఈ సంఘంలో వారు బలహీనులుగానే కనిపిస్తారు. ఇందిరా గాంధీ ప్రధానిగా ఉన్నప్పుడు రోజూ ఆమె అందమైన ముఖం చూడటం కోసమే పార్లమెంటుకు సభ్యులు వెళ్ళారంటే, ఒక దేశానికి ప్రధాని అయినా ఆమెను స్త్రీగానే చూసారనీ భావన, పితృస్వామ్య సంస్కృతి వేళ్ళూనుకు పోయిన దేశంలో స్త్రీలు ఎంత పెద్ద హోదాలో ఉన్నా ఎన్ని పనులు చేసినా ఇంకా స్త్రీగానే పరిగణింపబడుతుందంటే మగవాడితో సమాన హోదా గౌరవాలు పొందడం లేదనే విషయం వెల్లడవుతుంది. స్త్రీ అన్న భావనలో 'తక్కువతనం', తనది, వస్తువు, అన్న స్థితి చులకన నరనరానా యుగాలుగా జీర్ణించుకున్న వైనం.

మహిళ ఎంతో కొంత పైకొచ్చే ప్రయత్నంలో పడ్డ తరుణంలో స్త్రీ భోగవస్తువు అన్నభావనతో స్త్రీ సుకుమారి రోల్‌మోడల్, సౌందర్యరాశి అని అందాల ప్రదర్శనలు, పోటీలు, ఆకర్షణలు కలిపిస్తూ 'తల'ను పనిచెయ్యనివ్వకుండా ఒంటిని మెరుగుపరిచే (కొలతలలో)దిశకు వీరిని మళ్ళించారు. వీరూ మళ్ళారు, ఆ వ్యామోహంలో పడ్డారు. ఇందువల్ల కొంత ఆర్థిక పరిస్థితి మెరుగుపడ్డా ప్రపంచ విపణిలో ఆటబొమ్మగా వ్యాపార వస్తువుగా మలిచారు.

ఇక ఇప్పటి సమాజంలో చదువుకున్న వారూ, ఆర్థిక స్థితి మెరుగ్గా ఉన్న ఆడవారు ఉన్నారు. కాని స్వయం నిర్ణయందాకా ఎదిగినవారు అతి తక్కువ. దీనికి కారణం అనాదిగా ఉన్న మన కుటుంబ వ్యవస్థ మన సమాజంలో పురుషాదిక్యత ఇప్పటికీ చెల్లుబడి అవుతున్నది. అంటే ఎక్కువమంది పురుషాధిక్య సమాజాన్ని సమర్థించేవారే. స్త్రీలకు సమానహక్కులు అధికారాలకు సంబంధించి ఎన్ని చట్టాలు ఉన్నా ఆచరణలో అవి పెద్దగా ఉపయోగపడటంలేదు.

ఈ సమాజంలో ఉన్న అనేక అంతరాలు (జాతి, కుల, మత, తెగ, ఆర్థిక వ్యత్యాసాలు)వాటికున్న కట్టుబాట్లు, అనాదిగా వాటి అనుసరణ 'కట్టడి'గా నిలబడి స్త్రీలను ఊపిరాడని స్థితికి తీసుకొస్తాయి. పాత హద్దుల్లోకి జరుపుతాయి. పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో సరుకులో సరుకయి తన అందచందాలను వ్యాపార విపణిలో వస్తువుల అమ్మకానికి తాను అమ్ముడవుతూ ఆ మలుపులో పడి కొట్టుకొని పోకుండా మొదట స్త్రీలు తమని తాము నిరోధించుకోగలగాలి. ఈ సమాజంలో ఉన్న అనేక అంతరాల నుండి బయటపడేందుకు 'చదువు' తోడ్పడుతుంది. ప్రపంచాన్ని, దాని తీరునూ అవగతమయ్యేలా చేస్తుంది. మనసు పరిధిని పెంచుతుంది. ఎంతో కొంత సమాజంలో ప్రవేశం కల్పిస్తుంది.సొంత ఆలోచనలకు 'పాదు' అవుతుంది. ఈ చైతన్యంతో ఎన్ని అవరోధాలనైనా తప్పుకుంటూ నడిచేందుకు వీలు కలుగుతుంది. మగవారి దృష్టిలో ఆడ, మగ కలిస్తేనే 'మనం' అన్న భావనను ఆమోదింపజేయాలి. కలసి మెలసి 'మనం మనుషులం' అన్న దానిని మరచిపోకుండా చూడాలి. దృక్పథాలలో, ఆలోచనలలో, మార్పుకు తగు ప్రయత్నం చేయాలి. పశు పక్ష్యాదులలో లేని వివక్ష సృష్టిలో సమగ్ర జ్ఞానాన్ని సముపార్జించుకున్న మనుషులలో మిగలడమేమిటి? తప్పు! అనేది సమాజానికి స్పష్ట పరచగలగాలి.

'స్త్రీ ఆడదానిగా పుట్టలేదు - తయారు చేయబడ్డది' కనుక ఆడపిల్ల తక్కువ కాదని ఆడపిల్ల చదువుకు తగు ఏర్పాట్లు, ఆమె ఆర్థికంగా తన కాళ్ళ మీద తాను ఎదగటానికి సహాయపడాలి. స్త్రీ కూడా ఒక మనిషే, అమెకూ హృదయం ఉంది. శరీరం ఉంది. మనస్సు ఉంది. దానికి అనుభవం కావాలి, ఆనందం కావాలి. ఆలోచన కావాలి. అన్న భావన ఆమె కూడా మనిషిగా నిలబడటానికి దోహదపడుతుంది.

।భయం మీదకు రాకముందు మాత్రమే భయపడాలి మీదికొచ్చాక భయాన్ని వదిలేసి స్థిరచిత్తంతో చేయగలిగింది చేయాలి. ఆ స్థితికి స్త్రీలు ఎదగాలి అప్పుడు మాత్రమే పురుషుడితో ధీటుగా నడక సాగుతుంది.

***

# ఇంటిలో నేనొక పనిముట్టునా?

(అతి నిర్లక్ష్యానికి గురైన ఓ అర్ధాంగి ఆక్రోశం)

గాలి పతంగి లాంటి నీకు
కట్టబెట్టారు పెద్దలు నన్ను
నీవంటే నా కెంతో ఇష్టం
శౌర్యం, ధైర్యం, కల్లా కపటంలేని మనిషివని
క్షణం తీరికలేని నీవు
నాకు అందకుండా అయ్యావు!
నీవు వుండి లేనిదానినై ఒంటరినయ్యాను
నిరీక్షణలతో బతుకు భారమైంది
గాలిలో దీపంలాంటి బతుకు భారాన్ని మోస్తూ
బాధ్యతలు నిర్వర్తిస్తూ
కొవ్వొత్తిలా కరుగుతూ వెలుతురిచ్చాను
కుటుంబానికి, సమాజానికి!
తోడు-నీడ భార్య భర్తలనంటారే!
కానీ నా నీడే నాకు తోడైంది!!
కీర్తి దాహంతో అలమటిస్తున్నావు
అది సముద్రపు నీరు లాంటిదని,
దప్పిక తీర్చదని తెలియని అజ్ఞానివి!
పేరు ప్రతిష్ఠలనే ఎండమావుల వెంట
పరుగెడుతున్నావు!
కాలం మనకొరకు ఆగదని తెలియని మూర్ఖుడవు!!
దృఢమైన మనిషివే కానీ స్థిరమైన మనస్సులేదు!
భావ సారూప్యత లేని బంధం భరించరానిది!
నీ కోపాగ్నికి నేను సమిధనయ్యాను!
ఏదో ఒక రోజు అలసిపోతావు! ఆగిపోతావు!!
కానీ అప్పుడు జీవితం ఉండదు
కానీ నేను జీవితపు బాటలో ఒంటరిదాన్ని
అయినా పోరుబాటలో ప్రజలందరిదాన్ని!
ఒక ఆశయానికంకితమై
చివరిదాక నిలబడ్డాను
అదే నాకు శాంతి! తృప్తి!!

-ఎన్.ఎస్. లక్ష్మిదేవమ్మ

# విరిసీ విరియని పూవు

-ఎన్. పద్మాంజలి

'చిన్నా!లేమ్మా! ఇవాళ నీ పుట్టిన రోజు కదా! ఐనా ఇంకా నిద్రలేవవేంటి? గుడికెళ్ళాలి, స్వీట్స్, చాక్లెట్స్ కొనాలి. నీ ఫ్రెండ్స్‌ని సాయంత్రం కేకు కట్టింగ్‌కి పిలవాలి. ఏంటేంటో చెప్పావు. మరి నిద్రలేవవేంటి తల్లి" అంటూ తన 15సం॥ల గారాల కూతురు సంధ్యని నిద్రలేపుతున్నది తల్లి శ్రీవల్లి. "లేస్తాలేమ్మా! టైం ఎంతయ్యింది?" ముసుగుతన్నే అడిగింది సంధ్య. 'ఐదున్నరయ్యిందమ్మా! మళ్ళీ స్కూల్‌కి లేటవుతుంది లేద్దూ' ముసుగు తీసి ముద్ద పెట్టి మరీ కూతురుకి చెప్పింది శ్రీవల్లి. ఇంతలో ఫోను మ్రోగింది. శ్రీవల్లి లేచివెళ్ళి సెల్‌ఫోన్ ఆన్ చేసి "హలో!ఎవరు?" అనగానే 'నేనే అంటీ సుకన్యని' సంధ్యకి విషెస్ చెప్పాలంటూ ఫోన్ తనకిమ్మన్నది. "నిద్రపోనీకుండా ఏంటే నీ గొల? చెప్పు ఏంచెప్తావు? అంటూ కళ్ళు తెరవకుండానే సుకన్యని పలకరించింది సంధ్య. " హ్యాపీ బర్త్‌డే టూయూ మొద్దు నీ కోసం ఇవాళ హుస్సేన్ ఎనిమిదిన్నరకే వచ్చేస్తానన్నాడు. గుర్తులేదా? అంటూ సుకన్య అనీ అనకుండానే ఫోన్ ఆఫ్ చేసి సంధ్య ఒక గంటలో రెడీ అయిపోయింది. "పిచ్చి పిల్ల, అమ్మ చెప్తే లేవలేదు గానీ, ఫ్రెండ్ చెప్పగానే ఎలా రెడీ అయ్యిందో చూడండి మీ ముద్దుల కూతురు" అని తండ్రితో అన్నా కూతురు ముస్తాబు చూసి మురిసిపోయింది. అమ్మ నాన్న కాళ్ళకు నమస్కరించి అనుకున్న ప్రకారం అన్ని పనులు ముగించుకుని ఎనిమిదిన్నరకల్లా హైస్కూలుకి చేరుకున్నది.



హుస్సేన్ 20సం॥ల కుర్రాడు. తండ్రి లేడు. తల్లి ఇళ్ళల్లో పనులు చేసి కుటుంబాన్ని పోషిస్తుంటుంది. హుస్సేన్‌కి చదువబ్బలేదు. చిన్నపుడే రెండు సార్లు ఇల్లొదిలి పారిపోయి తిరిగి ఇంటికి చేరుకున్నాడు. తల్లి పోరు పెడితే పాఠశాల ఎదురుగా మామిడికాయముక్కలు, వేరుశనగకాయలు, ఉసిరికాయలు అలా ఏ సీజన్లో తినేవి ఆ సీజన్లో అక్కడ అమ్ముతూ ఉంటాడు. ఆ స్కూలు పిల్లలతో చాలా చనువుగా మెసలేవాడు. ఎర్రగా, ఎత్తుగా, గిరజాల జుట్టు, ఒత్తైన మీసం, కండలు తిరిగి చూపరులకు ఎంతో అందంగా కన్పించేవాడు. హుస్సేన్ పగలు మాత్రమే అక్కడుంటాడు. ఆ అమ్మిన తినుబండారాల డబ్బుతో రాత్రిళ్ళు ఎక్కడెక్కడ ఏమేం చేస్తాడో వాడి తల్లికి కూడా తెలీదు. అతని చనువుని తన పట్ల ఇష్టంగా భావించింది సంధ్య. శాస్త్రీయంగా శరీరంలో జరిగే మార్పులతో అందంగా ఉన్న సంధ్య అతని అందానికి, మాటలకు ఆకర్షితురాలయ్యింది. అతన్ని చూడకుండా ఒక్కరోజు కూడా ఉండలేకపోతున్నది. బంధువుల ఇళ్ళకు వెళ్ళినా ఒక్క పూటకు మించి ఉండకుండా "స్కూలుకి వెళ్ళి పోవాలనేది. దానికి చదువంటే ఎంత శ్రద్ధ" అనుకున్నారంతా. సంధ్య, హుస్సేన్ ఒకరికొకరు ప్రేమలో పడ్డామని అనుకున్నారు. ఏ మాత్రం సమయం దొరికినా ఎవరికీ కనబడకుండా ఊరి చివర కలిసి తిరిగేవారు. ఈ రోజు సంధ్య పుట్టినరోజని రిస్ట్‌వాచ్ కొని తెచ్చాడు హుస్సేన్.

సంధ్య పుట్టినరోజు తల్లి శ్రీవల్లి ఘనంగానే వారి తాహతుకి తగ్గట్టు జరిపించింది. వాచ్ చూసి 'ఎక్కడిది?' అని అడిగింది తల్లి. "మా స్నేహితులు అందరూ కలిసి తలా కొంచెం వేసుకుని కొని పెట్టారమ్మా!" అని చెప్పింది. 'నా తల్లే! నువ్వంటే వారికి ఎంత అభిమానం!' అని మెచ్చుకున్నది.

పదో తరగతి పరీక్షలు రానే వచ్చాయి. సంధ్య పరీక్షలు సరిగ్గా వ్రాయలేకపోయింది. మంచి మార్కులు వచ్చే పిల్ల అత్తెసరు మార్కులతో పాసయ్యే సరికి సంధ్య తల్లి దండ్రులకి దిగులు పట్టుకుంది. బాగా చదివే పిల్లకి తక్కువ మార్కులు వచ్చాయంటే బళ్ళో సరిగ్గా చెప్పట్లేదు అని అనుకుని శ్రీవల్లి తన తమ్ముడు ఉన్న పెద్ద పట్నం కాలేజిలో చేర్పించారు. పిల్లని జాగ్రత్తగా చూసుకొమ్మని తమ్ముడుకి పదే పదే చెప్పింది.

సంధ్య, హుస్సేన్ రహస్య ఫోన్ కాల్స్ ఎవరూ గుర్తించలేదు. ఆడపిల్లలతో మాట్లాడించి తరువాత తాను మాట్లాడుతుండేవాడు.

"వదినా! సంధ్య కాలేజి నుండి ఇంటికి రాలేదు. నాకు భయంగా ఉంది. త్వరగా రా' అంటూ మరదలు ఫోన్ చేయగానే సంధ్య తల్లి దండ్రులు పరుగున చేరుకున్నారు. ఆరా తీశారు, వెతికారు, అప్పుడు తెలిసింది. సంధ్య, హుస్సేన్‌తో లేచిపోయిందని. తల్లిదండ్రులు, దగ్గర బంధువులు కన్నీరు మున్నీరుగా విలపించారు. కుటుంబ పరువు పోయిందని ఇంట్లోంచి బైటకి రావటమే మానేశారు. అందరూ చిక్కి సగమయ్యారు. ఆరు నెలల కాలం దిగులుగా గడిచింది వీరికి, ఓ నాలుగు నెలలు జాలీగా గడిచింది సంధ్య, హుస్సేన్‌లకి.

'యాయ్! ఆపు ఏడుపు ఆపు, ఎవరు చచ్చారని ఏడుపు, యామే గౌసియా! నీకే చెప్పేది. లేకపోతే బెల్టు పెట్టి కొట్టానంటే చచ్చి ఊరుకుంటావు' కళ్ళెర్ర చేసి ఊగిపోతూ బెదిరిస్తున్నాడు పాపం ఆ పదహారేళ్ళ సంధ్యని ఉరఫ్ గౌసియాని.

'నేనెళ్ళిపోతా! మా అమ్మ దగ్గరకెళ్ళిపోతా, నాకు మా నాన్న, మామయ్య, తాత, మామ్మలను చూడాలని ఉంది. నేనిక్కడుండను. ఇదే ఏడుపు. సంధ్య గత 2 నెలల నుండి ఆమె ఒంటిపై గాజులు, గొలుసు, చెవులవి అమ్మివేసి వాటితో ఈ నాలుగునెలలు ఎంజాయ్ చేశాడు హుస్సేన్. బండి వేయటం మానేశాడు. తనకి వాళ్ళమ్మ వేరే పెళ్ళి చేస్తున్నది. సంధ్యా! నువ్వు లేకపోతే నే చచ్చిపోతానని బెదిరించి వాళ్ళ పద్ధతిలో మతం మార్చి, పేరు మార్చి పెళ్ళి చేసుకున్నాడు. సున్నితంగా పెరిగిన సంధ్యకి వాళ్ళింట్లో ఉండటం కష్టమైపోయింది. ఇంటిపని, వంటపని సంధ్య చేత చేయించేవాళ్ళు. తల్లి పనిచేసే ఇళ్ళలో తెచ్చిన చద్ది, పాచిపోయిన కూడుని కూడా సంధ్యని తినమని బలవంతం చేసి తినిపించేవాళ్ళు. ఆర్థిక ఇబ్బందులు ఏమీ తెలియని సంధ్యకి కష్టాలు, దరిద్రం, ఈతి బాధలు తెలిసొచ్చాయి. ఆచార వ్యవహారాలు అగమ్య గోచరంగా అనిపించాయి. పొరలు కళ్ళ నుండి తొలగిపోగానే వాస్తవం తెల్సిన సంధ్య, తల్లిదండ్రుల కోసం పరితపించ సాగింది. "నీకు నేను విడాకులిస్తా"నని ఆ పసిది బెదిరించినా "నేను నీ ఆస్తి తెచ్చిచ్చేదాకా నిన్నొదిలిపెట్టను, నేను నీకు తలాక్ చెప్పను" అని త్రాగొచ్చి రోజూ ఒళ్ళు హూనం చేసేవాడు.

"అమ్మా! అమ్మా! నన్ను క్షమించు, నేను తప్పు చేశాను, భయంకర ఘోరం చేశాను. నా తప్పు మన్నించు. నేను ఇక్కడ ఉండనమ్మా! నువు కలిపి పెడితేనే తినేదాన్ని. ఇక్కడ పాచిపోయినవి తింటున్నాను. నువు కొత్త బట్టలిస్తే కొంచెం నచ్చకపోయినా ప్రక్కన పారేసేదాన్ని ఇక్కడ తీసేసినవి, పాతవి కట్టుకుంటున్నానమ్మా! నువ్వు ఒక్కమాట నన్ను అన్నా, నాన్న నిన్ను కేకలేసి, నన్ను దగ్గరకు తీసుకునే వాళ్ళు. కానీ అక్కడ వాళ్ళు నన్ను రోజూ తిడుతూ, కొడుతూ హింసిస్తున్నారమ్మా! నేనక్కడ ఉండలేనమ్మా! నన్ను తీసుకువెళ్ళు, లేకపోతే నే చచ్చిపోతానమ్మా!' అంటూ సంధ్య తల్లి కాళ్ళపై పడి గుడిమెట్ల వద్ద ప్రాధేయపడి ఏడ్చింది. శుక్రవారం హుస్సేన్ నమాజ్ కెళ్ళినపుడు తల్లి గుడికి వచ్చే రోజని తెలిసి సంధ్య ఇంట్లోంచి పారిపోయి వచ్చి తల్లిని కలిసి వెక్కి వెక్కి ఏడ్చింది. బంగారు బొమ్మలా అబ్బురంగా పెరిగిన తన కూతురు మాసిపోయి, నలిగిపోయి, చిక్కి శల్యమై చావటానికి సిద్ధమైన రూపంతో వున్న సంధ్యని చూసిన తల్లి గుండె ముక్కలయ్యింది. దు:ఖం పెల్లుబికి కంటికి ధారగా విలపించింది. కూతురుని మనస్ఫూర్తిగా గుండెకి హత్తుకుని, కళ్ళు తుడిచి ధైర్యం చెప్పి, తనతో ఇంటికి తీసుకెళ్ళిపోయింది. అనంతరం బంధువులతో గట్టిగానే చెప్పింది. మైనర్ వివాహం కోర్టు ద్వారా రద్దు చేయిద్దాం. దాని మనసు కుదుట పడేదాకా మనమెవ్వరం దాన్ని బాధపెట్టవద్దు. చదివినంత వరకు చదివిద్దాం. ఆపై భవిష్యత్తు నిర్ణయం ఆలోచిద్దాం' అని అంతా సరే అన్నారు. తండ్రి కూతురుని ఆమె బాధని కడుపులో దాచుకుని ఆదరించాడు. అనుకున్న విధంగానే అమలు పరిచారు.

ఇపుడు సంధ్య స్నేహితులెవ్వరితో సోది కబుర్లు ఫోన్‌లో చెప్పట్లేదు. టివిలో వార్తలు మినహా మరే ఎమ్‌టివి, ఫాషన్ ఛానళ్ళు చూడట్లేదు. వేళకు తిని పడుకుంటుంది. చక్కగా చదువుకుంటూ మంచి మార్కులతో ముందుకు సాగుతున్నది. ఇంజనీరింగ్ చేస్తున్నది. భవిష్యత్తు గురించి మంచి ప్రణాళికలతో చక్కని ఆరోగ్యవంతమైన కలలు కంటూ ముందుకు సాగిపోతున్నది.

పాఠకులారా! ఇపుడు చెప్పండి మతాంతర, కులాంతర వివాహాలు చట్ట విరుద్ధం కాదు. అలాగే అలా వివాహాలు చేసుకున్న వారంతా ఇదే విధమైన కష్టాలు అనుభవించటంలేదు. కానీ పరిపక్వత లేకుండా అన్ని విషయాలపై అవగాహన లేకుండానే సంధ్య ఇక్కడ తొందరపడింది. ఐతే చేసిన తప్పు తెలుసుకుని సరిదిద్దుకున్నది. తల్లిదండ్రులు, బంధువులు కూడా ఆమెని ఆదరించారు.

ఇది సబబేనా? ఆ వయసులోని పిల్లలు ఈ మధ్య కాలంలో ఇదేవిధంగా చేస్తున్నారు. కొందరు అక్కడే అంతమైపోతున్నారు. లేదా ఆ బాధలతోనే బ్రతుకు వెళ్లదీస్తున్నారు. దీనికి కారణాలు ఏమిటి? మీడియా ప్రభావమా? లేదా ఇంకేవైనా కారణాల వలన ఈ పసిపిల్లలు పెడత్రోవ పడుతున్నారా? మీరు ఆలోచించి మీ సలహా, సూచనలు తెలియచేయండి. నేటి బాలలే రేపటి సంపూర్ణ పౌరులుగా తీర్చిదిద్దబడాలంటే సమాజం, వ్యవస్థ, పరిపాలనా విధానాలు ఎలా ఉండాలో మీ అభిప్రాయాలు లేఖల ద్వారా తెలియజేయండి.

***

## స్పందన

స్పందించే హృదయం కావాలి -

వేల మందిని చైతన్య పరచడానికి

కష్టాలనుభవించే వాళ్ళకే తెలుసు - కన్నీటి విలువ

కడుపు కాలిన వాళ్ళకే తెలుసు - ఆకలి విలువ

ధరణికే తెలుసు - దగాపడిన అతివల ఆక్రందన

అద్దాల మేడలో ఉన్న వారికేమి తెలుసు

చైతన్య మానవి పై

అభిప్రాయాలను, సలహాలను ఆహ్వానిస్తున్నాం.

మా చిరునామా :

**చైతన్య మానవి**

తరతరాలుగా పాతుకుపోయిన దురాచారాలను ఎదిరించడం, జీవితాంతం ఏటికి ఎదురీది తన చుట్టూ ఉన్న సమాజంలో మార్పు కోసం కృషి చెయ్యడం మాటలు చెప్పినంత తేలిక కాదు. చెప్పడంతో సరిపెట్టుకోక ఆచరించి చూపెట్టారు ఫూలే దంపతులు.

18, 19 శతాబ్దాల్లో సంఘ సంస్కరణోద్యమాలు ఉధృతంగా సాగాయి. స్త్రీ విద్య, వితంతు పునర్వివాహాలు, సతీసహగమనం, ఆస్తి హక్కు వంటి స్త్రీల హక్కుల కోసం, కుల అసమానతలకు వ్యతిరేకంగానూ బ్రిటీష్ ఇండియాలో సంఘ సంస్కర్తలు ఉద్యమించారు. ఆనాటి సమాజంలో అతి బాల్య వివాహాల కారణంగా బాల వితంతువుల సమస్య సమాజానికి ఒక సవాలుగా మారింది. వంచనకు గురయిన బాలవితంతువుల సమస్య, భ్రూణ హత్యలు, గర్భస్రావాలు, సాంప్రదాయం పేరుతో స్త్రీని ఇంటికి కట్టి పడేయటం, అక్షరజ్ఞానానికి దూరం చెయ్యడం వంటి సమస్యలు తీవ్రంగా ముందుకొచ్చాయి. ఈ సామాజిక స్థితిలో మార్పు తెచ్చేందుకు జ్యోతిరావ్ - సావిత్రీ బాఫూలే, కందుకూరి, గురజాడలు రాజా రామ్మోహనరాయ్, విద్యాసాగర్‌లు, కుల అణిచివేతను ఎదిరించిన అంబేద్కర్ వంటి మహనీయులు చేసిన కృషి అసాధారణమైనది.

మన రాష్ట్ర అనుభవాన్నే తీసుకుంటే సంస్కర్తలు సాగించిన ఉద్యమస్ఫూర్తిని స్వాతంత్ర్యోద్యమ నాయకులు, ప్రత్యేకించి ఆనాటి యువతరం కొనసాగించారు. స్వాతంత్ర్యోద్యమంలో భాగంగానే స్త్రీల హక్కుల ఉద్యమాలు సాగాయి. ఈ ఉద్యమాల నిర్వహణకు పుచ్చలపల్లి సుందరయ్య వంటి ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు ప్రత్యేక కృషి చేసి డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ వంటి మహిళా నేతల్ని ప్రోత్సహించారు. ఫ్యూడల్ బంధనాలకు వ్యతిరేకంగా సాగిన తెలంగాణా రైతాంగ పోరాటం ఎందరో వీర నారీమణులను పోరాటంలో తెచ్చింది. వారి కృషి మరెందరో మహిళలకు స్ఫూర్తి నిచ్చింది.

స్వాతంత్ర్యానికి ముందు, ఆ తరువాత కూడా మహిళా ఉద్యమం బాల్య వివాహాలకు వ్యతిరేకంగా, వితంతు పునర్వివాహాలు, ఆస్తిహక్కు, విడాకుల హక్కులు - ఇత్యాది - కుటుంబంలో స్త్రీ స్వేచ్ఛకు సంబంధించిన హక్కుల కోసం; ప్రసూతి సౌకర్యాలు, సమాన వేతనాలు, మంచినీరు, మరుగుదొడ్లు వంటి హక్కుల కోసం స్త్రీలను చైతన్యవంతం చేసి ఉద్యమాలు నడిపింది. ఈ ఉద్యమాల ఫలితంగా చట్టపరంగా స్త్రీలకు కొన్ని హక్కులయినా వచ్చాయి. హిందూ కోడ్ బిల్లుపై బి.ఎన్.రావు నేతృత్వాన వేసిన కమిటీకి మహిళానేతలు ఆరోజుల్లో 50000కు పైగా సంతకాలు సేకరించారు. స్త్రీలకు ఆస్తి వారసత్వ హక్కు బిల్లును ఆనాటి కాంగ్రెసు నేతలు నిరాకరించిన ఫలితంగానే న్యాయశాఖ మంత్రిగా వున్న డా॥ అంబేద్కర్ మంత్రి పదవికి రాజీనామా చేసిన విషయం జగమెరిగిన సత్యం. సంస్కరణోద్యమం నిస్సందేహంగా స్త్రీలకు వ్యక్తిగత జీవితాల్లోనూ, సామాజికంగానూ కొన్ని హక్కులు సాధించి పెట్టింది. చట్టపరంగా స్త్రీలకు కొన్ని హక్కులు వచ్చాయి.

- ఎస్. పుణ్యవతి

ఈ ఉద్యమాలు ప్రధానంగా తెల్లవాళ్ళు పరిపాలించిన కాలంలో జరిగాయి. ఆ తరువాత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. మన సొంత రాజ్యాంగం అమలులోకి వచ్చింది. ఇప్పటికి 60 దశాబ్దాలు దాటిపోయాయి. అంటే మూడు తరాలు గడిచాయి. ఈ కాలంలో ఆర్థిక, సామాజికాభివృద్ధిలోను, శాస్త్ర సాంకేతిక రంగాల్లోను అనేక మార్పులు వచ్చాయి. వాటి ఫలితాలు స్త్రీల జీవితాలపై కూడా పడ్డాయి. ఆధునిక భారత మహిళ చరిత్రను తిరగ రాస్తుందని మహాకవి గురజాడ ఆశించినట్లు వివిధ రంగాల్లో స్త్రీలు అభివృద్ధిని సాధించారు. అదే సందర్భంలో అభివృద్ధి అన్ని వర్గాల స్త్రీలకు, ఒకే విధంగా అందుబాటులో ఉందని చెప్పలేం. పైగా వివిధ కోణాల్లో పరిశీలిస్తే సాపేక్షంగా స్త్రీల స్థాయి దిగజారుతున్నట్లనిపిస్తుంది. అందుకు నిదర్శనం జనాభా లెక్కలే. ఆర్థికాభివృద్ధి స్త్రీ సంక్షేమానికి దోహదపడాలి. కాని అందుకు విరుద్ధంగా స్త్రీ పురుష నిష్పత్తి పడిపోతోంది. ఎందుకీ వైరుధ్యం?

### జనాభా లెక్కలేం చెబుతున్నాయి?

**1901**లో స్త్రీ పురుష నిష్పత్తి **972**. అనగా ప్రతి వెయ్యి మంది పురుషులకు **972** మంది స్త్రీలు ఉన్నారు. **2001** నాటికి ఆ నిష్పత్తి **933**కి పడిపోయింది. గడిచిన దశాబ్దకాలంలో ప్రతి **1000** జనాభాకి **40** మంది స్త్రీలు మాయమయ్యారు. స్వాతంత్ర్యానంతర కాలంలో

దేశంలో 3.7 కోట్ల మంది మహిళలు అంతర్ధానమయ్యారని 1986లోనే నోబుల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్ అంచనా వేశారు. ఆసియాలోని ఇతర దేశాల మాదిరిగానే భారతదేశంలో స్త్రీల పరిస్థితి దిగజారుతోంది. పుత్రసంతానానికి ఉన్న ప్రాధాన్యత, పితృస్వామ్య సంస్కృతి కారణంగా స్త్రీ రెండవ తరగతి పౌరురాలిగా చూడబడుతోంది. దానికి పెట్టుబడిదారీ, వ్యాపార ఆర్థిక విధానాలు తోడయ్యి స్త్రీల స్థాయి ఇంకా దిగజారింది. ఇప్పటికే ఉన్న స్త్రీ పురుష అసమానతలు ఇంకా పెరిగి వారి సంబంధాల్లో అగాధమేర్పడింది. జనాభా లెక్కలు ఈ వాస్తవాన్ని బలంగా చెబుతున్నాయి.

సరళీకరణ ఆర్థిక విధానాలు స్త్రీల పరిస్థితిని ఇంకా దిగజార్చాయి. స్త్రీ పురుష నిష్పత్తిలో ఇది ప్రతిబింబిస్తుంది. రాష్ట్రంలో స్త్రీ పురుష నిష్పత్తి 1991లో 972 వుండగా 2001లో 978కి కొద్దిగా పెరిగింది. అయితే 5 సం॥లోపు పిల్లల్లో 1991లో 975 ఉండగా 2001కి 964కి తగ్గింది. కారణాలు పరిశీలిస్తే కర్ణుడు చావుకు కారకులెవరన్నట్లుంటుంది.

ఆర్థికాభివృద్ధిలో స్త్రీలకి రావలసిన వాటా తగ్గిపోతోంది. స్త్రీల శ్రమకి డబ్బు రూపంలో విలువ లేదు. ఐక్యరాజ్యసమితి అభివృద్ధి కార్యక్రమం (యు.ఎన్.డి.పి) ప్రకారం, పురుషుల వేతనాల కన్నా స్త్రీల వేతనాలు 30-40% తక్కువగా ఉంటున్నాయి. ప్రపంచంలోని పేదలలో 70% స్త్రీలు. వారిలో భారతీయులు ఎక్కువ. రాష్ట్రంలో పరిస్థితి అందుకు భిన్నంగా లేదు. సంస్కరణలు ఈ సంస్కృతిని మార్చి, స్త్రీల స్థితిని మెరుగుపర్చక పోగా ఇంకా దిగజార్చుతున్నాయి.

## ఆర్థిక స్వేచ్ఛ:

స్త్రీలు, వారు ఏవర్గానికి చెందిన వారయినా వారి అభివృద్ధికి ఆర్థిక హక్కులు అవసరం. దానితో పాటు సామాజికంగా స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు, కుటుంబంలో, రాజకీయల్లో నిర్ణయాత్మకపాత్ర వంటివి అవసరం. ఉపాధి ఉద్యోగాల్లో స్త్రీకి సరైన స్థానం అవసరం. సంపదకి మూలమైన ఆస్తిపైనా వాటా అవసరం. వాటిని అనుభవించడంలో సంపూర్ణ స్వేచ్ఛ కూడ అంతే అవసరం.

ప్రస్తుతం మన రాష్ట్రంలో 35% స్త్రీలు ఇంటి బయటసాగే ఆర్థిక కార్యకలాపాల్లో పాల్గొంటున్నారు. కాని మెజారిటీ మహిళలు అతి తక్కువ ఆదాయం వచ్చే వ్యవసాయరంగంలోను లేదా కులవృత్తుల్లోనూ, అసంఘటిత రంగంలోనూ ఉన్నారు. సంఘటిత రంగంలో 10% మాత్రమే మహిళలు ఉన్నారు.

అక్షరాస్యత ప్రభావం స్త్రీల మొత్తం అభివృద్ధి పైన పడుతుంది. అక్షరాస్యత లేని కారణంగా శాస్త్ర సాంకేతిక రంగాల్లో జరుగుతున్న అభివృద్ధి ఫలాలు స్త్రీలకు అందనంటున్నాయి. శ్రామిక మహిళల్లో అక్షరాస్యత ఈ విషయాన్ని తెలియజేస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లో 78% మహిళా శ్రామికులు నిరక్షరాస్యులు కాగా పట్టణ ప్రాంతాల్లో 50% మంది. శ్రామిక మహిళల్లో ఉన్నత చదువులు చదివిన వారు గ్రామాల్లో 0.93% కాగా పట్టణాల్లో 15% మాత్రమే. చదువుల్లో కూడా నాణ్యమైన చదువులు- సైన్సు. ఇంజనీరింగ్, వైద్యం, మేనేజ్‌మెంటు, అడ్మినిస్ట్రేషన్ వంటి కోర్సులు స్త్రీలకు అందుబాటులో లేవు. సంఘటిత రంగంలోనూ ప్రభుత్వ రంగంలోనూ నిర్వహించే ఉద్యోగాలు, ఉన్నత పదవులు, సామాజిక హోదాను పెంచుతాయి. అందుకు భిన్నంగా సామాజిక హోదాను హీనపర్చే అటెండర్లు, స్వీపర్లు వంటి పోస్టులు మాత్రమే ఎక్కువగా స్త్రీలకు దొరుకుతున్నాయి. ఒక వేళ సంఘటిత రంగంలో, ప్రభుత్వోద్యోగాల్లో స్త్రీలు ఉన్నప్పటికీ వాటిల్లో ఎక్కువభాగం కుటుంబపరంగా స్త్రీలు చేసే పనులకు కొనసాగింపు లాంటివే. టీచరు, నర్సు, గుమస్తా, టైపిస్టు- ఇత్యాది పోస్టులే ఎక్కువ. ప్రయివేటీకరణ ఫలితంగా ఆ ఉద్యోగాలు కూడా అసంఘటిత రంగంలో చేరిపోయాయి.

ఇకపోతే వ్యవసాయం, కులవృత్తులు ఇతర గృహ సంబంధమైన వృత్తుల్లో ఉన్న స్త్రీల పరిస్థితి చూద్దాం. వ్యవసాయ కార్మికులు పని దొరికిన్నాడు తిని, లేనినాడు పస్తులతో కాలం గడిపే ఆర్థిక దుస్థితి. వీరిలో --- శాతం దళితులు. వీరితోపాటు వ్యవసాయం పైనే ఆధారపడే పేద, చిన్న రైతులు, కౌలురైతులున్నారు. వీరి కుటుంబాలు కుటుంబ సభ్యులందరి శ్రమపైన ఆధారపడ్డ కుటుంబాలు. అందులో కూడా స్త్రీలు, బాలికలు, పెళ్ళి కాని ఆడపిల్లల శ్రమ ఈ కుటుంబానికి మూలాధారం. పెట్టుబడిదారీ ఆర్థికాభివృద్ధి వల్ల వ్యవసాయం స్త్రీల వృత్తిగా మారుతోంది. 70-80% వ్యవసాయపనులు స్త్రీల శ్రమతో నడుస్తున్నాయని ప్రభుత్వ అధ్యయనాలు చెప్తున్నాయి. కల్లుగీత, నేత, గొర్రెల పెంపకం, పశుపోషణ, మత్స్యకారులు వంటి కుల వృత్తుల్లో పురుషులు బయటిపని చేస్తే స్త్రీలు, బాలికలు ఇంటిని కేంద్రంగా చేసికొని గృహనిర్వహణతోపాటు, కల్లు అమ్మకం, గొర్రెల సంరక్షణ, చేపల ప్రాసెసింగు, అమ్మకం ఇత్యాది పనులన్నీ నిర్వహిస్తున్నారు. కుటుంబ ఆర్థిక వ్యవస్థలో కీలకపాత్రధారులవుతున్నారు. కాని ప్రభుత్వ పాలసీలు రూపొందించేటప్పుడు వీరి శ్రమని పరిగణనలోకి తీసుకోవడం లేదు. ప్రభుత్వం కుటుంబాన్ని ఆర్థిక యూనిట్టుగా గుర్తిస్తుంది. పితృస్వామిక కుటుంబానికి యజమాని తండ్రీ లేక భర్త లేక కొడుకు కనుక యజయాని కేంద్రంగానే పాలసీలు వుంటాయి.

ఫలితంగా స్త్రీలు తీవ్రంగా నష్టపోతున్నారు. వారి శ్రమ లెక్కకు రాని కారణంగా పురుషుని మీద ఆధారపడ్డ పరాధీనులుగానే ఉంటున్నారు. స్త్రీలు కుటుంబ శ్రమలో భాగస్వాములే గాని ఆదాయంలోను, సమకూర్చుకున్న సంపదలోను వారికి హక్కు ఉండదు. తల్లి, భార్య, ఆడపిల్ల అందరి భారాన్ని మోసేవాడుగానే కుటుంబ యజమానిని సమాజం చూస్తుంది.

గృహ సంబంధమయిన వృత్తుల్లో ఉన్న స్త్రీల స్థితి మరీ దారుణం. ముస్లిం మైనారిటీలు, బి.సి., యస్.సి. కుటుంబాల మహిళలే ఈ వృత్తుల్లో ఎక్కువగా వున్నారు. స్త్రీలే ఈ వృత్తిదార్లు. ప్రభుత్వ లెక్కల్లో కానరాదు. నర్సాపూర్ లేసులు, చోడవరం ఇస్తరాకులు, పుంగనూరు చింతపండు కార్మికులు, కుప్పం అగర్‌బత్తీ కార్మికులు - ఇత్యాది ఉదాహరణలు కోకొల్లలు. కుప్పం మండలంలో అగర్‌బత్తీ కార్మికులే వేల మంది ఉన్నారు. జనాభా లెక్కల్లో రైతులు, వ్యవసాయ కూలీలు, ఇతరత్రా కార్మికులు అందరూ కలిపి మహిళా శ్రామికులు 20,000 మంది అని చూపించారు. అలాగే పుంగనూరు పరిసరాల్లో చింతపండు కార్మికులే సుమారు 10,000 మంది. జనాభా లెక్కల్లో మొత్తం స్త్రీకార్మికులు 3,600 మంది అని చెప్పారు. ఇదీ వరస.

ఇకపోతే ఇంటిపని! స్త్రీలు రోజుకు 6 నుండి 8 గంటల వరకు ఇంటి పనికే కేటాయిస్తారు. వంటపాత్రలు, ఇల్లు, పశువుల కొష్టాలు శుభ్రం చెయ్యడం, బట్టలు ఉతకటం, వంట చెయ్యడం, నీళ్ళు, కట్టెలు,

పశువులకు గడ్డి తెచ్చుకోవడం, పిల్లల సంరక్షణ, వగైరా పనులన్నీ - 'ఇంటి చాకిరీ'లో భాగమే. ఈ శ్రమ కుటుంబ నిర్వహణకు అవసరమయినదే, కాని ఆదాయం లేనిది. ఒక్క మాటలో చెప్పాలంటే 'క్షణం తీరిక లేదు, దమ్మిడీ పాటు లేదు' అని ఆడవాళ్ళు అందుకే అనుకుంటారు. కనుకనే ఐక్యరాజ్యసమితి మొత్తం శ్రమలో మూడింట రెండువంతులు శ్రమ మహిళలు చేస్తారని, ఆదాయంలో పదిశాతం మాత్రమే పొందుతారని ఒక్క శాతం ఆస్తులు కల్గివున్నారని అంచనా కట్టింది. ఇంటిచాకిరీ సమస్య గ్యాస్ పొయ్యిలు, కుక్కర్లు, నీళ్ళ పంపులున్న ఆడవాళ్ళకి అంత తీవ్రంగా ఉండకపోవచ్చు. పేద శ్రామిక స్త్రీలు ఇంటాబయటా చాకిరీతో నలిగిపోతూ వ్యక్తిగా ఎదగలేకపోతున్నారు. సమాజ అభివృద్ధిలో వాటా పొందలేకపోతున్నారు.

ఈ సమస్యల్ని మహిళా ఉద్యమం ముందుకు తెచ్చింది. ఇంటి పనిని లెక్కగట్టాలని, ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కుటుంబానికి ఆర్థికంగా తోడ్పాటు నిచ్చే పనులను లెక్కలోకి తీసుకోవాలని, వివాహానంతరం సంపాదించిన ఆస్తిలో భర్తతోపాటు భార్యకి కూడా వాటా కల్పించాలని తదితర డిమాండ్లు ముందుకు తెచ్చింది. ఈ డిమాండ్లు పాలసీ పరంగా స్త్రీలను శ్రామికులుగా గుర్తించడానికి, ప్రజాస్వామ్య ప్రక్రియలో భాగస్వాములను చెయ్యడానికి, కుటుంబంలో ప్రజాతంత్ర విలువల్ని ప్రోత్సహించడానికి, స్వతంత్ర పౌరురాలిగా చూడడానికి తద్వారా రాజ్యాంగస్ఫూర్తిని నిలబెట్టడానికి పనికి వచ్చేవే.

## చదువులు:

వ్యక్తిత్వ వికాసానికి, ఉపాధి ఉద్యోగాలకి చదువు అవసరం. కాని చదువుకునే ప్రాథమిక హక్కు స్త్రీలకి నిరాకరించబడుతోంది. 2001 లెక్కల ప్రకారం రాష్ట్రంలో 7 సం॥ పైబడ్డ వారిలో అక్షరాస్యులైన స్త్రీలు 51% మాత్రమే. రాష్ట్రంలో అక్షరాస్యత 60% కాగా అదే పురుషుల్లో 70% వుంది. వివిధ సామాజిక తరగతుల్లో చూస్తే దళితుల్లో అక్షరాస్యత 50% కాగా దళిత పురుషుల్లో 63%, స్త్రీలలో 43%గా ఉంది. గిరిజనుల్లో అక్షరాస్యత 37% కాగా గిరిజన పురుషుల్లో 48%, స్త్రీలలో 26% వుంది. సాధారణ జనాభాలో స్త్రీ, పురుషుల మధ్య అక్షరాస్యత వ్యత్యాసం 38.8% ఉంటే, దళితుల్లో 51.7%, గిరిజనుల్లో 65.7% వ్యత్యాసం ఉన్నది. స్త్రీల పట్ల వివక్షకు సామాజిక అసమానతలు కూడా తోడయ్యాయి.

## చదువు-సామాజికస్థితి:

ఇదిలా ఉండగా బడిలో చేరుతున్న పిల్లల సంఖ్య కొంత ఆశాజనకంగా ఉంది. కాని బడిమానివేస్తున్న పిల్లల సంఖ్య చూస్తే ఒక అడుగు ముందుకు రెండు అడుగులు వెనక్కి అన్నట్లున్నది. 2000 నాటికి 6-13సం॥ మధ్య వయసున్న పిల్లల్లో 60% పైగా ఆడ పిల్లలు బడి మానివేస్తున్నారు. బాలకార్మికుల జాబితాలో చేరిపోతున్నారు. ఎందువల్ల? పేదరికం, బడి అందుబాటులో లేకపోవడం ఆడపిల్ల పట్ల వివక్ష, ఇంటిచాకిరి వంటివి ప్రధాన కారణాలుగా కనిపిస్తాయి.

కుటుంబసభ్యుల శ్రమ మీదనే ప్రధానంగా ఆధారపడ్డ కుటుంబాల్లో ఆడపిల్ల చదువు అందని ద్రాక్ష పండుగానే ఉంటుంది. 5-6సం॥ వయసు నుండి ఆడపిల్లలు పనులు చేయక తప్పదు. తల్లి పనికి పోతే తమ్ముళ్ళను, చెల్లెళ్లను ఆడించడం, ఇంటిపనిలో సహాయపడడం తప్పనిసరి. దళితులు, గిరిజనులు మాత్రమేగాక చిన్న రైతులు వృత్తిదారుల్లో కుడా ఇదేవరిస్థితి. గొర్రెలు, మేకలు పెంపకందార్లు, కల్లుగీతకార్మికులు, నేతకార్మికులు, బీడీ కార్మికులు ఇత్యాది కుటుంబాల్లో స్త్రీల శ్రమే మూలాధారం. అటు వంటి స్థితిలో ఆడపిల్ల తెగించి బడికి పోతానన్నా 'ఇంటి పని ఎవడొచ్చి చేస్తాడు' అంటూ తల్లి తిట్లు మొదలెడుతుంది. అదే తల్లి కొడుకు చదువు పట్ల శ్రద్ధ పెడుతుంది. రెక్కలు ముక్కలు చేసుకునైనా కులాన్ని, కుటుంబాన్ని ఉద్ధరించే కొడుకును పెంచి విద్యాబుద్ధులు చెప్పిస్తుంది, ప్రయోజకుణ్ని చేస్తుంది ఆ తల్లి. ఒకవేళ కొంత వెసులుబాటు ఉండి చదివిద్దామన్నా పితృస్వామ్య కుటుంబపు విలువలు అందుకు అంగీకరించవు. ఆడపిల్లకు పెట్టిన పెట్టుబడి, గోడకు కొట్టిన సున్నం తిరిగిరావు అంటూ సామెతలు గుర్తుచేస్తారు. ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళి పోతుంది కనుక మాకేం ఉపయోగం అంటూ వాదనకి దిగిన సందర్భాలు అనేకం ఎదుర్కొన్నాం.

బడి అందు బాటులో లేక పోవడం మరో సమస్య. ఆడపిల్లని ఉన్న ఊళ్ళో వరకు, అది కూడా 5వ తరగతి వరకు చదివించడానికి కొంత శ్రద్ధ చూపుతున్నారు. ఆ తరువాత వేరే ఊరికి పంపి చదివించరు. చదివించినా సవాలక్ష ఆంక్షలు పెడతారు. స్త్రీల శీలం చుట్టూ పరిభ్రమించే భావజాలం ఆడపిల్ల చదువును నిరోధిస్తోంది. ముల్లు వచ్చి అరిటాకుమీద పడ్డా ...వంటి సామెతలు ఉత్తినే పుట్టలేదు. ఈ భావజాలమే ఆడపిల్లను విద్యకు దూరం చెయ్యడంతోపాటు ఆమెకు అభివృద్ధి ఫలితాలు అందకుండా చేస్తోంది; కుటుంబంలో ఆడపిల్లలు - మగ పిల్లల మధ్య అసమానతని పుత్రసంతానానికి ప్రాధాన్యతను పెంచుతోంది. పరోక్షంగా కట్నం సమస్యకి కూడా ఆజ్యం పోస్తోంది. కోరిన కట్నం ఇచ్చి పెళ్ళి చేసి గుండెల మీద బరువు దించుకోవాలి అన్న ఆలోచనకు దారి తీస్తోంది.

ప్రభుత్వం పూర్తి బాధ్యత తీసుకుంటేనే ఆడపిల్లల చదువుల విషయంలో ఆశించిన ఫలితాలు సాధించగలం. దళిత, గిరిజన, బలహీనవర్గాల బాలలకు ఉచితవిద్యతోపాటు హాస్టలు సదుపాయాలు అవసరం. ప్రస్తుతం ఉన్న వసతి గృహాలు బాలబాలికలకు 2:1 నిష్పత్తిలో ఉన్నాయి. ఈ పరిస్థితి పోవాలి. కనీసం సమానంగా అయినా వుండాలి.

## ఆరోగ్యం:

అధిక శ్రమ, పోషకాహార లోపం వల్ల స్త్రీల ఆరోగ్యం దెబ్బ తింటోంది. స్త్రీలలో రక్తహీనత చాలా హెచ్చుగా ఉంటోంది. జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే 2005-06 ప్రకారం వివాహిత మహిళల్లో రక్తహీనత 56% అని తేలింది. అదే పురుషుల్లో 24%. కుటుంబంలో హింస, అభద్రత, పరిసరాల అపరిశుభ్రత కూడా స్త్రీల మానసిక, శారీరక ఆరోగ్యంపై ప్రతికూల ప్రభావాన్ని చూపుతున్నాయి. ప్రజారోగ్యంపై ప్రభుత్వం చూపే నిర్లక్ష్యం స్త్రీల ఆరోగ్యస్థితిని ఇంకా దిగజార్చుతోంది.

స్త్రీలకు ఇంటిపని బయట పని - రెండు కలిసి తడిసి మోపెడవుతోంది. అధికశ్రమ అనారోగ్యానికి హేతువవుతోంది. ఇంట్లో అందరూ తిన్న తరువాతనే స్త్రీలు, ఆడపిల్లలు తినేది. ఒక్క మాటలో చెప్పాలంటే 'కుండ నిండా కూడు వుంటేనే ఆడదానికి కూడు దొరికేది'.

ఉన్నంతలో మాంసం, చేపలు వంటి పోషక విలువలు కలిగింది కొడుకులకి, భర్తకి పెట్టి మిగిలింది స్త్రీలు, ఆడపిల్లలు తినడం ఆనవాయితీ. వీటన్నింటికీ తోడు బ్యాల వివాహాలు చిన్న వయసులో గర్భధారణ వల్ల స్త్రీల శరీరాలతోపాటు మనసులు కూడ కొడిగట్టిపోతున్నాయి. ఆడపిల్ల సంరక్షణ, కాయకష్టం చేసే తల్లికి గుండెల మీద కుంపటిలా మారడంతో చిన్న వయసులోనే పెళ్ళి చేసి బరువు వదిలించుకునే తాపత్రయంలో తల్లి పడుతోంది. పుత్రుల్ని కనడమే స్త్రీల లైంగికతకి అర్థం పరమార్థంగా పితృస్వామ్య సమాజం శాసించింది. పెళ్ళయింది మొదలు 'కొడుకుని ఎప్పుడు కంటావ్' అంటూ గుక్క తిప్పుకోనివ్వరు. అధునాతన కుటుంబ నియంత్రణ సాధనాలు ఆమె ఎరికలో (అందుబాటులో) ఉండవు; ఉన్నా కనడం-కనకపోవడం అన్న నిర్ణయం ఆమెచేతిలో ఉండదు. పోషకాహారలోపం, బాల్య వివాహం, చిన్న వయసులో గర్భధారణ - వెరసి ఆడదాన్ని అర్థాయుష్కురాల్ని చెయ్యడంతోపాటు పుట్టబోయే బిడ్డల ఆయురారోగ్యం మీద కూడా ఆ ప్రభావం పడుతోంది. ప్రతి 1000 మంది శిశువులకి 66 మంది పుట్టిన వెంటనే చనిపోతుండగా గిరిజనుల్లో 83%; దళితులలో 84% ఇతర పేదల్లో 76% చనిపోతున్నారు.

ఈ పరిస్థితి వల్ల నష్టపోయేది మొత్తం సమాజం. ప్రజా సమస్యల్ని ముందుకు తెచ్చే వివిధ ప్రజా సంఘాలు, ప్రభుత్వ విధాన నిర్ణేతలు తీవ్రంగా పరిగణించాల్సిన విషయం ఇది.

### హింస:

స్త్రీలను హింసించడంలో మన రాష్ట్రం దేశంలోనే అగ్రస్థానంలో ఉంది. అనేకమంది స్త్రీలు ఇంట్లో భర్త పెట్టే హింసకి, ఇంటి బయట, పని ప్రదేశంలోను పోకిరీల వేధింపులకి బాధితులవుతున్నారు. భార్యని కొట్టే ప్రతి భర్తా 'నాపెళ్ళాం నా ఇష్టం అడగడానికి నువ్వెవరు అంటాడు. ఈ ప్రశ్న అడ్డం వచ్చిన వాళ్ళని మాత్రమే గాక, పిల్ల నిచ్చిన అత్తమామల్ని, బావమరుదుల్ని కూడా (పిల్లనిచ్చిన అని ఎందుకంటున్ననంటే పిల్ల ఇవ్వబడుతోంది గనుక).

కట్నాల కోసం వేధింపుల సమస్య మరో తీవ్రమైన సమస్య. గతించిన కాలంలో ఆస్తిపర వర్గాల్లోనే ఉన్న కట్నాల గొడవ శ్రామిక కుటుంబాలకి కూడా పాకింది. ఆడపిల్లల కట్న కానుకల కోసం, ఉన్న కొద్దిపాటి భూముల్ని అమ్ముకున్న వాళ్ళు, అడ్డ కూలీలుగా మారిన వాళ్ళు, కొడుకుల్ని జీతానికి పెట్టిన వాళ్ళు కోకొల్లలు. ఇంత చేసినా ఆడపిల్ల జీవితానికి గ్యారంటీ చెప్పలేము. ఇచ్చిన కట్నం పెళ్ళి ఖర్చులకి, చీరలు, సింగారాలకి పోగా డబ్బు కోసం మళ్ళీ మళ్ళీ పుట్టింటికి తోలెయ్యడం జరుగుతోంది.

జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే 1998-99లో రెండవ నివేదిక ప్రకటించింది. ఆ నివేదిక ప్రకారం గృహ హింసను ఆమోదించే స్త్రీలు మన రాష్ట్రంలో 80%ఉంటే అన్నింటా అభివృద్ధిలో ఉన్న కేరళలో 61% ఉన్నారు. ఏదో ఒక కారణంతో, అనగా అన్నం సరిగా వండకపోయినా, పిల్లల్ని, అత్తమామల్ని చూడకపోయినా, శీలంపై అనుమానం వచ్చినా, ఇంకా ఇటువంటి కారణాలతో భర్త భార్యని కొట్టడం తప్పుకాదనే ఆలోచనతో స్త్రీలున్నారంటే పురుషాధిక్య తీవ్రతను అర్థం చేసుకోవచ్చు.

### సమస్య మహిళలందరిదీ:

సమాజంలో స్త్రీలంతా కూడా ఒకే ఆర్థిక, సామాజిక తరగతికి చెందిన వారు కారు. వారు ఎదుర్కొనే సమస్యలూ ఒకే విధంగా వుండవు. దళిత, బలహీన వర్గాల స్త్రీలు తమ తోటి స్త్రీల కన్నా అదనంగా ఆర్థిక, సామాజిక అణచివేతను భరిస్తున్నారు. వీరి పరిస్థితి గాలి, నిప్పుకు ఆజ్యం తోడయినట్లవుతున్నది. ఈ వాస్తవాన్ని ప్రజా ఉద్యమాలు గమనించాలి.

ప్రముఖ ఆర్థికవేత్త అమర్త్యసేన్ ఇచ్చిన వివరాల ప్రకారం స్వాతంత్ర్యానికి పూర్వం నిచ్చెనమెట్ల కులవ్యవస్థలోని దిగువ కులాల్లో స్త్రీ - పురుష నిష్పత్తి కొంచెం మెరుగు. కాని ఆ పరిస్థితి రాను రాను పడిపోతోంది. 1991 నాటికి దేశంలో స్త్రీ పురుష నిష్పత్తి 927 ఉంటే; అదే దళితుల్లో 922 ఉన్నది. ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఉత్తర భారతదేశంలో ఏదయితే క్షత్రియకులాలు బాల్య వివాహాలు, ఆడశిశుహత్యలు, సతి వంటి స్త్రీల అణచివేత పద్ధతులకు తెరలేపాయో, ఆ కులాల సాంప్రదాయాలనే దళిత కులాలు అక్కడ అనుసరిస్తున్నాయా? స్త్రీని అణచిపెట్టే సాంప్రదాయం కులహోదాని పెంచుతుందని భావిస్తున్నారా? అన్న సందేహం వస్తోంది. అమర్త్యసేన్ చెప్పిన వివరాల ప్రకారమే ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో 1901లో చమార్ కులస్తుల్లో స్త్రీ పురుష నిష్పత్తి 986 ఉంటే 1981 నాటికి ప్రమాదకర స్థాయికి 880కి దిగజారింది.

మన రాష్ట్రంలో కూడ స్త్రీ పురుష నిష్పత్తి 1000:978 కాగా దళితుల్లో కాస్త ఎక్కువగా 981 మాత్రమే. గిరిజనుల్లో రాష్ట్ర సరాసరి కన్నా తక్కువగా 972 గా వున్నది. అదీన్నూ కోస్తా జిల్లాలన్నింటా గ్రామీణ దళితుల్లో స్త్రీ పురుష నిష్పత్తి ఆయా జిల్లాల సరాసరి కన్నా తక్కువగా ఉంది. రాష్ట్రంలో స్త్రీ పురుష నిష్పత్తి హైదరాబాదు (933) రంగారెడ్డి (929), నల్గొండ (944) జిల్లాలు అట్టడుగు స్థాయికి చేరిపోగా కొన్ని జిల్లాల్లో దళితులు, గిరిజనుల్లో కూడా పడిపోయింది. అనంతపురం జిల్లా గ్రామీణ దళితుల్లో 951గా ఉండగా, నల్గొండ జిల్లా గిరిజనుల్లో ప్రమాదకర స్థాయికి 712కి పడిపోయింది. ఇక పోతే ఒ.సి., బి.సి. కులాలు, ముస్లిం మైనారిటీల వివరాలు అందుబాటులో లేవు.

మొత్తం మీద పితృస్వామ్యపు విలువలు, ఆర్థిక దోపిడీ, కులపరమైన అణచివేత ప్రభుత్వం చూపే వివక్ష - అన్నీ కలిపి దళిత మహిళల పరిస్థితిని ఇంకా దిగజార్చుతున్నాయి.

ఏం చెయ్యాలి:

సమస్యలు చెప్పుకుంటూ పోతే ఆంజనేయుడి తోకలాగా వస్తూనే ఉంటాయి. అయితే మన ముందున్న కర్తవ్యం ఏమిటి?

ఈనాడు మహిళా ఉద్యమంతోపాటు రైతు, వ్యవసాయ కూలీ, ఉద్యోగ-కార్మిక సంఘాల ఆధ్వర్యంలో ఆర్థిక హక్కుల కోసం జరిగే వర్గ ఉద్యమాలు, కుల అణిచివేతకు, ప్రాంతీయ అసమానతలకు వ్యతిరేకంగాను, మైనారిటీల హక్కుల కోసమూ అనేక ఉద్యమాలు సాగుతున్నాయి. ఏ ఉద్యమ ప్రయోజనమైనా ఆయా తరగతుల పురుషుల కోసం మాత్రమే కారాదు. స్త్రీ పురుషులందరి ప్రయోజనం కోసం. నిచ్చెనమెట్ల వ్యవస్థలో చివరి మెట్టు నున్న స్త్రీల అభ్యున్నతి ఉద్యమ లక్ష్యాల్లో అంతర్భాగంగా ఉండాలి.

(తరువాయి48 పేజీలో)

# మహిళల ఆరోగ్య హక్కులు

## (ఐద్వా 8వ జాతీయ మహాసభలలో ప్రవేశపెట్టిన కమిషన్ పేపర్)

**ఒ**కవ్యక్తి శారీరకంగా మానసికంగా పూర్తి స్థాయిలో ఆరోగ్యంగా వుండి సరైన సాంఘిక జీవనం గడపడాన్నే ఆరోగ్యంగా పరిగణిస్తాము. కాని మందులు, ఇంజెక్షన్‌లు, వైద్యం ద్వారా జబ్బుల బారినుండి బయటపడడాన్ని ఆరోగ్యంగా పరిగణించలేము. కనుక ఆరోగ్యం అనేది మానవుని ప్రాథమిక హక్కుగా పరిగణించాలి. సంపూర్ణ ఆరోగ్యం సాధించాలంటే మనిషి ఆందోళన, వత్తిడిలకు గురికాకుండా వుండాలి. మరియు కనీస అవసరాలైన ఆహారం, వసతి, నీరు, పారిశుద్యం, ఉపాధి, విద్య, ఆరోగ్య సంరక్షణ మొదలైనవి సంతృప్తికరంగా పొందగలగాలి. ఇవన్నీ ఎటువంటి వివక్షతా లేకుండా అందరికీ అందాలంటే సాంఘికపరమైన బాధ్యత వుంది కనుక ప్రభుత్వ బడ్జెట్‌లో ప్రధాన భాగం ఆరోగ్య రంగానికి కేటాయించాలి. 1979లో ప్రాథమిక ఆరోగ్య పరిరక్షణపై 'అల్మా అటా'లో జరిగిన అంతర్జాతీయ మహాసభలో భారత దేశంతో సహా వివిధ దేశాలు పాల్గొని అందరికీ ఆరోగ్యం సాధించడానికి అవసరమైన విధానాలను రూపొందించుకోవాలని తీర్మానించాయి. కాని ప్రాథమిక ఆరోగ్య పరిరక్షణ సాధనకై తీసుకున్న నిర్ణయాలు మరియు దానికోసం చేపట్టాల్సిన చర్యలు తరువాత కాలంలో నీరుగార్చబడ్డాయి.




### భారతదేశంలో మహిళల అనారోగ్య పరిస్థితులు

భారత దేశంలో మహిళల పట్ల చూపుతున్న వివక్షత ప్రభావం వారి ఆరోగ్యంపై పడుతుంది. కుటుంబంలో మహిళలకు సంబంధించిన విద్య, వైద్యం, ఉద్యోగం, వివాహ వయస్సు మరియు పిల్లలు ఎంతమంది ఉండాలనే నిర్ణయాలు లాంటివన్నీ కుటుంబ యజమానులకే ఉంటాయి. కొడుకులకు ప్రాధాన్యత ఇవ్వడం ఒక ఆచారంగా కొనసాగుతుండడంతో ఆడపిల్లలు నిర్లక్ష్యానికి గురవుతున్నారు.

మహిళలు, పురుషుల మధ్య బలంగా వున్న పనివిభజన, తల్లిగా, కుటుంబ సంరక్షకురాలిగా మహిళపై ఆచారపరంగా పెట్టబడిన బాధ్యతలు కలిసి మహిళకు గంటల తరబడి పనిచేయాల్సిన పరిస్థితిని, పలురకాల పనిభారాన్ని మోయాల్సిన పరిస్థితిని తెచ్చిపెట్టాయి. ఇదంతా మహిళల ఆరోగ్యంపై ప్రభావం చూపుతుంది.

### ఆహారం

రోజు రోజుకూ ఉపాధి దొరకని పరిస్థితులు పెరుగుతుండడంతో స్త్రీలు, బాలికలు ఆహారం విషయంలో మరింత వివక్షతకు, నిర్లక్ష్యానికి గురవుతున్నారు. స్త్రీలు వ్యవసాయదారులుగా ఉన్నారు. ఆహార ఉత్పత్తిలో వున్నారు. ఆహారం తయారు చేస్తున్నారు. కుటుంబ ఆహార అవసరాలన్నీ బాధ్యతగా చూస్తున్నారు. కాని తమ స్వంత ఆహార అవసరాలను మాత్రం తీర్చుకోలేని పరిస్థితిలో వున్నారు. దేశంలోని వివాహిత స్త్రీలలో మూడవవంతు స్త్రీలు దీర్ఘకాలంగా పౌష్టికాహార లోపంతో బలహీనంగా ఉంటున్నారని జాతీయ కుటుంబ ఆరోగ్యంపై 2005సం॥లో నిర్వహించిన తాజా సర్వేలో బయటపడింది.



ఎక్కువ పని చేసే వయస్సు మరియు సంతానోత్పత్తి దశ అయిన 15 నుండి 49సం॥ల మధ్య వయస్కులైన వివాహిత మహిళల్లో 1998లో 52 శాతం మంది స్త్రీలు రక్తహీనతతో వుండగా అది తాజా సర్వేలో 56 శాతానికి పెరిగింది. గ్రామీణ ప్రాంతాల మహిళల్లో ఎక్కువ మందిలో ఈ రక్తహీనత వుంది. కాగా అదే వయసులో వున్న పురుషులలో రక్త హీనత 28 శాతం మందిలో మాత్రమే ఉంది. భారత దేశంలో ప్రసవ మరణాలకు మహిళల రక్తహీనతే రెండవ అతిపెద్ద కారణంగా వుంది. పురుషులకంటే ఎక్కువ పనిగంటలు రకకరాల పనులుచేస్తూ వుండే మహిళలు ముఖ్యంగా పేదలు, కూలి పనిచేసే మహిళలు తమ ఆహార అవసరాలను ఎంత మాత్రం తీర్చుకోలేని పరిస్థితిలో వున్నారు. దారిద్ర్యం, బాల్య వివాహాలు, సంతానోత్పత్తి, కుటుంబ సంరక్షురాలిగా మహిళలు ముందుగా అందరికీ పెట్టి ఆఖరుకు భోజనం చేయటం, పురుషుల పని కష్టతరమనే సామాజిక అపోహ మొదలైన రకరకాల

అంశాలతో మహిళలు దీర్ఘకాలంగా పౌష్టికాహార లోపంతో బాధ పడుతున్నారు. బాల్య దశలో మొదలైన పౌష్టికారలేమి మహిళల ఆరోగ్యాన్ని మరింత దెబ్బతీస్తుంది. 1998 జాతీయ సర్వే ప్రకారం బాలురకంటే బాలికలు తక్కువ బరువుతో వుంటున్నారనీ, వయస్సుకు తగిన విధంగా పెరగడం లేదని తేలింది. పసితనంలో చాల తక్కువ కాలం తల్లిపాలు ఇవ్వడం, బలవర్ధక ఆహారం ఇవ్వకపోవడం, ఆరోగ్య సంరక్షణపై శ్రద్ధ చూపకపోవడం లాంటివి తగిన వనరులు లేని పేదల్లో ఇంకా తీవ్రంగా వున్నాయి.

6 నెలల నుండి 3సం॥లలోపు పిల్లల్లో 98సం॥ జాతీయ సర్వే ప్రకారం 74 శాతంగావున్న రక్తహీనత 2005 సర్వే ప్రకారం 79శాతానికి పెరగడం తీవ్రంగా పరిగణించాల్సిన విషయం.

## లింగనిష్పత్తి

ప్రకృతి పరంగా వున్న అవకాశం బట్టి పుట్టుకలో మగ శిశువుల కంటే ఆడశిశువులకే బ్రతికే అవకాశాలు మెండుగా వున్నాయి. చాలా దేశాలలో పురుషుల కంటే స్త్రీలే ఎక్కువ కాలం జీవిస్తున్నారు. కాని భారతదేశంలో ఆడశిశువులు బ్రతకడమే కష్టతరమవుతుంది. 1991లో 6సం॥లోపు వున్న పిల్లలలో ప్రతి వెయ్యి మందికి 945గా వున్న ఆడపిల్లల సంఖ్య 2001వ సంవత్సరానికి 927కు పడిపోయింది. 2005వసం॥ సర్వేలో ఈసంఖ్య మరింత పడిపోయి 918కి చేరింది. కొంతమంది డాక్టర్లు సాంకేతిక పరిజ్ఞానాన్ని దుర్వినియోగం చేసి లింగనిర్ధారణ పరీక్షలు చేస్తుండడంతో ఆడపిల్లలను గర్భంలోనే తొలగించుకుంటున్నారు. మహిళలపట్ల, ఆడపిల్లల పట్ల ఈ విధమైన వివక్షత, నిర్లక్ష్యాలు మహిళల అనారోగ్యానికి దారితీస్తున్నాయి.

## అంటురోగాల వ్యాప్తికి అవకాశాలు

సులభంగా నయం చేయగలిగిన వ్యాధులైన శ్వాస సంబంధ వ్యాధులు, టి.బి., అతిసార, మలేరియా, తట్టు, పొంగు మొదలైన వ్యాధులే బాలికల మరియు మహిళల అనారోగ్యానికి, మరణానికి ప్రధాన కారణాలుగా వుంటున్నాయి. మలేరియా, ప్లేగ్, డెంగ్యు, టైఫాయిడ్, చికున్‌గున్యా లాంటి జ్వరాలు, అంటువ్యాధులు ప్రబలుతున్నాయి. రక్తహీనత మరియు ప్రసవ సంబంధమైన సమస్యల వలన శిశుదశ నుండి 25సం॥ల లోపు బాలికల, మహిళలలో మరణాల సంఖ్య అధికంగా వుంటుంది. రక్తహీనత మరియు అంటువ్యాధులు గర్భధారణ మరియు పునరుత్పత్తికి సంబంధించిన అనారోగ్యాలకు దారితీస్తాయి. ఎయిడ్స్ వ్యాధి పెరుగుతుండడంతో చాలామంది వివాహితులైన యువతులకు భర్తల ద్వారా సంక్రమిస్తున్న ఈ వ్యాధి చాలా ప్రమాదకరంగా పరిణమిస్తుంది. మహిళలకు దీనికి సంబంధించిన పరిజ్ఞానం లేదు. ముందు జాగ్రత్తలు తీసుకోవడంలో అశక్తులుగా వుండడమే కాక పురుషుల కంటే ఎక్కువగా నిర్లక్ష్యానికి, వెలివేతకు గురవుతున్నారు. ఎయిడ్స్ వ్యాధి నివారణకై ఇతర అన్ని వ్యాధుల కంటే ఎక్కువ వ్యయం వెచ్చించినా వైద్య సేవల విషయంలో తక్కువ ప్రాధాన్యత ఇస్తున్నారు.

## గర్భధారణ, ప్రసవం మరియు గర్భ స్రావంలోని సమస్యలు

ప్రతి లక్షమందిలో 400నుండి 500 మంది మహిళలు ప్రసవ సంబంధమైన కారణాలతో మరణిస్తున్నారు. ప్రసూతి మరణాలు అధికంగా వున్న దేశాలలో భారతదేశం 2వ స్థానంలో వుంది. బాల్యంలో నిర్లక్ష్యానికి గురవడం వలన గర్భధారణ సమయంలో అనారోగ్యానికి, ముఖ్యంగా రక్తహీనతకు దారితీస్తుంది. సాధారణ ఆరోగ్య సేవల లోపం వలన అధిక రక్తస్రావం జరిగి మరణాలు సంభవించడం మరొక ప్రధాన కారణంగావుంది.

1998-2005 మధ్య కాలంలో 51 శాతం గర్భిణీ స్త్రీలు మాత్రమే ప్రసవానికి ముందు కనీసంగా 3 సార్లు డాక్టరుతో పరీక్ష చేయించుకున్నారు. 22శాతం మంది మాత్రమే 90 రోజులూ పూర్తిగా బలానికి తోడ్పడే విటమిన్ టాబ్లెట్లు వాడారు. ప్రసవించిన తరువాత 2 రోజుల లోపు 36 శాతం మంది మాత్రమే వైద్య పరీక్ష చేయించుకుంటున్నారు. గ్రామీణ మహిళల పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంది. 48 శాతం ప్రసవాలు మాత్రమే శిక్షణ పొందిన సిబ్బంది ద్వారా జరుగుతున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో ఇది 39 శాతం మాత్రమే. 44శాతం మంది పిల్లలు మాత్రమే టీకా మందులు పొందుతున్నారనేది చాలా విచారించాల్సిన విషయం.

సాధారణంగా వున్న మహిళల బలహీనత మరియు వైద్య సౌకర్యాల లేమి వలన సగటున ఒక ప్రసవమరణం సంభవించితే మరో 30 మంది మహిళలు ప్రసవ సంబంధమైన దీర్ఘకాల వ్యాధులతో ఇబ్బంది పడుతున్నారు. పెద్ద ఆసుపత్రులలో మినహా ప్రభుత్వ ఆరోగ్య సెంటర్లలో మహిళలకు వచ్చే పునరుత్పత్తి నాళాల జబ్బులుకాని, లైంగిక సంపర్కం వలన వచ్చే వ్యాధులను కానీ నయం చేయడానికి కావలసిన వైద్య సౌకర్యాలు లేవు. ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాల్లో సంతాన లేమికి చికిత్సా సౌకర్యాలు అరకొరగానే వున్నాయి. చట్టబద్ధమైన గర్భస్రావాలు సురక్షితంగా, ఉచితంగా చేయించుకోవడానికి తగిన విధమైన సౌకర్యాలు అందుబాటులో లేవు. ప్రభుత్వాసుపత్రులలో గర్భస్రావాలను గోప్యంగా ఉంచకపోవడం, భర్త అనుమతికావాలని బలవంత పెట్టడం మరియు గర్భ నిరోధ మాత్రలు వాడాలనే నిబంధనలు పెట్టడం లాంటివి చేస్తున్నారు. కనుక మహిళలు ఇలాంటి సాంఘిక కట్టుబాట్ల నుండి తప్పించుకునేందుకు ప్రైవేటు ఆసుపత్రులకు వెళుతున్నారు.

## పనిభారం మరియు అనారోగ్యం

మహిళల అనారోగ్యం వారి పనిని బట్టీ, వారి నివాస పరిసరాలను బట్టీ వుంటుంది. అంటువ్యాధులు, రక్తహీనత మరియు ఆరోగ్య సౌకర్యాల లేమి, పెరుగుతున్న పనిభారం, ఆరోగ్య జాగ్రత్తలు తీసుకోకపోవడం, విశ్రాంతి లేకపోవడం మొదలైన అంశాలు మహిళల, ముఖ్యంగా పేద వర్గాల మహిళల ఆరోగ్యాన్ని తీవ్రంగా కృంగదీస్తున్నాయి. మహిళలు ఆరోగ్య సమస్యలు వచ్చిన వెంటనే తగిన వైద్యం పొందకపోవడం వలన దీర్ఘకాలంలో మరింత బలహీనపడడం జరుగుతుంది.

హైదరాబాదులో అంఘటిత రంగంలోపనిచేస్తూ మురికివాడలలో నివసిస్తున్న మహిళలలో సర్వే చేయగా వారు జ్వరం, శ్వాస సంబంధ వ్యాధులు మరియు కడుపునొప్పి లాంటి తీవ్రమైన అనారోగ్యం వచ్చి కదలలేని పరిస్థితిలో వున్నపుడు మాత్రమే వైద్యచికిత్సకు వెళతారనీ, స్త్రీలకు సంబంధించిన వ్యాధులకు గాని, సాధారణ అనారోగ్యాలకు బలహీనతలకు కానీ, గర్భిణీకి సంబంధించిన సమస్యలకుగానీ వైద్య

చికిత్సకు వెళ్లడం లేదని తెలిసింది. కార్మిక చట్టాలుకానీ, సాంఘిక భద్రత కాని లేకపోవడం వలన అసంఘటిత రంగంలోని మహిళలు అతితక్కువ వేతనాలు పొందుతున్నారు. వారికి వృత్తి పరంగావచ్చే వ్యాధులను పట్టించుకోవడంలేదు. వారికొచ్చే అతి తక్కువ వేతనాలు మంచి ఆహారం పొందదానికి కాని, కుటుంబానికి సహాయ పడదానికి కాని, ఖరీదైన వైద్య సదుపాయం పొందదానికి కాని ఏమాత్రం సరిపోవడం లేదు. బాలింత మహిళలు అనారోగ్యంగా వున్నా కూడా పిల్లలకు పాలివ్వడం, ఇంటిపని చేయడం తప్పనిసరిగా వుంది. అనారోగ్య పరిస్థితి మరీ తీవ్ర రూపు దాల్చినపుడు వారు పనిచేసి సంపాదించడం మానేయాల్సి వస్తుంది.

## కుటుంబ నియంత్రణ కార్యక్రమ లక్ష్యాలు

కుటుంబ నియంత్రణ కార్యక్రమంలో మహిళలనే ప్రధాన లక్ష్యంగా ఎంచుకోవడం జరుగుతుంది. సంతాన నిరోధానికి సంబంధించిన జాగ్రత్తలు మహిళల్లో **50** శాతం వుంది తీసుకుంటుండగా పురుషుల్లో **6**శాతంవుంది మాత్రవే తీసుకుంటున్నారు. శాశ్వత కుటుంబ నియంత్రణే ప్రధానంగావుంది కనుక మహిళల్లో **26**సం॥లకే ఈ పద్ధతులు అవలంభిస్తున్నారు. గర్భనిరోధానికి సురక్షితమైన, శక్తివంతమైన పద్ధతులు అందుబాటులో లేవు.

ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలనిర్వహణ సరిగా లేకపోవడం, గ్రామీణ ప్రాంతాల్లో ఆపరేషన్లపై అవగాహన కల్పించకపోవడం, సరైన అజమాయిషీ లేకపోవడం, వైద్య పరీక్షలు దాని కొనసాగింపు సేవలు లేకపోవడం వలన కుటుంబనియంత్రణా పద్ధతులు మహిళల్లో తీవ్ర అనారోగ్యానికి, దీర్ఘకాల నడుమునొప్పులకు వివిధ జబ్బులకు దారితీస్తున్నాయి. మహిళా సంఘాలు తీవ్రంగా వ్యతిరేకించడం వలన ఇంజెక్షన్లు వాడకం, కుటుంబ నియంత్రణా పరికరాలను శరీరంలోపల ప్రవేశపెట్టే పద్ధతులు లాంటివాటిని జాతీయ కుటుంబ నియంత్రణ కార్యక్రమం నుండి మినహాయించారు. కాని సరళీకరణ విధానాలు జనాభా నియంత్రణా కార్యక్రమంలో కూడా ప్రవేశించడంతో ప్రైవేటు ఆసుపత్రులలో ఇంజెక్షన్లను, అత్యవసర మాత్రలను ప్రోత్సహిస్తున్నారు. మహిళానుకూల విధానాల పేరుతో **1997**లో ప్రవేశపెట్టబడిన విధానాలను (ఆర్‌సిహెచ్) పరిశీలిస్తే చాలా రాష్ట్ర ప్రభుత్వాలు తమకనుకూలమైన జనాభా నియంత్రణ విధానాలను అవలంభిస్తున్నాయి. ఇద్దరు పిల్లలు మాత్రమే ఉండాలనే నిబంధన విధించాయి. అంతకంటే ఎక్కువమంది పిల్లలున్న ప్రజలను ప్రజాపంపిణీ వ్యవస్థకు, దారిద్ర్య నిర్మూలన కోసం ప్రవేశపెట్టే పథకాలకు దూరంగా వుంచాయి. మహిళలకు ప్రభుత్వ ఆసుపత్రులలో ఉచిత ప్రసూతి సౌకర్యం కలగచేయడం లేదు మరియు స్థానిక సంస్థలలో రాజకీయ ప్రవేశానికి కూడా అనుమతించడం లేదు.

## హింస

శారీరక, మానసిక గృహ హింస ఆరోగ్యంపై ప్రభావం తీవ్రంగా వుంటుంది. సాంఘిక కట్టుబాట్ల భయం వలన మరియు సున్నిత సమస్యల చికిత్సకు తగిన దాక్టర్లు అందుబాటులో లేకపోవడం వలన మహిళలు తమపట్ల జరుగుతున్న హింసను దాచిపెట్టి గాయాలతో దీర్ఘకాలం బాధపడుతూ మానసిక ఆందోళనలకు గురవుతున్నారు.



అనారోగ్య కారణాల కంటే కాలిన గాయాలతోనే ఎక్కువమంది భారతీయ మహిళలు మరణిస్తున్నారు. గర్భిణిగా వున్న కాలంలో హింసకు గురవడంవల్లనే ఎక్కువ సంఖ్యలో గర్భస్రావాలు జరుగుతున్నాయి.

## నూతన సరళీకరణ విధానాల ప్రభావం

నూతన సరళీకరణ ఆర్థిక విధానాలు మహిళల ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం చూపుతున్నాయి. ప్రపంచీకరణ విధానాల వలన మహిళలపట్ల కొనసాగుతున్న వివక్షత ఇంకా తీవ్రతరమయింది. ఈ విధానాల వలన వ్యవసాయ రంగంలో మహిళల ఉపాధి దెబ్బతింది. వేతనం లేని పనికి వారు నెట్టబడ్డారు. అభివృద్ధి చెందుతున్న పెద్ద నగరాలకు వలసలు వెళ్ళి అక్కడ అసంఘటిత రంగంలో అతి కష్టమైన పనులు చేస్తూ అతి తక్కువ వేతనాలతో పనిచేయాల్సివస్తుంది. అతి తక్కువ వేతనాలతో ఏమాత్రం రక్షణా, భద్రతాలేని పనులు చేస్తూనే మహిళలు తమ ప్రధాన బాధ్యత అయిన ఇంటి పనిలో గంటల తరబడి శ్రమిస్తున్నారు. ఇరుకైన, కిక్కిరిసిన గుడిసెలలో పారిశుద్ద్యం, మంచినీరు, మరుగుదొడ్లు, కరెంటు మొదలైన సౌకర్యాలు ఏమీ లేకుండా కాలం గడుపుతున్నారు. గాలి, వెలుతురు లేని చిన్న చిన్న కిక్కిరిసిన ఇళ్ళలోనే గృహాధార పరిశ్రమల పనిని కూడా చేస్తున్నారు. మహిళలకు మరుగుదొడ్ల సౌకర్యాలు లేకపోవడంతో వారు మూత్ర సంబంధ వ్యాధులకు మలబద్దక సమస్యలకు, పునరుత్పత్తికి సంబంధించిన జబ్బులకు తరచుగా గురవుతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో మహిళలకు మరుగుదొడ్ల సౌకర్యాలు లేకపోగా అడవుల నరికివేత మరియు గ్రామీణ భూముల ప్రైవేటీకరణ వలన వారు జబ్బులకే కాక హింసకు కూడ గురవుతున్నారు. దూర ప్రాంతాల నుండి నీరు, కట్టెలు మోసుకొని రావడం కట్టెల పొయ్యిలపై వంట చేయడంతో పొగవల్ల ఏర్పడే కాలుష్యంతో మహిళల ఆరోగ్యం మరింత దెబ్బతింటుంది.

## ఆరోగ్య రంగంలో విధానాలు

ప్రాథమిక ఆరోగ్య సంరక్షణ విధానం ప్రజల ఆరోగ్య అవసరాలను తీర్చేదిగా ప్రజలందరికీ సంపూర్ణ ఆరోగ్యం కల్పించేదిగా వుండాలి.

## ప్రధాన అంశాలు

ప్రజల సమగ్ర ఆరోగ్య రక్షణకు ఆయా తెగలలోని ప్రధాన ఆరోగ్య సమస్యలను తెలుసుకొని తగిన ముందు జాగ్రత్త చర్యలను, చికిత్సా విధానాలను, సహాయక చర్యలను అందించాలి.

జాతీయ ఆరోగ్య పరిరక్షణ విధానం ద్వారా ప్రజలందరికీ ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల ప్రజలకు విస్తృత సేవలందించాలి.

ఆరోగ్య రక్షణలో ప్రజల భాగస్వామ్యం మరియు అజమాయిషీ వుండాలి.

సంపూర్ణ ఆరోగ్యానికి కావలసిన ప్రాథమిక అవసరాలైన ఆహారం, నీరు, పారిశుధ్యం, వసతి, సరైన ఉపాధి మరియు సాంఘిక భద్రత మొదలైన అంశాలకు, వైద్య చికిత్సా విధానాలకు అనుసంధానం వుండాలి.

ఒక వ్యక్తి కొనుగోలు శక్తిపై ఆధారపడి ప్రభుత్వ సేవలు ఉండరాదని "భోర్ కమిటీ" ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలపై ఇచ్చిన నివేదికలో తెలిపింది.

భారత ప్రభుత్వం సరళీకరణ ఆర్థిక విధానాలు చేపట్టినప్పటి నుండి తన విధానాలను మార్చుకుంది. ఆహారం, గ్రామీణాభివృద్ధి, ప్రజారోగ్యం, విద్య, ప్రాథమిక సర్వీసుల నుండి ప్రభుత్వ వ్యయాన్ని గణనీయంగా తగ్గించింది. ప్రైవేటు రంగాన్ని పెద్ద ఎత్తున ప్రోత్సహించింది. వ్యవస్థీకృత సర్దుబాట్ల పేరుతో ప్రపంచ బ్యాంకు ప్రభుత్వ ఆరోగ్య సేవలపై అనేక ఆంక్షలు విధించింది. జాతీయ ప్రాధాన్యతగా గుర్తించిన కొన్ని అంశాలకే ప్రభుత్వ రంగం పరిమితమవ్వాలని పేదలకు ఉచిత సేవలు అందించాల్సిన అవసరం ప్రభుత్వానికి లేదనీ వైద్య రంగాన్ని ప్రైవేటు,కార్పొరేటు రంగాలకు వదిలివేయాలని చెప్పింది.

ప్రజలు ముఖ్యంగా విస్తారంగా వున్న గ్రామీణ ప్రాంతాల ప్రజల అవసరాలను ప్రభుత్వ ఆరోగ్య రంగం ఏమాత్రం తీర్చలేని పరిస్థితిలో వుంది. ఆరోగ్యం, కుటుంబ సంక్షేమంపై కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు 5శాతం నిధులు ఖర్చు చేయాల్సి వుండగా 1.2శాతం మాత్రమే ఖర్చు పెడుతున్నాయి. ప్రభుత్వ సేవలు అంతకంతకూ కుదించబడుతున్నాయి. మహిళల ఆరోగ్యం పిల్లల ఆహార అవసరాలకు జనాభా నియంత్రణకు ముడిపెట్టబడివుంది. సంస్కరణల ముసుగులో ప్రభుత్వం తన వ్యయాన్ని 0.9శాతానికి కుదించివేసింది. దీనితో విస్తారమైన ప్రజానీకం అధిక వ్యయంతో కూడుకొన్న ప్రైవేటు రంగంపై ఆధారపడాల్సి వస్తుంది. 2000సం॥లో రూపొందించబడిన జాతీయ ఆరోగ్య విధానం ప్రభుత్వ రంగాన్ని మరింత ప్రైవేటీకరించే విధంగా ప్రభుత్వ రంగంలో యూజర్ ఛార్జీలను ప్రవేశపెట్టింది. ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యం పేరుతో ప్రభుత్వ రంగ సదుపాయాలను ప్రైవేటు రంగానికి అప్పగించింది. ఆరోగ్య పరిరక్షణ సేవలు 90వ దశకంలో వ్యవస్థీకృత సర్దుబాట్ల పేరుతో ప్రభుత్వ వైద్య రంగాన్ని నిర్వీర్యం చేయడమే మహిళల పిల్లల ఆరోగ్యం క్షీణించడానికి ప్రధాన కారణంగా వుంది. ఆర్థిక సంస్కరణల తరువాత ఆరోగ్య రంగ ప్రైవేటీకరణ అతివేగంగా పెరిగింది. ప్రజలు తమ స్వంత ఆదాయాల నుండి 75 శాతం ఆరోగ్యంపై ఖర్చు పెడుతుండగా ప్రభుత్వ ఆదాయం నుండి 22శాతం మాత్రమే ఆరోగ్య రంగానికి వెచ్చిస్తున్నారు. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో దీనికి భిన్నంగా 75శాతం ఆరోగ్య ఖర్చులు ప్రభుత్వ రంగం నుండి పెడుతున్నారు. అమెరికా లాంటి దేశాలలో కూడా 44 శాతం ఆరోగ్య ఖర్చులు ప్రభుత్వ రంగం నుండి పెడుతున్నారు. వెనుకబడిన రాష్ట్రాలలో మరియు గ్రామీణ ప్రాంతాలలో సైతం ప్రైవేటు రంగాన్ని వినియోగించుకోవడం బాగా పెరిగింది. 50 నుండి 57శాతం మంది ఆసుపత్రులలో చేరే వారు మరియు 80 శాతం సాధారణ వైద్య చికిత్స కోసం వెళ్ళేవారు ప్రైవేటు డాక్టర్ల వద్దకే వెళుతున్నారు.

అతి తక్కువ వేతనాలతో బ్రతుకుతున్న విస్తారమైన ప్రజానీకం తమ ఆదాయం నుండి 60శాతం ఆహారానికి ఖర్చు పెట్టాల్సి వస్తుంది. దీనికి తోడు ప్రైవేటు వైద్య రంగంలో పెరుగుతున్న వైద్యం ఖరీదు ప్రజల ఆరోగ్యాన్ని ఇంకా దెబ్బతీస్తూ వారిని మరింత పేదరికంలోకి నెడుతుంది. గ్రామీణ కుటుంబాలు అప్పులబారిన పడడానికి ఇది రెండవ అతిపెద్ద కారణంగా ఉంది. అట్టడుగు వర్గాలైన దళితులు, ఆదివాసీలు మరియు మహిళల ఆరోగ్యంపై ఇది తీవ్ర ప్రభావం చూపుతుంది.

(ఆరు రాష్ట్రాలలో మహారాష్ట్ర, కర్ణాటక, హిమాచల్‌ప్రదేశ్, పశ్చిమబెంగాల్, తమిళనాడు, ఉత్తరప్రదేశ్‌లలో ఒక సర్వే చేయగా 2002-2005 సం॥ల మధ్య 16శాతం ప్రజలు దారిద్ర్య రేఖ దిగువకు నెట్టబడ్డారని తెలిసింది. 12శాతం ప్రజలు ఆరోగ్యంపై పెట్టిన ఖర్చు కోసం ఆస్తులు అమ్ముకున్నారనీ 43 శాతం ప్రజలు వైద్య ఖర్చుల కోసం అప్పులు చేశారనీ తెలిసింది.)

## గ్రామీణ వైద్య సేవలు

3రకాల గ్రామీణ ఆర్థిక సేవలను ప్రణాళికాబద్ధంగా మెరుగుపరచాలనే నిబంధనలు ఉన్నా (సబ్ సెంటర్లు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, గ్రామీణ ఆసుపత్రులు) ఈమూడు కనీస సేవలు కూడా ప్రతిభావంతంగా పనిచేయలేకపోతున్నాయి. పేద రాష్ట్రాలలో మరియు సుదూర గిరిజన ప్రాంతాలలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో మరియు కమ్యూనిటీ హెల్త్ సెంటర్ల వ్యవస్థల్లో అనేక లోపాలున్నాయి. వీటిలో తగినంత మంది డాక్టర్లు కాని వైద్య సిబ్బంది కాని వుండడం లేదు. కమ్యూనిటీ ఆరోగ్య కేంద్రాల్లో తగినంతమంది స్పెషలిస్టులు కాని, కావలసిన పరికరాలు కాని మందులు కాని అందుబాటులో వుండడం లేదు.

దేశ వ్యాప్తంగా అదనంగా 20,903 సబ్‌సెంటర్ల, 4803 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 2653 కమ్యూనిటీ హెల్త్ సెంటర్ల అవసరం వుంది. 21శాతం డాక్టరు పోస్టులు ఖాళీగా ఉన్నాయి. 39శాతం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో ల్యాబ్ టెక్నీషియన్లు లేరు. 18శాతం కేంద్రాల్లో ఫార్మసిస్టులు లేరు. కమ్యూనిటీ హెల్త్ సెంటర్లలో 54 శాతం పోస్టులు ఖాళీగా ఉన్నాయి. సబ్‌సెంటర్లు మరియు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు కొన్ని ఎంపిక చేసుకొన్న అంశాలపైనే దృష్టి పెడుతున్నాయి. అంతర్జాతీయ సంస్థలు, ప్రపంచ బ్యాంకు మరియు నిధులతోసంబంధమున్న ఏజన్సీల ఆదేశాలకనుగుణంగా ప్రాథమిక ఆరోగ్యం కొన్ని అంశాలకే పరిమితమవడంతో ప్రభుత్వం పెట్టే ఖర్చు తగ్గి ప్రజలు ప్రైవేటు ఆసుపత్రులకు వెళ్ళాల్సివస్తుంది. మహిళలు




పిల్లలకు సంబంధించి జనాభా నియంత్రణ, సుఖ ప్రసవం, శిశు సంరక్షణ లాంటి లక్ష్యాలను పెట్టుకున్నారు. పిల్లలకు ముఖ్యంగా ఒఆర్ఎస్ మరియు టీకాలు ఇవ్వాలని లక్ష్యం వుంది. సాధారణ ప్రజానీకానికి అంటువ్యాధుల నివారణ లక్ష్యంగా ఉంది. ఈ పరిమితమైన సౌకర్యాలలో కూడ మహిళల ఆరోగ్య అవసరాలకు సంబంధించిన అంశాలు లేవు. రక్తహీనత, గుర్రపు వాతం లాంటి జబ్బులకు వైద్య సేవలందించగలుగుతున్నారు కాని ఎక్కువ ప్రమాదకరమైన జబ్బులకు దాక్టర్లు లేకపోవడం వలన వైద్యం అందడంలేదు. ప్రభుత్వ ఆసుపత్రులలో దాక్టర్ల కొరత వలన మొత్తం భారం పారామెడికల్ సిబ్బందిపైన పడుతుంది.

(ఆంధ్ర ప్రదేశ్‌లో ఐద్వా నిర్వహించిన సర్వేలో ప్రజలు ప్రైవేటు ఆస్పత్రులలోని అధిక ఫీజులను తట్టుకోలేక ప్రభుత్వ ఆస్పత్రులకు వస్తున్నారని తెలిసింది. కాని ప్రభుత్వ ఆస్పత్రులలోని సౌకర్యాలపట్ల, సిబ్బంది పట్ల అసంతృప్తితోవున్నారు. ప్రభుత్వ ఆసుపత్రిలో మూడురోజులు అడ్మిట్ అయి ఉండాల్సివస్తే 600రూ॥ చెల్లించాల్సి వస్తుంది. చాలా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో నర్సులు కాని ల్యాబ్ టెక్నీషియన్లుకాని వుండడం లేదు. అంబులెన్సులు ఉన్నా డ్రైవర్లను నియమించడం లేదు. వసతి సౌకర్యం లేకపోవడంతో ఏ ఒక్క మెడికల్ ఆఫీసరు కూడా తానుపని చేస్తున్న గ్రామంలో నివసించడంలేదు. సిబ్బందికి క్వార్టర్లు లేవు. పెద్ద పెద్ద అసుపత్రులలో కూడా పాము కాటుకు కాని కుక్క కాటుకు కాని కావలసిన కనీస మందులు కూడా అందుబాటులోవుండడం లేదు. రాష్ట్రంలో 30శాతం దాక్టరు పోస్టులు, 15నుండి 20శాతం నర్సుల పోస్టులు ఖాళీగా ఉన్నాయి. ప్రభుత్వం ప్రైవేటు రంగాల మిశ్రమ భాగస్వామ్యం పేరుతో ప్రభుత్వ నిధులను ప్రైవేటు రంగానికి మళ్ళీస్తున్నారు. 65శాతం పేద ప్రజలు వైద్య ఖర్చుల కోసం అప్పులు చేస్తున్నారు. రాష్ట్రంలో రైతుల ఆత్మహత్యలకు ఒక ప్రధాన కారణం వారు వైద్యం కోసం చేసిన అప్పులు తిరిగి చెల్లించలేకపోవడమే.)

**జాతీయ గ్రామీణ ఆరోగ్య కమీషన్:-** ఆరోగ్య సేవలలో పెరుగుతున్న సంక్షోభాన్ని నివారించడానికి కేంద్ర ప్రభుత్వం దీనిని ఏర్పాటు చేసింది. ఇది జాతీయంగా వివిధ రంగాల నివారణా కార్యక్రమాలను, కుటుంబ సంక్షేమ కార్యక్రమాలకు వివిధ రకాల ఆరోగ్య కార్యక్రమాలను సమన్వయం చేస్తుంది. అనారోగ్య సంకేతాలు ఎక్కువగా వున్న 18పేద రాష్ట్రాలలోని గ్రామీణ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల మెరుగుకోసం పనిచేస్తుంది. ఈ కమీషన్ పనిని అప్పుడే అంచనా వేయలేకపోయినా కొన్ని విషయాలు పరిశీలించాల్సివుంది.

1. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను, కమ్యూనిటీ హెల్త్ సెంటర్లను ప్రైవేటు వ్యక్తులకు కాంట్రాక్టుకు ఇచ్చి యూజర్ చార్జీల ద్వారా ఆదాయం పొందే స్వతంత్ర ప్రతిపత్తి గల వాటిగా ప్రభుత్వఅనువత్రులను తయారు చేయడానికి ఇది పూనుకుంటుంది. ఇది ప్రైవేటీకరణకు దారితీస్తుంది. యూజర్ చార్జీల వలన ప్రజల ఆరోగ్య రక్షణలో అసమానతలు ఏర్పడతాయి మరియు ప్రైవేటు అసుపత్రులలో ఫీజులను భరించలేని ప్రజలే ప్రభుత్వ ఆస్పత్రులకు వస్తున్నారు కనుక యూజర్ చార్జీలను వ్యతిరేకించాల్సి వుంది.

2. గ్రామీణ ప్రజలను ప్రభుత్వ ఆస్పత్రికి రప్పించే చర్యల కోసం 'ఆశ' పేరుతో ఒక ఆరోగ్య కార్యకర్తను నియమించే ప్రతిపాదన ఉంది. ఆమె పనికి సంబంధించిన బాధ్యతలు స్పష్టంగా లేని పక్షంలో ఆమె పై పలువిధాలుగా పని భారం పడే అవకాశం ఉంది. ఆమె జీతభత్యాలపై స్పష్టమైన వివరణలేదు. ఆమె సమాజం కోసం ఉచిత సేవ చేయాలా లేక ప్రసవాలు మరియు కుటుంబనియంత్రణ ఆపరేషన్ల సమయంలో పేద ప్రజల వద్ద నుండి వసూలు చేసుకునే దబ్బుపై ఆధారపడాలా అనేది స్పష్టంగా లేదు.

## ప్రణాళికాబద్ధ పట్టణ సర్వీసుల అవసరం

ప్రభుత్వ ఆసుపత్రులు, బోధనా కళాశాలలు, ఆరోగ్య కేంద్రాలు అన్నీ పెద్ద పెద్ద పట్టణాలలోనే కేంద్రీకరించబడ్డాయి. గ్రామీణ పేదలు పెద్దయెత్తున వలసలు రావడంతో పట్టణాలు వేగంగా పెరుగుతున్నాయి. దీనితో పెద్ద ఆసుపత్రులపై భారం పడుతున్నాయని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను అభివృద్ధి చేయదానికి పూనుకోవడం లేదు. కొన్ని నగరాలలో వున్న ఆరోగ్య కార్యకర్తల ద్వారా టీకాలు వేయించడం మరియు జనాభా నియంత్రణ కార్యక్రమాలు ప్రధానంగా చేపడుతున్నారు. మెరుగైన వైద్యాన్ని ప్రజలందరికీ అందుబాటులో ఉంచగల ప్రభుత్వ ఆసుపత్రులలో కూడా అవసరమైన బడ్జెట్‌లు పెంచకుండా ఆపివేయడం వలన అక్కడి నిష్ణాతులైన వైద్య సిబ్బంది ప్రైవేటు కార్పొరేటు రంగంలోని బోధనా ఆసుపత్రులలోకి తరలిపోతున్నారు. దీనితో ప్రభుత్వ ఆసుపత్రుల స్థాయి మరింత దిగజారుతుంది.

## ప్రైవేటు మెడికల్ సర్వీసుల కుదింపు మరియు నియంత్రణ

ప్రభుత్వం ప్రైవేటు రంగం యొక్క అపరిమిత పెరుగుదలపై నియంత్రణ ఎత్తివేయడం మరియు ప్రభుత్వ ప్రైవేటు రంగాల భాగస్వామ్యం పేరుతో ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహించడంతో ఆరోగ్య సేవలు అందుబాటులో లేకుండా పోతున్నాయి. దీనివలన పెద్ద పెద్ద నగరాలు, పట్టణాలలో మాత్రమే సాంకేతిక పరిజ్ఞానం మరియు వైద్య చికిత్సలు కేంద్రీకరించబడుతున్నాయి. దీనితో వైద్య ఖర్చులు విపరీతంగా పెరగడమే కాక రోగికి అవసరం లేని మందులు, ఇంజెక్షన్లు, అనవసర పరీక్షలు సూచించే హానికర విధానాలకు ఆజ్యం పోసినట్లవుతుంది. పెద్ద పెద్ద కార్పొరేట్ ఆసుపత్రులు మరియు ట్రస్టు ఆసుపత్రులు ప్రభుత్వం ఇచ్చిన సబ్సిడీలను పెద్ద ఎత్తున ఉపయోగించుకున్నాయి. కాని ఆస్పత్రులలోని కొంత శాతం పడకలను పేద ప్రజలకు ఉచితంగా మరియు తగ్గింపు రేట్లకు ఇస్తామని చేసుకున్న చట్టపరమైన ఒప్పందాన్ని పూర్తిగా ఉల్లంఘిస్తున్నాయి. ఢిల్లీ, ముంబాయి హై కోర్టులు ఒప్పందాలు ఖచ్చితంగా అమలు జరిగేటట్లు చూడాలని రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశించాయి. ప్రైవేటు వైద్యులు లాభార్జనే ధ్యేయంగా సాంకేతిక పరిజ్ఞానాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. లింగ నిర్ధారణ పరీక్షలు పెద్ద ఎత్తున చేస్తున్నారు. వైద్య రంగంలో నిష్ణాతులైన వైద్యుల అభిప్రాయాలు బలంగా ప్రభావితం చేస్తుండడంతో లింగ నిర్ధారణ నిషేధ చట్టం(పిఎన్‌డిటి యాక్ట్) కూడా సరిగా అమలు జరగడంలేదు.

### ఔషధ విధానం:

మందుల పరిశ్రమపై నియంత్రణ క్రమంగా తొలగిపోతుంది. **1978**లో **387** మందుల ధరలపై నియంత్రణ ఉండగా **2002** సంవత్సరానికి **25** మందుల ధరలపై మాత్రమే నియంత్రణ పెట్టారు. మందుల ధరలు అధికంగా ఉండడంతో పేద మహిళలు వైద్య చికిత్సకు దూరంగా వుంటున్నారు. ధరల పెరుగుదల వలన ప్రభుత్వ ఆసుపత్రులలో కూడా మందులు అందుబాటులో వుండడం లేదు. ప్రపంచ ఆరోగ్య సంస్థ **95**శాతం జబ్బులను నయం చేయగల **270** అత్యవసర మందులను సిఫార్సు చేసింది. **1996**లోనూ **2003**లోనూ జాతీయ స్థాయిలో అత్యవసర మందులుగా గుర్తించిన **279** మందులపై ప్రభుత్వం ఏమాత్రం శ్రద్ధ పెట్టలేదు. శరీరంలోకి ప్రవేశపెట్టే కొన్ని కుటుంబ నియంత్రణా సాధనాలను మందుల కంపెనీలు పేద భారత మహిళలపై పరీక్షల నిమిత్తం ప్రయోగించారు. ప్రభుత్వం "భారత ఔషధ చట్టాన్ని" సవరించి జాతీయ, అంతర్జాతీయ మందుల కంపెనీలు భారతదేశంలో యథేచ్ఛగా వైద్య సంబంధ ప్రయోగాలు చేసుకొనే వీలు కల్పించింది. సంరక్షణ మరియు సాంకేతిక పద్ధతులను కూడా సరళీకరించడంతో పేద ప్రజలు అనారోగ్య సమస్యలు మరియు అధిక వ్యయంతో బాధపడుతున్నారు. ప్రభుత్వం కఠినమైన నిబంధనల ద్వారా సాంకేతిక వైద్య ప్రయోగాలను నియంత్రించాలి.

### మహిళలందరికీ ఆరోగ్యం: సవాళ్ళు మరియు డిమాండ్లు:

1. అవసరమైన అన్ని రకాల వైద్య పరికరాలతో సిద్ధంగా వుండి సమర్ధవంతంగా నిర్వహించగలిగిన మూడంచెల ఆరోగ్య కేంద్రాల ద్వారా ప్రజలకు సమగ్రమైన ఆరోగ్య సంరక్షణ కలిగించాలి.
2. ఆరోగ్య రంగానికి కావలసిన నిధులను జిడిపిలో 5శాతానికి పెంచాలి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్‌ల నుండి కేటాయింపులు పెంచి అవి పూర్తిగా వినియోగించుకొనేటట్లు చూడాలి.
3. మహిళా డాక్టర్ల సంఖ్యను పెంచాలి. నర్సులకు, ఆరోగ్య కార్యకర్తలను (ఎఎన్ఎమ్‌లు మరియు ఎంపిడబ్ల్యులు) అవసరమైనన్ని శిక్షణా పాఠశాలలను ఏర్పాటు చేయాలి. మహిళల ఆరోగ్య అవసరాలను జాగ్రత్తగా తీర్చే విధంగా ప్రభుత్వ ఆస్పత్రులు పనిచేయాలి.
4. ప్రభుత్వాసుపత్రులలో యూజర్ చార్జీలను నిషేధించాలి. ప్రభుత్వాసుపత్రులను, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ప్రైవేటు రంగానికి కాని ఎన్‌జిఓలకు కాని కాంట్రాక్టుకివ్వడం ఆపాలి.
5. అత్యవసర మందులను ఉత్పత్తి చేసి వాటిని సరసమైన ధరలకు అందించాలి. అన్ని స్థాయిల ఆరోగ్య కేంద్రాల్లోనూ అవసరమైన మందులు ఉండేలా చూడాలి.
6. ఇద్దరు పిల్లల నిబంధన తీసేయాలి. కుటుంబ నియంత్రణ కోసం టార్గెట్లు పెట్టరాదు. బలవంతపు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు ఆపాలి. మహిళలపై విచక్షణా రహితంగా జరుపుతున్న సాంకేతిక పరీక్షా ప్రయోగాలను ఆపాలి. మహిళలకు సురక్షితమైన ఫలితాలనిచ్చే మరియు వాడకానికి అనువైన గర్భ నిరోధకాలను మాత్రమే ఇవ్వాలి. ప్రసవాలు మరియు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు కాంప్‌లలో కాక పూర్తిస్థాయిలో వైద్య పరికరాలు వున్న ఆసుపత్రులలోనే జరగాలి. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకునే పురుషుల సంఖ్యను పెంచాలి.
7. లింగ నిర్ధారణ నిషేధ చట్టం(పిఎన్‌డిటి యాక్ట్) ఖచ్చితంగా అమలు జరిగేట్లు చూడాలి. ప్రైవేటు వైద్య రంగం కూడా సామాజిక జవాబుదారీగా వుండేట్లు చూడాలి. కనీస విలువలు పాటించేటట్లు, ఖర్చులపై అదుపు ఉండేటట్లు నిబంధనలు విధించాలి. ప్రైవేటు, ట్రస్టు ఆస్పత్రులలో నిబంధనల ప్రకారం ఉచిత వైద్యం మరియు సబ్సిడీ రేట్లు అమలుజరిగేటట్లు చూడాలి.
8. మహిళలు ముఖ్యంగా అట్టడుగు వర్గాల మహిళల భూమిలేని పేద మహిళల ఆరోగ్యం పట్ల సామాజిక బాధ్యత వుండాలి. ఆహార భద్రత, ప్రజాపంపిణీ వ్యవస్థ, సురక్షిత మంచి నీరు, పారిశుధ్యం, అందరికీ విద్య, ఇంటి స్థలాలు, ఇళ్ళు సమగ్ర సామాజిక భద్రత, కనీస మరియు సమాన వేతనాలు వంటి అంశాలు అందరికీ అందుబాటులో వుండేట్లు చూడాలి.

### మన లక్ష్యాలు

1. ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలపై అజమాయిషీ ఉండాలి.
2. మూడంచెల గ్రామీణ ఆరోగ్య కేంద్రాల్లో ఎన్‌హెచ్ఆర్ఎం ప్రతిపాదిత సేవలు అందేట్లు చూడాలి.
3. ప్రభుత్వ ఆసుపత్రుల ప్రైవేటీకరణకు, కాంట్రాక్టు పద్ధతికి వ్యతిరేకంగా పోరాడాలి.
4. పట్టణ ప్రాంతాల సర్వీసులను సమీక్షించి వాటిలో సమస్యలను గుర్తించాలి.
5. ప్రైవేటు ట్రస్టు ఆస్పత్రులలో ఉచిత వైద్యం అమలయ్యేట్లు చూడాలి.
6. లింగ నిర్ధారణ నిషేధ చట్టం (పిఎన్‌డిటి) పటిష్టంగా అమలు జరిగేటట్లు చూడాలి.

(అనువాదం: కె. నాగలక్ష్మి)

***

# చైతన్యానికి చెక్ లేదు

-వి. ఆశ

**అక్కడ ప్రజాతంత్ర ఉద్యమం లేదు. ఉపాధిహామి పథకం అమలును ఐద్వా సవాలుగా స్వీకరించింది. మహిళలను సంఘటితం చేసి సమస్యపై సమరశంఖం పూరించింది. రైతు కూలి సంఘాల నిర్మాణంలోనూ 'ఐద్వా' ముఖ్యపాత్రపోషిస్తోంది.**

28 జిల్లాలున్న కర్నాటక రాష్ట్రంలో 11జిల్లాలను ఉపాధిహామి పథకం క్రింద గుర్తించారు. అందులో భాగమైన 'బీదర్' జిల్లాలో ఈపథకం క్రింద 10వేల మంది ఐద్వా ద్వారా లబ్దిదారులయ్యారు. వీరిలో 80%పైగా మహిళలే ఉన్నారు. ఈ ఘనత అంతా ప్రభుత్వ చలువ అనుకుంటే పొరబాటే. కేంద్రంలో వామపక్షాల వత్తిడి కారణంగా జాతీయ ఉపాధిహామి పథకం(రేగ) ని ఆమోదించి 'తాంబూలాలిచ్చాం తన్నుకు చావండి' అన్నట్టు దాని అమలును గాలికి వదిలేసింది. చాలా రాష్ట్రాల్లో ఇది అమలుకు నోచుకున్న దాఖలాలు కూడా లేవు. ఈ పరిస్థితుల్లో బీదర్ జిల్లాలో 'రేగ' అమలును ఐద్వా సవాలుగా స్వీకరించింది. ఎదురైన సవాళ్ళను సమర్థవంతంగా ఎదుర్కోవడంతోపాటు ప్రభుత్వం ఐద్వాని గుర్తించాల్సిన పరిస్థితి వచ్చింది. మొదట్లో ఎగతాళి చేసిన వారే ఈరోజు పనుల్లోకి వస్తున్నారు.

'బాల్వాద్' గ్రామంలో మట్టిపని చేస్తున్న భారతికి సంఘ కార్యకర్త ద్వారా ఐద్వా పరిచయం అయ్యింది. 'రేగ' పథకం గురించి తెలుసుకొని ఐద్వా నాయకుల సహకారంతో అమలుకు ముందుకొచ్చింది. అందుకోసం 50మందితో ఒక గ్రూపుగా యాభై గ్రామాల్లో 150 గ్రూపులు ఏర్పాటు చేశారు. అందులో మహిళా సభ్యులు 6000మంది. ఈ పనిలో అనుభవాలు భారతి మాటల్లోనే" మొదట్లో ఈపనులకు మహిళలే అంగీకరించలేదు. మగవాళ్ళు ఒప్పుకోలేదు. ఎగతాళి చేశారు. అందుకు ఒక కారణం ఈ పథకం క్రింద పనులన్నీ మొద్దుగా ఉండటం. మేం వెళ్ళి మహిళల్ని ఒప్పించడంతో పాటు అవసరమైతే పని స్వభావాన్ని మార్చుకోవచ్చని నచ్చచెప్పాము. అంతటితోనే కాలేదు. పనుల కోసం అందులోను తేలిక పనులు కోసం సదస్సులు పెట్టి మంత్రి ఇంటి ముందు, జిల్లా పరిషత్ ఆఫీసు ముందు రాత్రి, పగలు ధర్నా చేసిన తరువాతనే మాకు పనులు చూపించారు". వీరి కృషి ఫలితంగానే నేడు జిల్లాలో 10వేలమంది లబ్దిదారులయ్యారు. సాధారణ మహిళ నుండి కార్యకర్తగా వచ్చిన భారతి ప్రస్తుతం ఐద్వా బీదర్ జిల్లా కార్యదర్శి.





అమ్ముభాయి



భారతి

ఇదే జిల్లాలో 'రేగ' అమలుకు కృషి చేస్తున్న 'అమ్ముబాయి' అనుభవం మరోలా ఉంది. డ్వాక్రా గ్రూపులో సభ్యురాలైన అమ్ముబాయి మునిసిపల్ ఆఫీసులో పని చేస్తున్న ఐద్వా కార్యకర్త ద్వార 'రేగ' పథకం గురించి తెలుసుకున్నది. సంఘం పిలుపు మేరకు దాదాపు 25 గ్రామాలు తిరిగి ముందుగా ఐద్వాలో మహిళల్ని సభ్యులుగా చేర్పించింది. ఆసందర్భంగానే 'రేగ' పథకం పనుల గురించి మహిళల్ని ఒప్పించి గ్రూపులు ఏర్పరిచారు. ఆ తర్వాత నుండి పనుల కోసం సదస్సులు, ధర్నాలు షరామామూలే. మొదట్లో డ్వాక్రా సాధారణ సభ్యురాలిగా ఉన్న అమ్ముభాయి ప్రస్తుతం ఐద్వా బీదర్ జిల్లా అధ్యక్షురాలు.

ఈ జిల్లాలో ఐద్వా కృషి ఫలితంగానే 'రేగ' అమలు జరిగి వేలాది మంది మహిళలు, పేదలు లబ్ది పొందుతున్నారు. వీరిని అన్ని గ్రామ పంచాయితీ, జిల్లా పరిషత్ సమావేశాలకు ఆహ్వానిస్తున్నారు. అంగన్‌వాడీ బిల్డింగ్ నిర్మాణ పనిలో వీరి సలహాలు తీసుకుంటున్నారు. వీరు పథకం అమలు ఒక్కటే కాకుండా మహిళల్ని చైతన్యవంతుల్ని చేయడం కోసం, వారి హక్కుల కోసం కృషి చేస్తున్నారు. విజయం సాధిస్తున్నారు. 4500 లుగా ఉన్న సభ్యత్వం రేగాలో సంఘం కృషి ద్వారా 11వేలకు పెరిగింది. అయితే ఇంతటితోనే తమ పని అయిపోలేదని బాధ్యతలు ఇంకా పెరిగాయని వీరంటున్నారు.

ఈ పథకాన్ని 100రోజుల పనికి గ్యారంటీ చేయాలని, మహిళలకు, బలహీనులకు తేలికపాటి పనులివ్వాలని, ఎన్ని అవాంతరాలు వచ్చినా మహిళలందరూ తమ హక్కులకోసం సంఘటితమవ్వాలని కోరుతున్నారు. ఆదిశగానే 11వేల సభ్యత్వం 20వేలకు పెంచాలని, దాదాపు 85గ్రామాల నుండి గుర్తించిన 250 మంది చురుకైన కార్యకర్తకు వర్క్‌షాపులు పెట్టి వారిని నాయకులుగా తయారు చేయాలనే కర్తవ్యంతోపాటు రాష్ట్రం మొత్తం 'రేగ' పథకం అమలు అంటే ఐద్వానే అనేలా మా పనిని కొనసాగిస్తా మంటున్నారు. వీరికి మనందరం అభినందనలు తెలియజేద్దాం. ఆస్ఫూర్తిని మన రాష్ట్రంలోనూ కొనసాగిద్దాం.

❋❋❋

# పిల్లలు - పుస్తకాలు

- కె.అంజన

"నాన్నా రామూ! పొద్దస్తమానం టీవీ చూడడమేనా? కాసేపు ఏదైనా పుస్తకం తీసుకొని చదువుకోవచ్చుకదా!"

"పోమ్మా! ఎప్పుడూ చదువు...చదువు అంటావు. నాకు బోర్ కొడుతుంది తెల్సా. అయినా నాకు అన్ని పాఠాలు వచ్చేశాయి"

"నేను చెప్పేది తరగతి పుస్తకాల గురించి కాదు కన్నా! కథల పుస్తకాల గురించి"

"క...థ...లా! కూర్చుని చదవాలా! అది ఇంకా బోర్ అమ్మా. ఎంచక్కా టీవీ ముందు కూర్చుంటే బోలెడంత కాలక్షేపం. పిల్లల చానళ్లల్లో ఎన్ని రకాల ప్రోగ్రామ్స్ వస్తున్నాయో చూస్తే నీకే తెలుస్తుంది"

"అది కాదు రామూ! నీ ఫ్రెండ్ గీత చూడు ఎంచక్కా కథల పుస్తకాలు చదువుకుంటుంది. మరి నువ్వెందుకు చదవవు?"

"తను ఒట్టి పుస్తకాల పురుగమ్మా. దానికి పుస్తకం తప్ప మరో ప్రపంచం లేదు...దాన్ని నువ్వు మెచ్చుకోవాల్సిందే"

"పిచ్చి కన్నా! పుస్తకంలో ఎన్ని రకాల విషయాలుంటాయో తెలిస్తే నువ్వు ఇలా మాట్లాడవు. ఒక్కో కథ నిన్ను ఒక్కో ప్రపంచంలోకి తీసుకెళుతుంది. 'పేదరాసి పెద్దమ్మ కథలు, ఆలీబాబా 40 దొంగలు, విక్రమార్కుడి కథలు, పంచతంత్రం కథలు' ఎంత బావుంటాయో. చదివితే నీకే అర్థమౌతుంది"



"అమ్మా! నువ్వు ఇప్పుడు చెప్పేవన్నీ కార్టూన్ చానళ్లలో వస్తున్నాయి. ఇంక అదేపనిగా పుస్తకం పట్టుకుని కూర్చుని ఎందుకు చదవాలి?

...

నిజమే రామూకి వచ్చిన అనుమానం చాలా మంది పిల్లలకు కలిగే వుంటుంది. రామూ తల్లిలాగా చాలా మంది తమ పిల్లలను చదవమని చెప్తూనే వుంటారు. అసలు పిల్లలకు చదివే అలవాటు కలిగించడం ఎలా? వారు ఆసక్తిగా పుస్తకాలు చదివేలా చేయడమెలా? అసలు పుస్తకాలు చదివితే చిన్నారులకు కలిగే ప్రయోజనం ఏంటి? ఏ వయసు పిల్లలకు ఎలాంటి పుస్తకాలను ఎంపిక చేయాలి? వంటి విషయాలు క్లుప్తంగా....

## పుస్తకాలు చదివితే పుట్టెడు లాభాలు

పిల్లలు పుస్తకాలు చదవడం మొదలెడితే... వాటికి మించిన నేస్తాలు మరెక్కడా వుండరు. అంతేకాదు! పుస్తకాలు పిల్లల మెదళ్లకు పదును పెడతాయి. వారికి లోకజ్ఞానాన్ని ప్రసాదిస్తాయి. మంచికి చెడుకు గల వ్యత్యాసాన్ని బోధిస్తాయి. ఆపదలో వున్న వాడికి సాయం చెయ్యమని చెప్తాయి. అనుకోని అవాంతరాలు ఎదురొచ్చినప్పుడు భయపడకుండా వాటి నుంచి ఎలా బయట పడాలో చెప్తాయి. పసిమొగ్గలుగా వున్నప్పుడే ఎంతటి ధైర్యసాహసాలను ప్రదర్శించవచ్చో తెలియచేస్తాయి. దుష్టుల ఎత్తులను ఎలా చిత్తు చేయవచ్చో వివరిస్తాయి. స్నేహం విలువ ఏంటో ఎరుకపరుస్తాయి. పట్టుదల వుంటే ఏదైనా సాధించవచ్చని చెప్తాయి. చెడు అలవాట్లు ఎంతటి వారినైనా ఎలా పతనం చేస్తాయో చూపిస్తాయి. తెలివితేటలుంటే కడు పేదరికంలో వున్నా వున్నతస్థాయికి ఎలా చేరవచ్చో బోధిస్తాయి. అంతేకాదు! ఆయా కథల్లోని పాత్రలకు మల్లే అద్భుతాలు చేయవచ్చని, లోకకళ్యాణంకోసం పోరాడవచ్చని పసిమనస్సుల్లో మొలకలు నాటుతాయి. ఆయా కాలాల్లోని సంప్రదాయాలను, సంస్కృతిని తెలియచేస్తాయి. చిన్నారుల ఆలోచనాజ్ఞానాన్ని, జ్ఞాపకశక్తిని, అవగాహనా శక్తిని, సృజనాత్మకతను పెంచుతాయి. వారికి కొత్త కొత్త పదాలు, మాటలు పరిచయమౌతాయి. వాటిని ఏ సందర్భంలో ఎలా ఉపయోగించాలో చక్కగా తెలుస్తుంది. భాషా పరిజ్ఞానం పెరుగుతుంది. వాక్పటిమ పెరుగుతుంది. మొత్తంమీద పుస్తకాలు పిల్లలను విజ్ఞానవంతులుగా తీర్చిదిద్దుతాయి.

## పిల్లలు పుస్తకాలు చదివేలా చేయడమెలా!

చిన్నారుల ఆసక్తి, ఇష్టాలను బాగా పరిశీలించండి. వారు ఎటువంటి బొమ్మలను, వస్తువులను ఇష్టపడుతున్నారో తెలుసుకోండి. వాటిని దృష్టిలో పెట్టుకుని పుస్తకాలు ఎంపిక చేయండి. అందులో రంగురంగుల బొమ్మలు, అందమైన బొమ్మలు వుండేలా జాగ్రత్త తీసుకోవాలి. ముందుగా చిన్నారులకు ఆ అంశాలను పెద్దగా చదివి వినిపించండి. తర్వాత అదే విషయానికి సంబంధించిన మరిన్ని సంగతులను మరో పుస్తకంలో చదివి వినిపించండి. వారు చాలా ఆసక్తిగా వినడానికి గమనిస్తారు.

చదవడం అంతగా రాని చిన్నారులకు మీరే చదివి వినిపించండి. వారు అలా వింటూ ఎంతో ఆనందాన్ని పొందుతారు. తర్వాత మెల్లగా తామే చదవడానికి ప్రయత్నిస్తారు. అందుకు మీరు సాయం చేస్తే ...మరింత త్వరితగతిన చదవడం నేర్చుకుంటారు.

అంతేకాక ఏదైనా దినపత్రికలోనో, వార పత్రికలోనో, మాస పత్రికలోనో వున్న ఆసక్తికరమైన వార్తలు, జోక్‌లు, కథలు పెద్దగా చదివి వినిపించమనండి. అప్పుడు వారికి చదువు పట్ల ఆసక్తి కలగడమేకాక, చక్కటి ఉచ్చారణ అలవడుతుంది. అంతేకాక కామాలు, ఫుల్‌స్టాపులు వచ్చినప్పుడు ఎంతెంత గ్యాప్ ఇవ్వాలో తెలుస్తుంది.

పిల్లల పుట్టినరోజులప్పుడు, ఆటల్లో గెలుపొందినప్పుడు, మంచి ర్యాంకు పొందినప్పుడు, ఏదైనా మంచి పని చేసినప్పుడు వారి

ఆసక్తులకు తగ్గ పుస్తకాలను ఎంపికచేసి బహూకరించండి.

పిల్లలను మీకు దగ్గరలో వున్న గ్రంథాలయానికి తీసుకెళ్లండి. పిల్లల పుస్తకాల సెక్షన్‌కు తీసుకెళ్లి మంచి పుస్తకాలు ఇప్పించండి. అలా వారు రోజూ లైబ్రరీకి వెళ్లేలా చూడండి.

పిల్లలకు తమ పుస్తకాలు పెట్టుకోవడానికి ప్రత్యేకంగా స్థలాన్ని కేటాయించండి.

ఇంట్లోని పెద్ద పిల్లలు చక్కటి పుస్తకాలు తీసుకొని తమకన్నా చిన్నవారికి చదివి వినిపించేలా ప్రోత్సహించండి.

మీ ఖాళీ సమయాల్లో పుస్తకాలు చదువుకొని రిలాక్స్ అవడాన్ని పిల్లలు గుర్తించేలా చూడండి. అప్పుడు వారుకూడా ఆ అలవాటు చేసుకుంటారు.

ఏదైనా పుస్తకాన్ని ఏకబిగిన చదవమని చెప్పకండి. రోజుకి ఒక చాప్టరో, కొన్ని పేజీలో చదవమనండి. ఆసక్తి లేని పుస్తకాన్ని పక్కన పెట్టి మరో పుస్తకం చదవమని చెప్పండి. అంతేకాని దాన్ని పూర్తిచేయమని బలవంతపెట్టకండి.

చిన్నారులు మరికొంతసేపు చదివేలా ప్రోత్సహించండి. వారికి ఏదో ఒక ఆశ చూపండి. ఉదాహరణకు మీ పాప డైనోసార్లకు సంబంధించిన పుస్తకం చదువుతోంది. మరో పావుగంటలో ఒక చాప్టర్ చదవడం పూర్తవుతుందంటే ...ఆ పావుగంట కూర్చుని చదవమనండి. పైగా ఆ పుస్తకం పూర్తయ్యాక డైనోసార్‌కి సంబంధించిన సినిమా చూపిస్తాననో, సీడీ తెచ్చిస్తాననో మాట ఇవ్వండి.

చిన్నారులు చూస్తున్న టీవీ సమయాన్ని తగ్గించండి. ఆ సమయాన్ని చదవడం వంటి ఇతర పనులకు కేటాయించేలా చూడండి. ఎక్కువగా చదివితే టీవీ చూడనిస్తామని మాత్రం అనకండి. అలాగే చదవక పోతే పనిష్మెంట్‌గా టీవీ చూడనివ్వబోమని అనకండి.

రాస్తూ ఆడే ఆటల గురించి చెప్పి వాటిని ఆడేలా చూడండి. ఖాళీ సమయాల్లో పుస్తకాలో, పత్రికలో, మ్యాగజైన్లో చదవమని చెప్పండి. అందుకోసం ఇంట్లోనే ప్రత్యేకంగా కొంత స్థలాన్ని కేటాయించండి.

రాత్రి పూట భోజనం చేశాక పిల్లల పక్కన చేరి కథలు చదివి వినిపించండి. లేదా వారితో పెద్దగా చదివించండి. ఇలా ప్రతి రోజూ చేయండి. ఇది పిల్లలు స్కూలుకు వెళ్లడం మొదలెట్టకముందునుంచే ఇలా చేస్తే మంచిది. అప్పుడు వారు పుస్తకాలను ఆసక్తిగా చూస్తారు. అక్షరాలను, పదాలను, వస్తువులను గుర్తించడానికి ప్రయత్నిస్తారు.

### ఏ వయసులో ఏ పుస్తకాలు ఇవ్వాలి?

1-2 సంవత్సరాలు: ఈ వయసు పిల్లలు పుస్తకాల్లోని రంగురంగుల బొమ్మలను ఆసక్తిగా చూస్తారు. వాటిమీద చేతులు వుంచి తమకు పరిచయం వున్న వస్తువులను గుర్తించడానికి ప్రయత్నిస్తారు. అయితే ఈ బొమ్మలు నిజమైన బొమ్మలుగా వుంటే బాగుంటుంది. అంటే కార్టూన్ బొమ్మలున్న పుస్తకాలను వీరికోసం తీసుకోకూడదు. ఉదాహరణకు: పిల్లి బొమ్మ. సి ఫర్ క్యాట్. పిల్లి పిల్లను కిటెన్ (పిల్లి పిల్ల) అంటాం. అని చెప్తాం. దాన్ని తర్వాత పిల్లలు కథల్లో, నిజజీవితంలో చూసి గుర్తుపడతారు. వాటికి సంబంధించిన కథలు వినడానికి ఆసక్తి చూపిస్తారు.

2-3 సంవత్సరాలు: ప్రపంచం చాలా పెద్దదని, అందులో ఎన్నో




రకాల వస్తువులు, ప్రాణులు వున్నాయని తెలుసుకుంటారు. జంతువులు, విలువలు, వస్తువులు, వాహనాలు, కార్ల గురించి వారి ఆసక్తిని బట్టి పుస్తకాలలో చూపించి చెప్పాలి.

3-4 సంవత్సరాలు: ఈ వయసులో అక్షరాలను గుర్తించడానికి ప్రయత్నిస్తారు. అక్షరాలు పదాలవుతాయని, పదాలు వాక్యాలవుతాయని, వాక్యాలు కథలవుతాయని తెల్సుకుంటారు. పిల్లలకు కథలు చదివి వినిపించేటప్పుడు ఆ వాక్యం దగ్గర మీ వేలిని కదుపుతూ వుండండి. దీనివల్ల పదే పదే వచ్చే పదాలను పిల్లలు త్వరగా గుర్తిస్తారు. అంతేకాదు. ఆ కథలో హీరో పాత్ర స్థానంలో మీ పాప/బాబు పేరు పెట్టి చదివి వినిపించండి. వారి మొహాలు ఎలా వెలిగిపోతాయో చూడండి. ఫలితంగా తామే సొంతంగా ఆయా కథలు చదవాలని అనుకుంటారు.

4-5 సంవత్సరాలు: తాము చాలా పెద్దగా అయిపోయామని అనుకునే వయసు. కానీ మనకు స్పీడ్‌గా చదివించాలని వుంటుంది. వారికేమో కాస్త ఇబ్బందిగా వుంటుంది. ఏదైనా ఒక పదం పలకడం రాకపోతే...అదే పదం పక్క పేజీలో వస్తే ...అదే ఇబ్బంది మళ్లీ తలెత్తుతుంది. అప్పుడు వారికి విసుగు కలుగుతుంది. అప్పుడు మనమే వారిని ఆ సమస్య నుంచి బయటపడెయ్యాలి. మనమే ఓర్పుగా వ్యవహరించాలి.

5 సంవత్సరాలు ఆ పైన: ఐదేళ్ల పిల్లలు తమకు తాముగా పుస్తకాలను ఎంచుకోగలుగుతారు. ఆకట్టుకొనే బొమ్మలను చూసి వారు తమకంటే పెద్దపిల్లలు చదివే పుస్తకాన్ని ఎంచుకున్నారనుకోండి. మెల్లగా విషయం చెప్పండి. పట్టుబట్టి అదే కావాలంటే... ఏమాత్రం ఒత్తిడిచేయకుండా దాన్నే ఇప్పించండి. తర్వాత వారికే తెలుస్తుంది. అది తమకంటే పెద్దవారు చదివేదని.

### చివరిగా ఒక్కమాట...

కథలు పిల్లలకు బయటి ప్రపంచానికి ద్వారాలు లాంటివి. అలాగే తల్లిదండ్రులకు అవి చాలా మంచి సాధనాలు. తమ చిన్నారులకు మంచిని, బుద్ధిని, తెలివితేటలను, జ్ఞానాన్ని వాటి ద్వారానే వారికి చెప్పవచ్చు. ఎటువంటి దెబ్బలు, భయపెట్టడాలు లేకుండానే వాటన్నిటినీ చక్కగా కథల రూపంలో పిల్లలకు చెప్పొచ్చు. అయితే దెయ్యాలు, భూతాలు....వంటి భయపెట్టే కథల జోలికి వెళ్లకుండా వుంటే మంచిది. వాటివల్ల పిల్లలకు పీడకలలు వచ్చే ప్రమాదం వుంది.

***

# విద్యారంగం ఏమి నేర్పుతుందిని

(ఇంజనీరింగ్ విద్యార్థి)

రాష్ట్రంలో అమ్మాయిలపై జరుగుతున్న అత్యాచారాలు, దాడులు, వేధింపులు ఇవన్నీ ప్రేమ ముసుగులో జరుగుతున్నాయి. రోజురోజుకీ వీటి తీవ్రత పెరుగుతున్నది. దేశాభివృద్ధికి ఫలాలను అందించాల్సిన విద్యాసంస్థలు, అమ్మాయిల పాలిట విషవలయంగా పరిణమిస్తున్నాయి. ఈ తప్పు ఎవరిది? చదువుకోసం పంపుతున్న తల్లిదండ్రులదా? చదువుకుంటున్న విద్యార్థులదా? చదువుచెబుతున్న గురువులదా? విద్యావ్యవస్థలో వస్తున్న మార్పులదా! సమాజానిదా! మీడియా సృష్టిస్తున్నదా! "లేక" ప్రపంచీకరణ ఫలితాలా! దీని బాధ్యత ఎంతో పరిశీలిద్దాం.

"భారతదేశంలో ప్రతి 29 నిమిషాలకు ఒక మహిళ అత్యాచారానికి గురవుతోంది. ప్రతి 43 నిముషాలకు ఒక యువతి కిడ్నాప్ అవుతుంది. ప్రతి 25 నిమిషాలకు బలాత్కార యత్నానికి, తీవ్రమైన దాడికి, వేధింపులకు గురవుతున్నారు. ప్రతి 93 నిమిషాలకు ఒక మహిళ హత్యకు గురవుతోంది". ఇవి నేషనల్ ఫ్యామిలీ ఫౌండేషన్ సర్వే చెప్పిన వాస్తవాలు. దేశం మొత్తంమీద మహిళలకు రక్షణ కరువైందన్న దానికి నిదర్శనం ఇదే. ఒక వైపు మహిళా సాధికారతవైపు మహిళలు దూసుకుపోతున్న సమయంలో మహిళలపై దాడులు కూడా అదే స్థాయిలో పెరిగిపోతున్నాయి. ఇది దేశంలో కదా మన రాష్ట్రంలో ఇంత తీవ్రత లేదనుకోవచ్చు. ఈ రకమైన వేధింపులో భారతదేశంలోనే ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానంలో ఉంది. మన రాష్ట్రంలో గత సంవత్సరం మొత్తం మహిళలపై జరిగిన వివిధ ఘటనలపై నమోదైన కేసులు 12, 747. ఈ సంవత్సరం సెప్టెంబర్ నాటికి 15,315 కేసులు నమోదయ్యాయి. అంటే గతం కంటే 20శాతం వృద్ధిరేటు సాధించిందన్నమాట. మహిళలపై దాడుల్లో అక్టోబర్, నవంబర్‌లో జరగుతున్నవి కలుపుకుంటే 50శాతం వృద్ధిరేటు ఉందన్నా ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు. ప్రతి సంవత్సరం, ప్రతి నెల, ప్రతిరోజు మహిళలపై దాడులు జరుగుతున్నా ఎందుకు అరికట్టడం లేదు. అమ్మాయిలు ఇలా బలికావల్సిందేనా!

విజయవాడలో శ్రీలక్ష్మి. గుంటూరులో ప్రసన్నలక్ష్మి, శ్రీకాకుళంలో కల్పన వీళ్లంతా విద్యార్థినులే. ఈ దాడులు విద్యార్థినిలపైనే జరుగుతున్నాయంటే ఇందులో విద్యారంగానికి బాధ్యత లేదా! 1990 కంటే ముందు అంటే ప్రైవేటీకరణ ప్రారంభం కాకముందు దాదాపు ఇలాంటి ఘటనలు లేవు. ఉన్నా భూస్వాములు, జమీందారులు, పెత్తందారులు మాత్రమే ఇటువంటి అఘాయిత్యాలకు ఎక్కువ పాల్పడేవా. విద్యాసంస్థల్లో మాత్రం ఇలాంటి వికృత ధోరణులు ఉండేవికావు. కాని ఎప్పుడైతే ప్రభుత్వం తన బాధ్యతలు తగ్గించుకొని ప్రైవేటు భాగస్వామ్యం పెంచిందో ఇక అప్పటినుంచి ఈ రకమైన దాడులు పెరుగుతున్నాయి. ఉపాధ్యాయ పోస్టులు భర్తీచేయకుండా, విద్యావాలంటీర్లను నియమించడం, ప్రైవేట్ విద్యాసంస్థలు ఏర్పాటు చేయడం వలన విద్యార్థి ఉపాధ్యాయ సంబంధాలు పూర్తిగా దెబ్బతిన్నాయి. విద్యావాలంటీర్లు గాని, ప్రైవేటు పాఠశాలల్లో ఉపాధ్యాయులు గాని వీరంతా పదవతరగతి, ఇంటర్‌తో చదువు ఆపేసిన వారే ఎక్కువ. మహా అయితే అక్కడక్కడ డిగ్రీ పీజీ చదివేవాళ్లు వున్నారు. వీళ్ళలో కొందరు చదువుతూ కూడా పేదరికం కారణంగా ప్రైవేటు పాఠశాలల్లో టీచర్లుగా పనిచేస్తున్నారు. వారిలో ఒక గురుతరమైన బాధ్యత ఉన్న ఉపాధ్యాయున్ని ఆశించలేం. ఈ రోజు విద్యార్థి ఆలోచనపై అనేకమైన ప్రభావాలతో పనిచేస్తుంటాయి. అందులో టీనేజర్స్ (యుక్తవయస్సు)పై ఇంకా ఎక్కువగా ఉంటాయి. యుక్తవయస్సులో యువతీ, యువకుల ఆలోచనాసరళి, శారీరకంగా జరిగే మార్పులు హార్మోనులు కలిగించే ప్రభావంపై చాలా విశ్లేషణలున్నాయి.



వీటి జోలికిపోవాల్సిన పనిలేదు. ఒకముక్కలో చెప్పాలంటే సున్నితమైన అంశం లాంటిది (మతసమస్య). మత సమస్యను తెరమీదకు తెస్తే ఏ విధమైన పరిణామాలు సంభవిస్తాయో ఈ యువతీయువకులు మనసులు ఆ విధమైన ప్రభావాన్ని కలిగి ఉంటాయి. అందుకే యుక్తవయస్కులు చదువు తున్న విద్యా రంగంపై ప్రభుత్వ బాధ్యత ఉండాలి. ప్రైవేట్ టీచర్లు, విద్యావాలంటీర్లు వ్యవస్థ ప్రారంభమైన తర్వాత ఆ శ్రద్ధ తగ్గింది. ఈ ఉపాధ్యాయులకు, విద్యార్థులకు వయస్సుల్లో తేడాలేదు. ఆలోచనలో తేడా లేదు. దీని ఫలితాలు

విద్యార్థినులు అనుభవిస్తున్నారు. కాబట్టి విద్యారంగంలో మార్పు వచ్చిన రోజున ఈ దాడులు, అత్యాచారాలు, వేధింపులు, తగ్గుతాయన్నదే మరువరాని విషయం. గతం నేర్చుకున్న పాఠం ఇదే.

ఎప్పుడైతే ఈ సంబంధాలు దెబ్బతింటాయో అప్పుడు, ఆ ప్రభావం సమాజంపై కూడా పడుతుంది. "బర్రె చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా! దీనికి విదేశాల నుండి దిగుమతి అవుతున్న విషసంస్కృతి కూడా తోడైంది. టూరిజం, అందాల పోటీలు, బ్యూటీ పార్లర్‌లు, క్లబ్‌లు, పబ్‌లు వాటిలో పిచ్చాపాటి దాన్స్‌లు, స్త్రీలు, పురుషుల సంభాషణలో కూడా మార్పు వచ్చింది. ఏ పదం ఏ అర్థాన్ని స్ఫురిస్తుందో కూడా తెలియని పరిస్థితి నెలకొంది. ఇదంతా ఈ పెట్టుబడి దారీ సమాజం అంగీకరించి మన దేశంపై రుద్దుతున్నది. ఇవే ఉత్తమ విలువలని ప్రచారం చేసే మీడియా, పాలకులు ఒకరికొకరు పోటీ పడి మరీ ముందుకు తీసుకెళ్తున్నారు. సాధారణ ప్రజలు, బలౌతున్నారు తప్ప పోటీపడిన వారు మాత్రం కాదని అర్థం చేసుకోవాలి. వారు ప్రచారం చేసినది వాస్తవం అనడానికి "వింతవాదనను" ముందుకు తీసుకువస్తున్నారు.

మానవతా విలువలు లేని సినిమాలు, పోస్టర్లు, ప్రకటనలు తెల్లవారితే కళ్ళముందుంటాయి. వీటిని ఎందుకు ప్రచారం చేస్తున్నారంటే ప్రజలు చూస్తున్నారు కాబట్టి తీస్తున్నామని ప్రచారం చేస్తున్నారు. వీరు చెప్పే అబద్ధాలకు ప్రచారం ఎక్కువ. ఏ తల్లిదండ్రైనా ఒంటి నిండా బట్టలు లేని పిల్లలను చూడాలని కోరుకుంటారా! దేశ అభివృద్ధికి ఉపయోగపడే సామాజిక విలువలతో కూడిన సినిమాలు చూస్తున్నారు కాని వాటిని తీయరు. సినిమాల్లో అశ్లీలత వల్ల విద్యార్థులు పాడైపోతున్నారు. ఇటువంటి వాటిని నియంత్రించాల్సిన సెన్సార్‌బోర్డు ఆ పని తనది కాదన్నట్లుగా వ్యవహరిస్తోంది. బూతు చిత్రాలకు "ఎ" సర్టిఫికెట్ ఇచ్చి సమాజంపైకి వదిలి వేస్తోంది. అశ్లీలత ఎంత ప్రమాదమో, ప్రేమ పేరుతో చూపిస్తున్న "రొమాంటిక్" సీనులు అంతకంటే ప్రమాదం. యువకుల "మస్తిష్కంలో దాగున్న హార్మోనులను సైతం రెచ్చగొట్టే విధంగా చూయిస్తున్నారు. శరీరంలో అణువణువు ఒత్తి, ముద్దులతో ముంచే ఘటనలు యువకులపై ఎంత ప్రభావం చూపుతాయి. వాటిని ఎందుకు సెన్సార్ చేయడంలేదు. ఈ బాధ్యత మీడియాకు లేదా సెన్సార్ బోర్డుకు లేదా, ప్రభుత్వానికి లేదా? వీటి వేషాలకు బలౌతున్నది విద్యార్థినులు. అప్పుడు మాత్రం అయ్యోబాబో ఎంత అన్యాయం. దుర్మార్గం, శిక్షించాలి, సభ్యసమాజం మానవతా విలువలు అన్ని జరిగిపోయాకే మీడియాకు గుర్తుకు వస్తాయి. ఇంత కంటే వంచన ఏమైనా వుందా! దీనిని అందరూ ఆలోచించాలి.

ఒక అత్యాచారమో, వేధింపో, ఇంకో రకమైన దాడో అమ్మాయిపై జరిగిందంటే దానికి పాల్పడిన వాడిది ఎంత తప్పో! అలాంటి వాతావరణాన్ని సృష్టించిన వాళ్లది కూడా అంతే తప్పు. వీటిలో కొన్నింటినైనా అరికట్టడానికి సుప్రీంకోర్టు అన్ని కాలేజీలలో ఈవ్‌టీజింగ్, ర్యాగింగ్‌కు వ్యతిరేక కమిటీలు అన్ని కళాశాలల్లో ఏర్పాటు చేయమని చెప్పింది. ప్రభుత్వం ఆ పని చేస్తుందా! చేసి ఉంటే కృష్ణాజిల్లాలో మహాలక్ష్మి, శ్రీలక్ష్మి, కల్పన లాంటి ఎంతోమందికి రక్షణ దొరికేది. ఎక్కడా ప్రభుత్వం తన పని తాను చేయలేదు. అమ్మాయిలపై వేధింపులకు వేదిక లేకపోతే ఎవరితో చర్చించాలి. ఎక్కడ చర్చించాలి. ఎంతమంది ఉపాధ్యాయులతో వేధింపులకు గురి కావాలి. ఆ కమిటీ ఉంటే ఆకతాయి విద్యార్థి నుండి ఉపాధ్యాయుల లైంగిక వేధింపుల నుండి రక్షణ దొరికేది. ఈ ఘటనలకు ఈ ప్రభుత్వం కూడా ముద్దాయే. కాబట్టి వీటిని అరికట్టాలని అంటే విద్యార్థి, విద్యార్థినులు, తల్లిదండ్రులు, మీడియా, మేధావులు, వివిధ సంఘాలు, విద్యారంగ మార్పులకోసం, మీడియా విష ప్రభావంపై ప్రభుత్వ బాధ్యతారాహిత్యం ఐక్యంగా పని చేసిననాడు, భవిష్యత్తులోనైనా అమ్మాయిలకు రక్షణ దొరుకుతుంది. దీనికోసం ఐక్యంగా కృషి చేయాలని ఆశిద్దాం. అలా చేయకుండా ప్రపంచీకరణ ప్రభావంలో కొట్టుకుపోతే మిగిలేది విషాదమే.

***

# పెళ్లి వార్(రు)

-జి. రాజకూమారి

"విజ్జూ! బుధవారం సాయంత్రానికల్లా మా యింటికి రాగలవా?

సుబ్బూ ఫోన్లో అలా అడుగుతుంటే 'ఏమిటిది? యింతగా...ప్రాధేయపడ్తోంది' అనిపించింది.

"ఏంటీ..నీ గొంతు అలా వుంది. ఆదుర్దాగా వున్నావ్. ఏమైంది?"వుండబట్టలేక అడిగేసింది విజ్జూ.

"అబ్బే కంగారేమీ లేదు. ఎప్పుడూ వుండే కతే...! చిన్నూకి ఓ సంబంధం వచ్చింది ఐతే, అబ్బాయి అమెరికాలోనే వున్నాడట. పేరెంట్స్ వస్తారట." చెప్పింది సుబ్బు.

"అబ్బాయెందుకు రాడు?" అడిగింది విజ్జూ

"ఏకంగా పెళ్లికే వచ్చి వెళ్ళిపోతాట్ట...!

అమ్మాయిని అతగాడి తల్లిదండ్రులు మెచ్చితే చాలట..".

"అదెలా? మన చిన్నూ అబ్బాయిని చూడాలిగా..? సందేహం వెలిబుచ్చింది విజ్జు.

"మనకు కంపల్సరీ అనుకుంటే అమ్మాయి, అబ్బాయి ఇంటర్నెట్‌లో మాట్లాడుకోవచ్చు...అంటున్నారే..!"

"ఓహో...! మరి అబ్బాయి రానికాడికి యింత హంగామా దేనికి?" సుబ్బు నుండి సమాధానం లేదు.

" నా అభిప్రాయం అయితే ఏ ఆర్భాటం లేకుండా గప్‌చిప్‌గా కానిస్తేమంచిది.ఏమంటావ్" రెట్టించింది విజ్జు.

'అసహనమేమైనావుంటే...తనకు కదా ఉండాల్సింది..దీని కెందుకో..సుబ్బూ తనలోతాను మదనపడుతూ.....ముందీ విషయం చెప్పు.. నువ్వు రావదానికేమైనా ఇబ్బందా?"

అదికాదే సుబ్బూ.....రావడం సమస్యకాదు.....ఇప్పటికి ఐదారు మాచ్‌లయ్యాయా.....! అంతా రావడం .....చూట్టం .....పోవటం. ఏమైనా బావుందా? నాకైతే ఈతంతు సుతరామూ నచ్చట్లేదు తల్లీ...! పాపం చిన్నూ మొహం చూస్తుంటే...కడుపు తరుక్కుపోతుంది. వున్నమాట చెబుతున్నా.....చిన్నూ కూడా వాళ్ళ నాన్న మాటకు పైకి ఎదురు చెప్పట్లేదు కానీ, తనకీ చూపుల వ్యవహారమేమీ గిట్టట్లేదు." విజ్జూ అలా నిక్కచ్చిగా మాట్లాడుతుంటే సుబ్బూ ఏమీ మాట్లాడలేకపోయింది.

నువ్వేమంటావ్? రెట్టించింది విజ్జూ.

"నేనిప్పుడు అటు మా ఆయన విసుర్లకు గానీ ఇటు నా కూతురు రుసరుసలకు గానీ నీ ప్రశ్నలకు గానీ బదులు చెప్పే స్థితిలో లేను. ఎందుకంటే నా మాటకు విలువెక్కడుంది?' సుబ్బూ నిస్సహాయంగా మాట్లాడుతుంటే విజ్జుకి జాలేసింది.

"సరే నేనెందుకు చెబుతున్నానంటే ప్రతొక్కదూ అమ్మాయిని చూట్టం..కూరగాయల బేరంలాగా గొంతెమ్మ కోర్కెల లిస్టొకటి..!పోనీ, అమ్మాయికేమైనా ముక్కొంకరా? మూతొంకరా? సలక్షణమైన పిల్ల.! ఊళ్లో అందరికీ ఈ సంబంధాల సంగతి పెద్ద కాలక్షేపమైపోయింది..అందుకనీ కామ్‌గా కానిచ్చేద్దాం అంటున్నా..' సుబ్బుకి నచ్చ చెప్పేందుకు ప్రయత్నించింది విజ్జు.

అందరికీ అమ్మాయి నచ్చింది. ఇక తాంబూలాలు పుచ్చుకోవడం తరువాయి అన్నట్లు మాట్లాడుతున్నారు. అబ్బాయి తరపువాళ్ళు. చిన్నూ ఫాదర్ మాటి మాటికీ టవల్‌తో మొహాన్ని రుద్దుకుంటూన్నారు. చిన్నూ చిన్నబోయింది. నెమలి కంటనీరు వేటగానికి జాలి కల్గిస్తుందా...? తప్పదు. తానిక జోక్యం చేసుకోవలసిందే.....నని పెళ్ళి పెద్దలు కూర్చున్న వరండాలోకి వెళ్ళింది విజ్జూ.

"అబ్బాయిని రప్పించండి" చాలా సౌమ్యంగా అడిగింది విజ్జు.

"అబ్బే కుదరదమ్మా.."నసిగాడు అబ్బాయి తండ్రి.

"అదెలాగండీ? వాళ్లిద్దరూ మంచీ చెడూ మాట్లాడుకోవాలి కదా..! దృఢంగా పలికింది విజ్జు గొంతు.

"ముందే చెప్పాం కదమ్మా. మాకు నచ్చితే అబ్బాయిక్కూడా ఓకే.....కాదూ కూడదు అంటే రానూ పోనూ టికెట్ మీరే పెట్టుకోవాలి. పెళ్లి తంతు వారం రోజుల్లో ముగించేయాలి మరి. పెట్టుపోతల్లో ఏ లోటూ రాకూడదు మరి.. ఆ." డైలాగ్ అప్పచెప్పాడు అబ్బాయి మేనమామ.

చిన్నూ పెద్దమ్మ విజ్జూని పిలిచి చెవిలో ఏదో చెప్పింది. సుబ్బూ దంపతులిద్దరితోనూ విజ్జు సంప్రదించింది.

"నేను కాస్త ఆలోచించి ఫోన్జేస్తానండీ" అబ్బాయి తల్లిదండ్రులతో వినయంగా చెప్పాడు చిన్నూ ఫాదర్. 'సరే మీ యిష్టం" విసురుగా వెళ్ళిపోయారంతా.

"పెద్దమ్మా! నిజంగా చెప్పనా..ఇది మిస్సయ్యాం అని నాకేం బాధ లేదు. 'ఇంటర్నెట్'లో చూసి పెళ్లి చేసుకోవడానికి నేనేమన్నా 'రోబోట్'నా?

ఈసారీ అబ్బాయి పేరుతో తప్పిపోవటం హాయిగా ఉంది. ఈ మధ్య రెండు ప్రాజెక్టులు చేశా. ఈ లోపు మరో రెండు చేసేయొచ్చు.." ఏమంటావ్..కళ్లు చిత్రంగా తిప్పుతూ సరదాగా పెద్దమ్మని ఆటపట్టించింది చిన్నూ.

***

# ఒంటరి స్త్రీల సమస్యలు

## (8వ జాతీయ మహాసభలో ఐద్వా చర్చించిన కమిషన్ పేపర్)

*భూమి మీద పడియున్న మాంసపు ముక్కను పొందడానికి పక్షులు ఏ విధంగా ప్రయత్నిస్తాయో భర్త చనిపోయిన స్త్రీలను లొంగదీసుకోవడానికి పురుషులు కూడా అదేవిధంగా ప్రయత్నిస్తారు.*

*మహాభారతంలోని ఆదిపర్వంలో వందల సంవత్సరముల క్రితం ఈ విషయం చెప్పబడింది.*

అనాటి నుంచి యీనాటి వరకు కూడా పరిస్థితిలో మార్పురాలేదు. వాస్తవానికి యింకా దిగజారిపోయింది. ఇప్పుడు ఒంటరిగా ఉన్న మహిళలందరికీ వితంతువుల దుస్థితి ఆవరించింది. పెళ్ళికాని అమ్మాయిలు, ప్రత్యేకంగా విడాకులు పొందిన స్త్రీలు, వెలివేయబడినట్లుగా ఒంటరి స్త్రీలందరు తర తమ తేడాలతో పై దుస్థితిని ఎదుర్కొంటున్నారు. బాధలు అందరివి ఒకే రకమైనవి. పురుషుడు లేకుండా భారత సమాజంలో స్త్రీ ఒంటరిగా జీవన సాగించడం అసాధ్యం. దీనికి పరిష్కారమార్గం స్త్రీ పెండ్లి చేసుకోవడం. లేనట్లయితే స్త్రీలను సమాజం పరిత్యజించుతుంది. అవమానకరమైన జీవితాలను గడపవలసి వస్తుంది. నిరంతరం సమాజం ఆమెపై నిఘావేసి చూస్తుంటుంది. వివాహిత అయిన స్త్రీ కన్నా, అతి జాగ్రత్తగా కఠినమైన నీతి నియమాలను ఆమె ఆచరించవలసి ఉంటుంది. లేనట్లయితే అవహేళనకు, పురుషుల ముందస్తు లైంగిక దోపిడీకి ఆమె వస్తువుగా మారిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. ఆమెకు ప్రత్యేకమైన గుర్తింపు లేకపోవడంతోపాటు స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకొనే అవకాశాలూ లేవు. భర్తతోనే ఆమెకు గుర్తింపు వస్తుంది. ఆమె ముత్తయిదువుగా ఉన్నంత వరకు లేక భర్త బ్రతికి ఉన్నంతవరకు సమాజం ఆమెను గౌరవిస్తుంది. ముస్లిం సమాజంలో కూడా భర్త బ్రతికిఉన్నంతవరకు సమాజంలో స్త్రీకి గౌరవం ఉంటుంది. అన్ని వర్గాలకు చెందిన ఒంటరి స్త్రీలందరు దుర్భర జీవితాలను, ఆర్థిక పరమైన ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. వీరిని సమాజంలో తర తమ తేడాలు లేకుండా అన్ని వర్గాలు, బంధు వర్గాలందరు చులకనగా చూస్తున్నారు. ఈ ధోరణులు ప్రబలి చితి మీదనే పిల్లలు లేని వితంతువులను తగలపెట్టే (సతి) ఆచారానికి బలవుతున్నారు. ముక్కు పచ్చలారని ఆడపిల్లలను వారి వయస్సు కన్నా అనేక రెట్లు ఎక్కువ వయసున్న పురుషులతో వివాహం జరిపించటం తదితర దురాచారాలకు వ్యతిరేకంగా 19వ శతాబ్దంలో భారతదేశంలోని అనేక రాష్ట్రాలలో సంఘ సంస్కరణోద్యమాలు జరిగినవి. రాజారామ్మోహన్‌రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, మహాత్మ జ్యోతిబాపూలే మరియు సావిత్రిబాయి పూలే, మహర్షి విఠల్‌రామ్‌జీ షిండే, పండిత రమాబాయి, మహర్షి కార్వే, ఆగార్కర్, పెరియార్ మరెంతో మంది మహనీయులు వితంతువుల మీద సాగిన అమానుషమైన సాంప్రదాయాలకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటాలు చేయడమేకాకుండా వీరి జీవితాలను అంకితంచేసి వితంతువులకు విద్యాసంస్థలను, సేవాకేంద్రాలను ఏర్పాటు చేశారు. సతిని నిషేధించే చట్టం, వితంతువులు పునర్ వివాహం చేసుకొనే చట్టం, వివాహ వయస్సు నిర్ణయించు చట్టం తదితరాలను పోరాడి సాధించారు. మరికొంత మంది సంస్కర్తలు పట్టువిడవకుండా ధృఢచిత్తంతో ఉద్యమాలను నడిపి వారే ముందుకు వచ్చి వితంతువులను వివాహమాడారు. మోసపోయినవారి సంతానాన్ని దత్తత తీసుకొని సమాజానికి మార్గదర్శకులయ్యారు.

జ్యోతిబాపూలే మరింత ముందుకుసాగి క్షౌరవృత్తిదారులను సమీకరించి సంఘటితం చేసి, వితంతువుల తలవెంట్రుకలను తీసి బోడి గుండులను చేయబోమని వారిచేత ఆయన సమ్మె చేయించారు. ఈ ఉద్యమాల వలన కొన్ని ఫలితాలు వచ్చినవి. సతీ సహగమన నిషేధ చట్టం **1829** సం.లో వచ్చింది. **1856** సం.లో వితంతువుల పునర్ వివాహ చట్టం వచ్చింది. హిందూకోడ్ చట్టం **1956** సం.లో వచ్చింది. ఉమ్మడి హిందూ కుటుంబంలో స్త్రీకి ఆస్తి హక్కు యీ చట్టం కల్పించింది. కొంత మార్పు వచ్చినా సమస్యలు తీవ్రంగానే ఉన్నవి. పురుషాధిక్యత స్త్రీలపైననే కాక పరిపాలన విధానాలలో కూడా వ్యక్తమవుచున్నవి.

ఒంటరిజీవనం సాగించే స్త్రీలల్లో ముఖ్యంగా వితంతువులు అత్యంత అమానుషమైన పరిస్థితులను ఎదుర్కొంటున్నారు. మత పరమైన కార్యక్రమాలలోనికి హిందువులు, ముస్లింలు రెండు మతాలవారు కూడా వితంతువులను రానివ్వరు. స్వయాన ఆమె కుమారుడు లేక కుమార్తె వివాహ సందర్భంగా ముద్రించే పెండ్లి పత్రికమీద కూడా ఆమె పేరును ముద్రించరు. ముద్రించితే చెడు ప్రభావం కలిగిస్తుందని సమాజ భావన. ముస్లిం మతస్తులలో జరుగు పెండ్లి సందర్భంలో పెండ్లికుమార్తె తాను అలంకరించుకున్న ముసుగును అద్దం ముందు తొలగించి పెండ్లి కుమారునికి తన ముఖ బింబాన్ని చూపించాలి. ఆ సమయంలో అచట ఎవ్వరూ వితంతువులు ఉండకూడదు. ఇతర తరగతులలో కూడా సాంప్రదాయాలలో తేడాలున్నా వితంతువుల విషయంలో అందరి అభిప్రాయం ఒకటే.

స్త్రీ యవ్వనంలో ఉన్నప్పుడు భర్త చనిపోతే ఆమే కారణమని తరచుగా ఆమెపై నిందలు వేస్తారు. కఠోరమైన జీవనాన్ని ఆమె సాగించాలి. ప్రకృతి సిద్ధమైన కోర్కెలను, వాంఛలను జీవనాన్ని, ఆనందాన్ని ఆమె అణుచుకోవాలి లేక చంపుకోవాలి. బలమైన ఆహారాన్ని ఆమె తినకూడదు. ఆమెపై రుద్దబడిన అన్ని రకాల నియమాలను, నిబంధనలను ఆమె ఆచరించాలి. చట్టపరంగా రావలసిన కుటుంబ ఆస్తిని ఆమె కోరకూడదు. నమ్రతతో నడుచుకోవాలి. సేవా దృక్పథంతో మెలగాలి. అన్ని రకాల అవమానాలను, అవహేళనలను ప్రశ్నించకుండా ఆమోదించి ఆమె జీవనం సాగించాలి.

## 19వ శతాబ్దంలో సంఘ సంస్కరోణద్యమాలు

బాల్య వివాహాలను, వితంతువుల పునర్ వివాహాన్ని నిషేధించదానికి వయస్సులో ఉన్న వితంతువులను లైంగికంగా వేధించదానికి, సామాజిక, సాంస్కృతిక, మతపరమైన పూజా పునస్కార కార్యక్రమాలలో వితంతువులను పాల్గొనకుండా నిషేధించదానికి సతి దురాచారం కొనసాగుతున్నది. అసమాన ఆస్తి హక్కులు కల్గియుండుట వలన సమస్య మరింత తీవ్రతరమవుచున్నది. ఆస్తిలో వితంతువులకు హక్కు లేకుండా చేయదానికి సమాజంలో అన్ని రకాలుగా ప్రయత్నాలు సాగినవి.

## ప్రస్తుత పరిస్థితి పరిశీలన :

2001 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం దేశ మహిళా జనాభాలో వితంతువులు 9 శాతం ఉన్నారు. దాదాపు 3 కోట్ల 40 లక్షల మంది ఉన్నారు. ఇంత భారీ సంఖ్యలో ఉన్న వితంతువులకు ప్రభుత్వం కొద్దిపాటైన సహాయ సహకారాలు అందించడంలేదు. ఉగ్రవాద, మతచాందసవాదుల దాడుల్లోను, ప్రకృతి ఉపద్రవాల మూలంగాను భర్తలను కోల్పోయిన వింతువులున్నారు. అకస్మాత్తుగా సంభవించిన ఉపద్రవాల మూలంగా వీరు అత్యంత క్రూరమైన పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తున్నది. గత 14 సంవత్సరాలలో వ్యవసాయ సంక్షోభం వలన రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం వలన అనేక లక్షల మందికి పైగా మహిళలు వితంతువులయ్యారు. వీరికి ఎటువంటి ఆర్థిక భద్రతలేదు. వీరి భర్తలు తీర్చలేని అప్పులు వీరికి గుదిబండలై కూర్చున్నవి. ఆదరించేవారు లేక రక్షణలేక చాలామంది వితంతువులు వారణాసి, మధుర, బృందావన్ తదితర ఆశ్రమాలకు వెళ్ళి తలదాచుకొంటున్నారు. వీరు నివశించుచున్న ప్రాంతాలలో వీరు ఎదుర్కొంటున్న బాధలు, ఇబ్బందులు గురించి అనేక అధ్యయనాలు జరిగినవి. నివేదికలు వెలుగులోకి వచ్చినవి. కులపంచాయితీలు వారిని మంత్రగత్తెలుగా చిత్రీకరించి ముద్ర వేసి తీర్మానాలు చేసి వితంతువుల ఆస్తులను కాజేస్తున్నారు. ఇటువంటి సంఘటనలు జార్ఖండ్ రాష్ట్రంలో జరిగినవి. కులపంచాయితీలు పెట్టి 46 మంది సంతాల్ మహిళలను ప్రశ్నించి అందులో ఆస్తిహక్కు కలిగిన 42మందిని మంత్రగత్తెలని నేరం మోపి చంపివేశారు. వితంతువుల సమస్యలను పరిష్కరించదానికి ప్రత్యేకమైన విధానాలు చేపట్టవలసి ఉన్నది.

స్త్రీల వయస్సు పెరిగేకొద్ది వైధవ్యం పొందే వారి సంఖ్య పెరుగుతుంది. వితంతువులలో 5౦ సం.రాల వయస్సుకు పైబడిన వారు 77శాతం మంది యున్నారు. 75శాతం వితంతువుల వీరికి సంబంధించిన కుటుంబాలలో యుంటున్నారు. 10 శాతం వితంతు స్త్రీలు ఒంటరిగా జీవనం సాగిస్తున్నారు. 26 శాతం వితంతువులు ఇంటిలో కాకుండ బయటపనికి వెళ్ళి జీవనం సాగిస్తున్నారు. వీరిలో 20 శాతం మంది వితంతువులు వ్యవసాయ కార్మిక వర్గానికి చెందినవారు. ఇంటి వెలుపలకు వెళ్ళి పనిచేసే జీవనం సాగించే వితంతువులలో 71 శాతం మంది 20-34 సంవత్సరాలు వయస్సు కలిగిన వారుకాగా, 66 శాతం వితంతువులు 35-49 వయస్సు కలిగిన వారుగా ఉన్నారని జాతీయ సర్వే సంస్థ సర్వేచేసి నిర్ధారించింది. ఎంతోకొంత కుటుంబానికి ఆదాయం సంపాదించి పెట్టాలని ఎక్కువ మంది వితంతువులు తక్కువ ఆదాయం యిచ్చే పనులలో పాల్గొంటున్నారు.

వితంతువులలో 78శాతం మంది నిరక్షరాస్యులు. వితంతువులలో కుటుంబ యాజమాన్యాన్ని నిర్వర్తించే వారు 37 శాతం. వీరిలో 67 శాతం మంది 35-49 సంవత్సరాల వయస్సు కలిగిన వారుగా ఉన్నారు. 1995-96 జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే ప్రకారం గ్రామీణ ప్రాంతంలో పనిచేస్తున్న వితంతువులు పట్టణాలలో పనిచేస్తున్న వితంతువులకన్న శారీరకమైన బాధలను ఎదుర్కొంటున్నారు. ముఖ్యంగా వీరు కంటిచూపు సన్నగిల్లటం, కీళ్ళనొప్పులు, దగ్గు తదితర జబ్బులతో వృద్ధ వితంతువులు బాధపడుచున్నారు. పట్టణ ప్రాంతంలో యున్న వృద్ధ మహిళలు దీర్ఘకాలిక శక్తిహీనత జబ్బుతో బాధపడుచున్నారు. వీరి జీవన ప్రమాణం కదు దీనంగా ఉన్నది. స్త్రీల యాజమాన్యం క్రింద యున్న 48 శాతం కుటుంబాల జీవన ప్రమాణాలు తక్కువ స్థాయిలో ఉన్నవి.

## లైంగిక దోపిడి బాధితులు :

మొదటిగా వితంతువులు తాము నివాసముంటున్న ఇండ్లలో తమ మగ బంధువుల నుండి లైంగిక వేధింపులకు గురవుచున్నారు. ఆశ్రమాలలో తలదాచుకున్న వితంతువులను కూడా అక్రమ రవాణాకు వినియోగించుకుంటున్నారు. మధుర, బృందావన్, వారణాసి తదితర ఆశ్రమాలలో జీవనం సాగించుచున్న వితంతువుల గురించి పశ్చిమబెంగాల్ ప్రభుత్వం అధ్యయనం చేసి దిగ్భ్రాంతికరమైన ఈ క్రింది వాస్తవాలను వెలుగులోకి తెచ్చింది. మతపరమైన ఆశ్రయం యిచ్చిన సంస్థలు కూడా వితంతువలను అక్రమ కార్యక్రమాలకు వినియోగించుకొని వ్యాపారం చేసి దోపిడి చేస్తున్నారు. ధనిక, పలుకుబడి కలగిన యాత్రికుల లైంగిక కార్యకలాపాలకు స్త్రీలను సమకూర్చే వ్యవస్థగా దేవదాసి వ్యవస్థ ఉన్నది. మధురలో వితంతువుల ఆశ్రమాలు గర్భవిచ్ఛితి ఆసుపత్రులు మనుగడ సాగించదానికి దోహదపడుచున్నవి. ఈ అధ్యయనం మూలంగా వితంతువులపై లైంగిక దోపిడి ఏ విధంగా సాగుచున్నదో అర్థమయింది. వైద్య సదుపాయం వీరికి దాదాపు లేదనే చెప్పాలి.

పేదరికం, సామాజిక అంశాలకు సంబంధించి రూపొందించిన నివేదికలలోగాని, చర్చావేదికలలోగాని వితంతువుల గురించి అరుదుగా ప్రస్తావించటం జరుగుచున్నది. ఇటువంటి పరిస్థితులలో వితంతవులకు కొన్ని ముఖ్యమైన సహాయ సహకారాలు అందించాలంటే వ్యవస్థాపరమైన సంఘటిత పోరాటాలు చేయటం ద్వారానే సాధ్యపడుతుంది. కొన్ని రాష్ట్రాలు వితంతు, విగత జీవుల పేరు మీద నెలకు 100 రూ నుండి రూ. 250 వరకు పించన్లు యిస్తున్నారు. 20 సంవత్సరాల వయస్సుకు పైబడిన మగ పిల్లలు కలిగిన వితంతువులను ఫించన్లకనర్హులుగా పరిగణిస్తున్నారు. స్వయంపోషక ఉపాధి పనులకు, ప్రాజెక్టు పనులకు హామీ పత్రాలు లేక బాండ్లు వ్రాసి ఇవ్వవలసిఉంటుంది. వితంతువులకు కొన్ని సహాయ సహకారాలు ఎంపిక కాబడిన ప్రజాప్రతినిధుల సిఫార్సులతో అందిస్తున్నారు. ఈ పథకాలన్నీ రాజకీయ అండదండలు ఉంటేనే వస్తాయని అందరికి తెలిసిన విసయం. యవ్వనంలో ఉన్న వితంతువులకు ఒకే దఫా సహకారం అందించటం జరుగుచున్నది. నగదు రూపంలో ఈ సహాయాన్ని అందించాలని ఉన్నా ఎక్కువ రాష్ట్రాలలో కుట్టుమిషన్లు యిచ్చి సరిపెట్టుచున్నారు. కుటుంబ యాజమానత్వం నిర్వహిస్తున్న వితంతువులను ప్రభుత్వ అధికార్లు కుటుంబ యాజమానులుగా గుర్తించటంలేదు. జాతీయ ఉపాధి హామీ

చట్టం క్రింద ఉపాధి పొందడానికి వితంతువులను, వెలివేయబడిన స్త్రీలను నమోదు చేయడానికి అధికార్లు నిరాకరిస్తున్నారని ఐద్వా అధ్యయనంలో బయటపడింది. వితంతువులకు నిర్దేశించిన సామాజిక సంక్షేమ పథకాలు చాలా తక్కువ. పట్టణ ప్రాంతాలకు ఉపాధికోసం వలస వెళ్ళే వితంతు మహిళలకు నివాస కేంద్రాలను ఏర్పాటుచేసి భద్రత కల్పించాలి. వింతువులకు, వెలివేయబడిన మహిళలకు ఒంటరి మహిళలకు రక్షణ గృహాలు గాని, గృహనిర్మాణ పథకాలు దాదాపు లేవనే చెప్పాలి. ఇటువంటి ఏర్పాట్లులేని కారణంగా సంఘ వ్యతిరేక శక్తుల ఆగడాలకు వితంతువులు, ఒంటరి స్త్రీలు బలైపోతున్నారు.

**ఒంటరి, వెలివేయబడిన, విడాకులు పొందిన మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలు :**

మనువు వందలాది సంవత్సరముల క్రితం స్త్రీలు ఆచరించవలసిన నియమావళిని రూపొందించాడు. ఇప్పటికీ యీ నియమావళిని భారత సమాజం ఆచరిస్తున్నది. ఒంటరిగా జీవనం సాగిస్తున్న స్త్రీల పట్ల సమాజం స్నేహపూర్వకమైన ధోరణిని ప్రదర్శించటంలేదు. సమాజ దృష్టి ప్రత్యేకంగా తనపై పడకుండా ఆమె తన జీవనం గురించి చెప్పుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆమె వ్యక్తిగత జీవితం గురించి సమాజం తరచుగా ఆమెను ప్రశ్నిస్తూ ఉంటుంది. పురుషుడు లేకుండా ఆమె ఒంటరిగా జీవిస్తున్నందుకు సమాజానికి కారణాలు తెలియజేయాలి. ఆమె కదలికలన్నింటిని సమాజం గమనిస్తున్నా పురుషాధిక్య సమాజంలో స్త్రీ ఒంటరిగా నిలద్రొక్కుకుని జీవనం సాగించటం కష్టమైన పని. నివాస ప్రాంతంలోను, పనిచేసే చోట కూడ ఆమె వివక్షతకు గురవుతున్నది. వీరికి, ఇండ్లను అద్దెలకు యివ్వడానికి యింటి యజమానులు సాధారణంగా నిరాకరిస్తారు. ఆమె నిష్టత కల్గిన స్త్రీగా ఇంటి యజమానులు నిర్ధారించుకున్న తరువాతనే ఇంటిని అద్దెకు ఇస్తారు. పనిచేసే సాధారణ మహిళలు అందరు లైంగిక వేధింపులకు గురవుతున్నారు. వీరిపై సాగే వేధింపుల కన్న ఒంటరి మహిళలపై ఎక్కువగా లైంగిక వేధింపులుంటాయి. వీరిని సులభంగా లొంగతీసుకోవచ్చుననే ఆలోచనతో వేధింపులు వీరిపై ఎక్కువగా చేస్తారు. సమాజ సాంప్రదాయాలను పాటించటంలేదనే నెపంతో ఒంటరి మహిళలను సమాజం తీవ్రంగా ఆక్షేపించి తమ అభిప్రాయాలకు అనుగుణంగా నడుచుకోవాలంటుంది. ఆఖరికి వారి తల్లిదండ్రులు కూడా వీరిని చులకన భావంతో చూస్తారు. పెళ్ళి చేసుకోకుండా అవివాహితగా ఉండాలనుకున్న ఆడ పిల్లలను తల్లిదండ్రులు నిర్లక్ష్యభావంతో చూస్తారు. ఆమె వివాహమాడకుండ ఉంటే కుటుంబంలోఉన్న ఇతర పిల్లలకు పెళ్ళిళ్ళు చేయటం పెద్ద సమస్య అవుతుందని తల్లిదండ్రులు భయపడుతున్నారు. వివాహమాడకుండా అమ్మాయిలు ఇంటిలో వుండిపోతే కుటుంబానికి తలవంపులు తెచ్చినట్లు భావిస్తున్నారు. ఈ ధోరణికి భిన్నమైన ఆలోచనలు కూడా సమాజంలో ఉన్నవి. మధ్యతరగతి కుటుంబాలలో పెళ్ళికాని అమ్మాయిలు కావలసిన కట్న, కానుకలకు, ఖర్చులకు సరిపడ డబ్బులు సంపాదించిన తరువాతనే పెళ్ళికి సిద్దపడుతున్నారు.

**వదలివేయబడిన స్త్రీలు :**

వదలివేయబడిన స్త్రీలు ముఖ్యంగా పిల్లలతో ఉన్నవారు తాము వదలివేయబడ్డామనే భావనతో మానసికంగా కృంగిపోయి భరించరాని బాధతో క్రుంగిపోతున్నారు. భర్త వదలివేసిన స్త్రీని తల్లిదండ్రులు కూడా చేరతీయటంలేదు. వదలివేయబడిన స్త్రీలు చాలమంది ఆర్థికపరమైన ఇబ్బందులతో సతమతమవుతున్నారు. దీనిమూలంగా తమకుగాని, పిల్లలకు గాని అవసరమైన తిండి, బట్ట ఇతర నిత్యావసర వస్తువులను సమకూర్చుకోలేకపోతున్నారు. శారీరకంగా హింసింపబడి వదలివేయబడిన స్త్రీలే వీరిలో ఎక్కువ మంది ఉంటారు. ఈ మధ్యనే చేయబడిన గృహహింసచట్టం స్త్రీలకు నివాసపు హక్కును చట్టపరంచేసింది. ఈ చట్టం అమలుగావడానికి యిప్పటికి అనేక అడ్డంకులున్నవి. హిందూ వారసత్వ చట్టానికి ఈ మధ్యనే సవరణలు చేయటం జరిగింది. విమర్శనాత్మకంగా దీనిని సమీక్షించి ఇది అమలు జరిగేటట్లు చూడాలి. పోషణకోసం వదలివేయబడిన స్త్రీలు కోర్టులో కేసేస్తే, తీర్పుకు, భరణం పొందడానికి చాలాకాలం పట్టుతున్నది. నోటీసులు యిప్పించి భరణం పొందడం అనేది ఆమెకు శక్తికి మించిన పనిగా వున్నది.

**విడాకులు పొందిన స్త్రీలు :**

విడాకులు పొందిన స్త్రీలు సమాజంలో అనేక రకాలైన సమస్యలను ఎదుర్కొనవలసి వస్తున్నది. వీరికి సమాజం సంపూర్ణ మద్దతు యివ్వడంలేదు. తిరగి పెండ్లిచేసుకోవాలన్నా, కొత్త సంబంధాలు పెట్టుకోవాలన్నా అనేక ఆటంకాలను, అవరోధాలను సమాజంనుంచి వీరు ఎదుర్కొనవలసి వస్తున్నది. వీరు పురుషులతో స్నేహం చేయడాన్ని కూడా సమాజం మరొక అర్థంలో చిత్రీకరించుచున్నది. పురుషులతో వీరికున్న స్నేహాన్ని వక్రీకరించి వీరు అడ్డూ అదుపులేకుండా విచ్చలవిడిగా నీతి బాహ్యంగా తిరుగుతున్నారని సమాజం ముద్రవేస్తున్నది. విడాకులు పొందిన స్త్రీలలో సహజ వాంఛలున్నప్పటికీ కుటుంబం నుండి బహిష్కరణకు గురికావలసివస్తుందనే భయంతో ఒంటరిగా పిల్లలతో జీవనం సాగించాలని కోరుకుంటున్నారు. కుటుంబ పోషణ, బాధ్యతలు రెండూ చేయటం వీరికి కష్టంగా ఉన్నది.

విడిపోయిన, విడాకులుపొందిన, వదలివేయబడిన స్త్రీలు తమ పిల్లలను సంరక్షించుకోవడానిక, విద్యాబుద్ధులు చెప్పించుకోవడానికి అనేక ఇబ్బందులు పడుతున్నారు. శిశువిహారాలు, పగటిపూట పిల్లలను పరిరక్షించుకేంద్రాలు, పనిచేసే ప్రాంతాలలో పాఠశాలలులేని కారణంగా ఒంటరి స్త్రీలు ఈ సౌకర్యాలను పొందలేకపోతున్నారు. ఒక స్త్రీ ఒంటరిగా ఉంటూ పనిచేయాలన్నా, చదువుకోవాలన్నా ఆమెకు రక్షణ ఉండటంలేదు. అందుకని పట్టణాలల్లోను, నగరాలల్లోను తగినన్ని వసతి గృహాలు నిర్మాణం చేయవలసిన అవసరమున్నది. ఇటువంటి అమానుషమైన దుస్థితిని ఎదుర్కొంటూ ఒంటరి జీవనం సాగించే స్త్రీల మానసిక ఆందోళనలను అర్థంచేసుకొన్నప్పుడు వారికి చేయూతనిచ్చే సంస్థల ఏర్పాటు కోసం కృషి చేయగలం.

**చర్చించాల్సిన అంశాలు:**

1. శుభకార్యాలు మతపరమైన కార్యక్రమాలలో వితంతువులను భాగస్వాములను చేయడానికి సమాజంలో ప్రచారం చేయడానికి అవసరమైన సూచనలు.
2. స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలలో కొన్నింటినైనా పరిష్కరించడానికి ముఖ్యంగా యుద్ధాలు, అల్లర్లు, ఉగ్రవాద చర్యల మూలంగా వితంతువులయిన స్త్రీలను గౌరవప్రదమైన పునర్‌నివాసానికి అవసరమైన విధానపరమైన చర్యలు చేపట్టడానికి అవసరమైన సూచనలు :
3. ఉపాధి, ఉద్యోగాలలో ఒంటరి స్త్రీలు పాల్గొనటాన్ని ఏ విధంగా పెంచగలం.

4. పునర్ వివాహాలను పెంచడానికి అనుసరించవలసిన పద్ధతులు, చర్యలు.
5. ఒంటరి స్త్రీల తరపున కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వాల ముందు ఉంచవలసిన కోర్కెలు.

## సాధించుకోవడానికి అనుకూలంగా ఉన్న కొన్ని కోర్కెలు :

1. వితంతువులందరికి ఫించన్లు ఇవ్వాలి.
2. వితంతువులు, భర్త వదలివేయబడిన స్త్రీలకు అన్ని సంక్షేమ పథకాలలో ప్రాధాన్యత యివ్వాలి. ఉదా: దారిద్రరేఖకు దిగువ ఉన్న వారికి ఇచ్చే కార్డులు, ఉపాధి కేంద్రాలు, ఇండ్లపథకాలు, స్వయం ఉపాధి పథకాలు, జాతీయ ఉపాధి హామీ చట్టం పరిధిలో ఉన్న ఉద్యోగాలలో ప్రాధాన్యత ఇవ్వాలి.
3. మానవత్వ కోణంలో వితంతువులకు, ఉద్యోగం, ఉపాధి కల్పించే అంశాన్ని తిరిగి పరిశీలించాలి.
4. ఒంటరి స్త్రీల సంఖ్యకు తగ్గట్టుగా వసతి గృహాలను, హాస్టళ్ళ సంఖ్యను పెంచాలి.
5. ఒంటరి స్త్రీల సంఖ్య, వారి స్థితిగతుల గురించి స్థానిక సంస్థలు అన్నీ వారి పరిధిలో ఉన్న ప్రాంతంలో సర్వే నిర్వహించాలి.
6. వితంతువులు, వదలి వేయబడిన స్త్రీలకు అవసరమైన సంక్షేమ పథకాలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిధులు కేటాయించాలి.

## వితంతువులను సంఘటితం చేయటం - కేరళ అనుభవాలు

భారతదేశంలో వితంతువులకు సంబంధించి 10 సంఘాలున్నవి. భారతదేశంలో వితంతువుల సంఖ్యను బట్టి, వీరిపట్ల ప్రభుత్వం ప్రదర్శిస్తున్న నిర్దయ, నిర్లక్ష్య వైఖరిని దృష్టిలో పెట్టుకొన్నపుడు ఇంకా ఎక్కువ సంఘాలు ఏర్పాటు చేయవలసిన అవసరముంది. ఈ విషయంలో కేరళ అనుభవం ప్రోత్సాహకరంగా ఉంది. కోజికోడ్ జిల్లాలో 2005 సం.లో వితంతువుల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో వితంతువులు తాము అనుభవిస్తున్న కష్టాలు, తమపై సాగుతున్న లైంగిక దోపిడీల గురించి మాట్లాడారు. ఈ సమావేశం తరువాత కైరళి వితంతు సంఘం అనే పేరు మీద సంఘం ఏర్పడింది. ఈ సంఘం ధర్మదాతృత్వ సంఘాల చట్టం క్రింద రిజిస్టరు చేయబడింది. ఆ తరువాత సదస్సును నిర్వహించారు. ఇందులో 1300 మంది వితంతువులు పాల్గొన్నారు. ఈ సదస్సులో తీసుకొన్న నిర్ణయాల ప్రకారం సంఘం యితర ప్రాంతాలకు మల్లాపురం, త్రిశూరు, అల్‌పుజా, పాల్‌గాట్‌లకు విస్తరించింది. ఐద్వా కేరళ శాఖ వితంతువుల జీవన పరిస్థితులను మెరుగుపరచడానికి చర్యలు చేపట్టాలని యు.డి.ఎఫ్. ప్రభుత్వాన్ని కోరుతూ మెమోరాండం యిచ్చింది. అయితే ప్రభుత్వం ఎటువంటి చర్యతీసుకోలేదు. ఆ తరువాత వచ్చిన ఎల్.డి.ఎఫ్. ప్రభుత్వం దృష్టికి పై సమస్యలను ఐద్వా తీసుకొచ్చింది. దీని ఫలితంగా ఎల్.డి.ఎఫ్. ప్రభుత్వం వెంటనే పింఛను డబ్బులను పెంచింది. 20 సంవత్సరాల వయస్సుకు పైబడి మగపిల్లలున్న వితంతువులకు పింఛను ఇవ్వబడదు అనే నిబంధనను తొలగించింది. ఈ విధమైన చర్యలు ఇతర రాష్ట్రాలలో కూడా తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

***

(32వ పేజీ తరువాయి)

## పూలే ఆశయం సమానత్వం - అదే మన లక్ష్యం

స్త్రీల అభివృద్ధికి ఆటంకంగా ఉన్న ప్రత్యేక సమస్యలను ముందు పేరాలో చర్చించాము. వాటికి సంబంధించిన డిమాండ్లను మొత్తం ఉద్యమం యొక్క డిమాండ్లలో చేర్చాలి. అప్పుడే స్త్రీలను కూడా ఉద్యమాల్లో భాగస్వాముల్ని చెయ్యగలం. స్త్రీలను ప్రోత్సహించి నాయకత్వ బాధ్యతలు అప్పగించినపుడు స్త్రీలు కూడా చొరవతో ఉద్యమాల్లో భాగస్వాములు కాగలరు. సగభాగంగా వున్న స్త్రీలు పాల్గొనని ఏ ఉద్యమమూ జయప్రదం కాదు. స్త్రీలు ప్రజా జీవితంలోకి రాకుండా అడ్డుకునే సంస్కృతుల్ని - మనువాద ఆలోచనల్ని కూడా ఎదుర్కోవాలి. ఏ మనువాదమయితే కులపరమైన, ఆర్థిక పరమైన అసమానత్వాన్ని బలపరుస్తుందో అదే మనుధర్మం స్త్రీ స్వేచ్ఛను హరిస్తుంది; శీలం, పాతివ్రత్యం పేరుతో స్త్రీని ఇంటికి కట్టిపడేస్తుంది. స్త్రీ స్వేచ్ఛ కోసం పని చెయ్యని ఏ ఉద్యమం మనువాదాన్ని ఎదుర్కోలేదు. దురదృష్టవశాత్తు మనువాదం - అదే తిరోగమనవాదం వివిధ రూపాల్లో ముందుకు వస్తోంది. సంస్కృతీకరణ ద్వారా, ఒక్క మాటలో చెప్పాలంటే బ్రాహ్మణ్యాన్ని అనుకరించటం ద్వారా సామాజిక గుర్తింపును, గౌరవాన్ని పొందవచ్చని కొందరు భ్రమపడుతున్నారు. ఆవిధంగా మనువాదపు ఉచ్చులో పడుతున్నారు. స్త్రీని పాతకాలపు సాంప్రదాయాలకు కట్టి పడవెయ్యడం, అదే కుటుంబ గౌరవంగా భావించడం మనువాద సంస్కృతిలో భాగమే.

యువత ఈ సంక్లిష్టతల్ని అర్థం చేసికోవాలి. సమస్యల్ని అధ్యయనం చెయ్యాలి. ఈనాడు మన కుటుంబాల్ని, కుటుంబాల్లో స్త్రీలను వేధిస్తున్న కట్నాలు, మితిమీరిన పెళ్లి ఖర్చులు, మైనరు బాలికల వివాహాలు, మద్యపానం వంటి వ్యసనాలకు వ్యతిరేకంగా ఉద్యమించాలి; ఇప్పటికే సాగుతున్న ఉద్యమాల్లో ఈ సమస్యలు అంతర్భాగం కావాలి. స్త్రీ పురుష అసమానతలతో కూడిన సమాజాలు అభివృద్ధి చెందవు. స్త్రీ సమానత్వం సాధన దిశగా ఉద్యమాలు వచ్చినప్పుడే సమాజం ముందుకు పోతుంది.

జ్యోతిబా పూలే వంటి సంస్కర్తలు స్త్రీల అసమానత్వాన్ని, కులవివక్షను ఎదిరించారు. ఇంటినుండే సంస్కరణ ప్రారంభించారు. ఆరోజుల్లోనే సామాజిక కట్టుబాట్లను ఎదిరించి, భార్య సావిత్రీబాయికి స్వయంగా ఆయనే చదువు చెప్పారు. ఆడపిల్లలకి బడిపెట్టి, బడిలో పిల్లలకి పాఠాలు చెప్పమని ప్రోత్సహించారు. ఆ కారణంగా ఇంటి నుండి వెళ్ళగొట్టబడ్డారు. కులమతాలకు అతీతంగా వ్యవహరించారాయన. అతి బాల్య వివాహాల కారణంగా చిన్న వయసులోనే వితంతువులయిన బ్రాహ్మణ యువతుల పట్ల సానుభూతి చూపారు. వంచనకు గురై గర్భవతులయిన బ్రాహ్మణ యువతులకు జ్యోతిబా పూలే దంపతులు తలిదండ్రుల్లాగా వ్యవహరించారు; పురుళ్ళు పోశారు. ఇంట్లో యధాతథంగా ఉంటూ ఇంటి బయట ఉపన్యాసాలతో సరిపెట్టుకోలేదు. సంఘాన్ని ఎదిరించి అష్టకష్టాలు పడ్డారు. అందుకే ఇప్పటికీ మనం పూలే వంటి మహనీయుల్ని తలచుకుంటున్నాం. వారి ఆశయాల బాట మనందరికీ అనుసరణీయం కావాలి.

***

# ఈ నేల మాదే... ఒరిస్సా ఆదివాసీ మహిళల గనుల పోరాటం

- సుధాకిరణ్.బి.

కొండలు పగలేసినాం... బండలనే పిండినాం... మానెత్తురు కంకరుగా ప్రాజెక్టులు కట్టినాం.. దొర ఏందిరా వాడి దొరతనమేందిరా... తెలంగాణా సాయుధ పోరాటంలో దొరల దౌర్జన్యాలకు కడుపు మండిన పేదల గుండె మంటే ఆపాట... పాలకులు మారారు. కాని వారిదమన నీతి మారలేదు. ప్రపంచీకరణ నేపధ్యంలో ప్రతి పనిలో సగభాగంగాఉన్న మహిళలు తమ హక్కుల సాధనకు పోరాటాలే వేదికలంటున్నారు. ఆ పోరాటాల్లో తమ సత్తా చూపుతున్నారు. పాలక వర్గాలకు ముచ్చెమటలు పట్టిస్తున్నారు. తాము దేనికీ తగ్గేది లేదని నిరూపిస్తునారు. ఆకోవలోకి చెందిందే ఐద్వా అండతో 'ఒరిస్సా' ఆదివాసీలు చేస్తున్న పోరాటం.

'ఒరిస్సా' (ఒకప్పటి కళింగదేశం) అపారమైన ఖనిజసంపద ఈ రాష్ట్రం సొత్తు. ఇక్కడ గనుల్లో చీమలబారుల్లా అమాయకులు, నిరక్షరాస్యులు అయిన ఆదివాసీలు తండాలు తండాలుగా పని చేస్తారు. ప్రాణమున్న యంత్రాల్లా కష్టపడతారు. నిఖార్సయిన సరుకు నేలమీదకు తెస్తారు. రెక్కల కష్టం తప్ప మరేమీ తెలీని వీరి అమాయకత్వం గనుల యాజమాన్యంకి సొమ్ము చేసుకోవడానికి బాగా కలిసొచ్చింది. నామ మాత్రపు వేతనాలతో అర, కొర సౌకర్యాలతో వీరితో చాలా చాకిరీ చేయించారు. ఇదంతా ఒకప్పటి మాట...



'ఈ నేల మాదిరో' ఇపుడు ఒరిస్సా ఆదివాసీ నివాస ప్రాంతాలలో మారు మ్రోగుతున్న నినాదం. ఈ నినాదంతో అక్కడి మహిళలు పోరుబాట పట్టారు. ఇదేదో భూపోరాట నినాదం కాదు. ఆదివాసీల జీవితంలో భాగమై, వారి సంస్కృతిలో ఒకటిగా కలిసి పోయిన గనుల పరిరక్షణ కోసం వారు నడుం కట్టారు. 'ఖండధార జలపాతం', 'కోయిలా' నదీ పరివాహక ప్రాంతంలో ఉన్న గనులే అక్కడి ఆదివాసీల జీవనాధారం. పురుషులతోపాటు స్త్రీలు ఉదయం నుండి గని పనుల్లో నిముగ్నమవుతారు. 65% ఆదివాసీ మహిళలు గనుల్లో పనులు చేస్తున్నారంటే వాటితో వారి జీవితం ఎంత మమేకం అవుతుందో అర్ధం అవుతుంది. ఆదివాసీల జీవితంలో పెనవేసుకుపోయిన గనుల మీద ప్రయివేటీకరణ భూతం కన్ను పడింది. ఆధునిక యాంత్రీకరణ పేరుతో దాదాపు 30వేలమంది మహిళలకు ఉద్వాసన పలికింది. మహిళల తిరుగుబాటును ఊహించని యాజమాన్యం పురుషులతో సమానంగా మహిళలు పనిచేయలేరనే సాకుతో వారిని ఇంటికి పంపాలని నిర్ణయించింది.

ఇది తెలిసిన ఆదివాసీ గూడాల్లో అగ్గి రగిలింది. బ్రతుకు తెరువు పోయి బ్రతికే మార్గం లేక చచ్చేకన్నా పోరాడాలనే నిర్ణయించుకున్నారు. సహజంగానే ఈ పోరాటానికి ఐద్వా అండదండలిచ్చింది. ఆడవారికి గనుల్లో పనులు కల్పించాలని, గనుల ప్రయివేటీకరణ నిలిపివేయాలని 'ఈ నేల మాదిరో' అంటూ ఐద్వా నాయకత్వంలో ఆదివాసీ మహిళలు తిరుగుబాటు బావుటా ఎగురవేశారు. ఈ పోరాట పటిమ గురించి ఆ రాష్ట్ర ఐద్వా నాయకురాలు 'తాపోషి ప్రరఖారాజ్' చెప్పిన వివరాలు....

## ఏం జరిగిందంటే:

ఒరిస్సా రాష్ట్రం పోరాటాలకి క్రొత్తేమీ కాదు. రూర్కెలా స్టీలు ప్లాంట్ నిర్మాణంలో కాంపెన్‌సేషన్ కోసం చేసిన నిర్వాసితుల పోరాటం కాల్పులదాకా వెళ్ళిన చరిత్ర ఉంది. ఖండధార జలపాతం, (ఒరిస్సా రాష్ట్రం మొత్తానికి మంచినీరు వనరు) కోయిలా నదీ పరివాహక ప్రాంతానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ప్రకృతి అక్కడ పరవశించి ఆడుతుంది. అటు అడవి ఇటు నదీ తీర ప్రాంతం.. ఆ ప్రకృతిలో మమేకం అయ్యి ఆదివాసీలు జీవనం.. సహజ వనరులే వారి జీవనోపాధికి మార్గాలయ్యాయి. కోయిలా నది సమీపంలో ఉన్న గనుల్లో పని కొన్ని తరాల తరబడి ఆదివాసీల జీవితంలో భాగంగా మారాయి. గని పనుల్లో అక్కడి మహిళలు ఆరితేరారు. స్వాతంత్రం రాకముందునుండే 'టాటా'ల లీజులో ఉన్న గనులు ఆదివాసీల జీవనోపాధికి ఏమాత్రం భంగం రాలేదు. లీజు కాలం ముగియడంతో గనులను పూర్తిగా ప్రయివేటీకరించాలని ప్రభుత్వం నిర్ణయించింది. దక్షిణ కొరియాకి చెందిన కంపెనీకి కట్టబెట్టింది. ఇక్కడి సామాన్యుల జీవితంతో ఏమాత్రం సంబంధం లేని ఆ కంపెనీ తన దైన పద్దతుల్లో మార్పులు తీసుకొచ్చింది. గనులను 100శాతం యాంత్రీకరించడం, పెద్ద ఎత్తున ఉత్పత్తి సాధించే లక్ష్యంతో వీరు నదీ పరివాహక ప్రాంతంలో ఫ్యాక్టరీ కట్టడం మొదలు పెట్టింది. దీని వల్ల ఒరిస్సా రాష్ట్రం మొత్తనికి జీవధారలైన ఖండధార, కొయిలా నదులు ఎండి పోతాయి. అంతే కాకుండా 3 గ్రామ పంచాయితీలను ఆ కంపెనీకి కట్టబెట్టింది. స్థానిక ప్రజలకు ఒక్క రూపాయి కూడా నష్టపరిహారం చెల్లించకుండా వారిని గ్రామాలు వదిలి వెళ్ళమని ఆదేశాలు జారీ చేసింది. మరో వైపు పెద్ద పెద్ద పొక్లెయినర్‌లు, బెల్ట్



కన్వర్టర్‌లు అక్కడికి చేరడం ప్రారంభయయ్యాయి. జీవిత కాలంలో తామెప్పుడూ చూడని యంత్రాలు అక్కడ ప్రత్యక్షం కావడంతో ఆదివాసీలలో గుబులు ప్రారంభయయ్యింది. ఏదో జరగబోతుంది అనుకునే లోపలే యంత్ర సామగ్రి వద్ద ఆదివాసీలు పనిచేయలేరని ఆ కంపెనీ అధికారులు నిర్ణయించారు. మహిళలు ఈ పనికి అసలే పనికి రారన్నది వారి వాదన. దాంతో మహిళలను పనిలోనుండి తీసేశారు. పురుషులకు కూడా శిక్షణ ఇచ్చి దానిలో సఫలీకృతులయితేనే పనిలో పెట్టుకుంటామని చెప్పారు. యజమానుల దమన నీతిని గమనించని ఆదివాసీల్లో పురుషులు కొద్దిమంది యాజమాన్యానికి వత్తాసు పలికారు. మరో వైపు సంవత్సరాల తరబడి రెక్కలు ముక్కలు చేసినా కరగని భూమి తమ కళ్ళ ముందే కదిలిపోతుండటం ఆదివాసీలను నివ్వెర పరిచింది. అటు పనిపోవడం, ఇటు గని సంపదను 'గుందుగుత్తగా' కంపెనీ తరలిస్తుండటం వారిని కలవర పరిచింది. ప్రకృతి సంపదను పొదుపుగా వాడుకుంటేనే భూమిపై మనుగడ సాగిస్తామన్న వారి సాంప్రదాయ ఆలోచకు భిన్నంగా త్రవ్వకాలు సాగుతుండటంతో వారిలో కదలిక మొదలైంది. తరతరాల వారసత్వ సంపదను పరిరక్షించుకోవాలన్న తపన ఒకవైపు, పొట్టకూటి కోసం ఏదో ఒక పని చేసుకోవాలన్న ఆరాటం ఒకవైపు నిరంకుశ గని యజమాన్యంపై తిరుగుబాటు బావుటా ఎగుర వేసేలా చేసింది. ఎక్కువ శాతం పని కోల్పోయింది మహిళలే కాబట్టి పోరాటంలో వారు ముందు భాగాన నిలిచారు. విచ్చలవిడి త్రవ్వకాలను ఆపేయాలని, గని పనులలో మహిళలకు భాగస్వామ్యం కల్పించాలని, విదేశీ కంపెనీల ఆధిపత్యం ఉండకూడదన్న నినాదంతో మహిళలు పోరాట రంగంలోకి దిగారు.

## ఇలా ప్రారంభమయ్యింది

ఒరిస్సా ఆదివాసీల పోరాటం ఒక్క రోజుతో ఏమీ ఊడి పడలేదు. దీని కోసం ఐద్వా పెద్ద ఎత్తున కృషి చేసింది. గనులలో పని చేసే వారిని గ్రూపులు గ్రూపులుగా సమావేశ పరిచారు. పోరాట పటిమ నేర్పారు. ఐద్వా చేసిన కృషి వారిని సంఘటిత పరిచింది. పని కోల్పోయిన మహిళల్లో ఆగ్రహం అవధులు దాటింది. అయితే యాజమాన్యం చూస్తూ ఊరుకోలేదు. ఐద్వా కదలికల్ని తెలుసుకున్న యాజమాన్యం స్థానిక పోలీసులతో కలసి పెద్ద ఎత్తున నిర్బంధానికి దిగింది. కొన్ని సందర్భాలలో తండాలకు వెళ్ళడం కూడా ఐద్వా కార్యకర్తలకు కష్టమయ్యేది. అప్పటికే ఆదివాసీ ప్రాంతాలలో తయారయిన ఐద్వా కార్యకర్తలు ఈ కృషిని మరింత వేగవంతం చేశారు. తీవ్ర నిర్బంధాలేవీ ఆదివాసీల వట్టును సడలించలేకపోయాయి. తమ డిమాండ్స్ పరిష్కరించాలని త్రవ్వకాలను అడ్డుకోవడమే కాకుండా ఎక్కడికక్కడ ఆదివాసీలు గ్రూపులుగా విడిపోయి చేస్తున్న పోరాటం కంపెనీ పనులు సాగించడమే కష్టంగా మారడంతో వారు పెద్ద ఎత్తున బెదిరింపులకు దిగారు. ఒరిస్సా ప్రభుత్వం కూడా కంపెనీ విధానాలకు అనుకూలంగా మాట్లాడటంతో పరిస్థితి మరింత ఉద్రిక్తమయ్యింది. ఆదివాసీలకు మద్దతిస్తున్న ఐద్వా కార్యకర్తలను అరెస్టు చేయడం జైళ్ళకు పంపడం సాధారణ విషయం అయ్యింది. దీనికి తగ్గట్టుగానే అక్కడి మహిళలు స్పందిస్తున్నారు. ఉద్యమం ఆపేది లేదని తమ హక్కులు సాధించేంత వరకు పోరాడతామంటున్నారు ఇపుడు ఒరిస్సా ఆదివాసీ నివాస ప్రాంతమంతా ప్రయివేటీకరణ వ్యతిరేక నినాదాలతోను, పర్యావరణ పరిరక్షణ సూత్రాలతోను మారుమ్రోగుతోంది.

## ఎందుకిలా!...

ఒరిస్సా ఆదివాసీలు ప్రయివేటీకరణకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున కదలడానికి కారణం ... వారిప్పటికే ప్రయివేటీకరణ దుష్ఫలితాలు చవిచూస్తున్నారు. రాష్ట్రంలో విద్యుత్‌ను ప్రయివేటు యాజమాన్యం చేతిలో పెట్టారు. దీనిపై ప్రయివేటు కంపెనీలు పట్టు సాధించాయి. అంతకు ముందు పబ్లిక్ సెక్టార్‌లో ఉన్న విద్యుత్ మారు మూల పల్లెల్లో కూడా వెలుగుల్ని నింపింది. కానీ ఇపుడు వాటి నిర్వహణ ప్రైవేటు కంపెనీలకు లాభదాయకంగా లేదు. వాటిని తొలగించాలని ఆలోచిస్తున్న సమయంలో కొన్ని సంవత్సరాల క్రితం వచ్చిన తుఫాను ఆయాచిత వరంగా మారింది. అపుడు పడిపోయిన విద్యుత్ పోల్స్ ఇప్పటికీ తిరిగి వేయలేదు. 'జగత్‌సింగ్‌పూర్', 'కేంద్రాపడా' జిల్లాల్లోని చాలా గ్రామాల్లో తుఫాను దెబ్బ తరువాత ఇప్పటికీ కరెంటు లేదు. మరోవైపు హెచ్.టి. (హైటెన్షన్) లైన్లు వేసి గని కంపెనీలకు విద్యుత్ సదుపాయాల్ని కల్పిస్తున్నారు. ఇలా ప్రయివేటీకరణ దెబ్బను చవి చూసిన ఆదివాసీ మహిళలు తాము వెనక్కి తగ్గేది లేదంటున్నారు.



సంఘటితమైన మహిళలు విజయాలు సాధించిన చరిత్ర మన దేశంలో తక్కువేమీ కాదు అందుకే మేం విజయం సాధిస్తాం.. అంటూ ముగించారు ఐద్వా రాష్ట్ర నాయకులు 'తాపోషి ప్రఘురాజ్'.

# రాజ్యాధికారం కోసం పోటీ



డిశంబర్ 10 మానవ హక్కుల దినం సందర్భంగా విశాఖ ఐద్వా జిల్లా కమిటీ ఆధ్వర్యంలో జరిగిన 'మహిళలు- పేదరికం' అను సదస్సులో ప్రసంగిస్తూ రాజ్యాధికారం కోసం మహిళలు పోటీ పడాలని జాతీయ మహిళా కమిషన్ సభ్యురాలు, పార్లమెంట్ సభ్యురాలు, ఐద్వా కేంద్ర కమిటీ సభ్యురాలైన మాలినీ భట్టాచార్య అన్నారు. ప్రపంచీకరణ విధానాల వల్ల నిరుద్యోగం పెరుగుతోంది. వ్యవసాయరంగంలో సంక్షోభం ఏర్పడుతోంది వీటన్నింటికీ ముందుగా బలవుతున్నది మహిళలే. పురుషుడు సంపాదించి తెచ్చే ఆదాయం కుటుంబ పోషణకు చాలకపోవడంతో మహిళలు ఉపాధి, ఉద్యోగాల కోసం బయటకు రావాల్సివస్తోంది, వారి అవసరాన్ని యాజమాన్యాలు సొమ్ము చేసుకుంటూ తక్కువ వేతనాలకు ఎక్కువ పనిచేయించుకుంటున్నారు. మహిళల సమర్థతపట్ల చిన్న చూపు ఉండటం వల్ల పురుషులతో సమానంగా పనిచేస్తున్న శ్రమకు తగ్గ ప్రతిఫలం దక్కడంలేదు. పేదరికానికి, ఇతర సమస్యలకు సామాజిక అసమానతలే కారణం. సమాజంలో స్త్రీ పురుషులిద్దరికీ సమాన భాగస్వామ్యం కోసం ఐద్వా పోరాటాలు చేస్తోంది.

ఇటీవల దయేరియాతో ఎక్కువమంది పిల్లలు చనిపోతున్నారు. అందులోనూ ఆడపిల్లలు ఎక్కువగా ఉంటున్నారు. పౌష్టికాహార లోపంతో మరణిస్తున్నవారిలో ఆడపిల్లల సంఖ్య ఎక్కువగా ఉంది. లింగ వివక్షే ఇందుకు కారణం. ప్రజాపంపిణీ వ్యవస్థను ప్రభుత్వాలు నిర్వీర్యం చేయడంతో ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. అధిక ధరల వల్ల బాధింపుబడుతున్నది కూడా మహిళలే.. వారిలో రక్తహీనత వంటి జబ్బులకు పౌష్టికాహారలోపమే కారణం. పేదరికం మహిళలను బలవంతంగా వ్యభిచారంలోకి నెడుతోంది. గ్రామీణ ప్రాంతాల్లో ఈ జాడ్యం బాగా విస్తరిస్తోంది. కుటుంబ అవసరాలను ఆసరా చేసుకొని ఢిల్లీ, ముంబాయి వంటి నగరాల్లో ఉద్యోగాలిప్పిస్తామని ఆశచూపించి మహిళలను వ్యభిచారంలోకి నెట్టేందుకు కొన్ని సంస్థలు దేశవ్యాప్తంగా తన నెట్‌వర్క్‌ను విస్తరించుకున్నాయి.

మహిళలకు ప్రత్యేకంగా కొన్ని హక్కులు, చట్టాలు ఉన్నప్పటికీ ఆచరణ లోపం వల్ల నిరుపయోగంగా మారాయి. ఆర్థిక సామాజిక రంగాలతోపాటు స్త్రీ, శిశు సంక్షేమ శాఖలో విద్య, వైద్యం కొరకు బడ్జెట్ కేటాయింపులు పెంచితేనే మహిళల స్థితిగతులు కాస్తంతయినా మెరుగుపడే అవకాశముందని ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రొఫసర్ శ్రీమతి ఎం నళిని అన్నారు. మహిళలకు ఆహారాన్ని దూరం చేయడం, వైద్య ఆరోగ్య రంగాలకు కేటాయింపులు తగ్గించడం, సమానపనికి సమాన వేతనం ఇవ్వకపోవడం మానవ హక్కుల ఉల్లంఘున కిందికే వస్తుంది. 34శాతం మంది మహిళలు కుటుంబపోషణ కోసం తక్కువ ఆదాయంతో ఎక్కువ పనిచేస్తున్నారు. పని ప్రదేశంలో ఎదురవుతున్న వేధింపులకు కుటుంబం కోసం భరిస్తున్నారు. అయినా సమాజంలో వీరు సముచితమైన గౌరవానికి నోచుకోవడంలేదు. తమ హక్కుల సాధన కోసం మహిళలు సంఘటితం కావాలి.

జాతీయ ఉపాధి హామీ పథకంలో మహిళలకు ప్రాధాన్యత కల్పించాలని, భూమి మీద జాయింట్ పట్టా యివ్వాలని, ప్రభుత్వ గృహాలను మహిళల పేరిట ఇచ్చినపుడే పేదరికం నిర్మూలన సాధ్యమవుతుందని సదస్సులో పిలుపునిచ్చారు. ***

# క్విట్ ఇండియా ఉద్యమం

-కె. ప్రతిమ

1631వ సంవత్సరంలో ఇంగ్లీషు వారు మన దేశానికి వ్యాపార నిమిత్తం వచ్చారు. ఆ తరువాత 1858వ సంవత్సరంలో సిపాయి తిరుగుబాటు తరువాత భారతదేశపు అధిపత్యం ఈస్ట్ ఇండియా కంపెనీ చేతుల్లోంచి బ్రిటిష్ రాణి అధిపత్యం లోనికి వచ్చింది. భారత దేశం బ్రిటిష్ సామ్రాజ్యంలో ఒక భాగంగా మారింది. చివరికి బ్రిటిష్ వారు 1947లో (మన) భారతదేశాన్ని విడిచారు. ఆ 90 ఏళ్ళ పరిపాలనలో ముఖ్యంగా చివరి 50సం॥లు జాతీయ సమరయోధులు, బ్రిటిష్ పరిపాలకులు మధ్య నిరంతర పోరాటాలు సాగాయి. అప్పట్లో మహాత్మాగాంధీ ఉపయోగించిన కొత్త అయుధాలు సత్యాగ్రహం, అహింస, సహాయ నిరాకరణోద్యమాల వల్ల భారత ప్రజానీకం మొత్తం స్వతంత్ర పోరాటంలో భాగస్వాములు అయ్యారు. ఎన్ని వత్తిడులు వచ్చినా బ్రిటిష్ సామ్రాజ్యం తన అధిపత్యాన్ని కొనసాగించింది. రెండవ ప్రపంచ యుద్ధంలో భాగస్వామ్యం వహిస్తూ వత్తిడులకు గురిఅవుతూ కూడా బ్రిటిష్ సామ్రాజ్యం భారత దేశంపై తన పట్టువిడవలేదు. ఆ తరుణంలో అగస్ట్8, 1942లో బొంబాయ్ నగరంలో జరిగిన ఎఐసిసి సెషన్‌లో "క్విట్ ఇండియా' అన్న నినాదాన్ని తీర్మానించారు. బ్రిటిష్ ప్రభుత్వం దీన్ని చాలా తీవ్రంగా తీసుకుని ఆ మరుసటి రోజు ఆగస్ట్ 9న స్వాతంత్ర్య పోరాటానికి అధిపత్యం వహిస్తున్న నాయకులందరినీ అదుపులోకి తీసుకుని రహస్యంగా దేశవ్యాప్తంగా ఉన్న జైళ్ళకు తరలించినది. బ్రిటిష్ ప్రభుత్వ చర్యలవల్ల దేశ ప్రజానీకం మొత్తం అగ్రహం చెందింది. ఏ నాయకత్వం లేకుండానే సామాన్య ప్రజలు తమకు తోచిన పద్ధతులలో పోరాటాలు సాగించారు. కొంతమంది గాంధేయవాద పద్ధతులలో సత్యాగ్రహాలు, హర్తాళ్ళు, మీటింగులు, ఊరేగింపులతో పోరాడితే మరి కొందరు రైల్వే స్టేషన్‌లు, పోస్టాఫీసులు, గవర్నమెంట్ ఆస్థులను ధ్వంసం చేసి తమ అగ్రహాన్ని తెలిపారు. ఈ సంఘటనలకు బ్రిటిష్ ప్రభుత్వం స్వతంత్ర పోరాటాన్ని అణచేందుకు అమాయక ప్రజలపై లాఠీచార్జిలు, కాల్పుల ద్వారా తన తీవ్రతను చూపింది.

భారత స్వాతంత్రోద్యమంలో క్విట్ ఇండియా ఉద్యమం ఒక ఉజ్వల ఘట్టం. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వలస పాలనకు వ్యతిరేకంగా సమస్త భారత జాతి అత్యంత చైతన్యపూరిత తిరుగుబాటు, పోరాటం అది. చివరకి చిన్నారి బాల విద్యార్థులు 9,10 సంవత్సరాల వయసు బాలలు కూడా క్విట్ ఇండియా, క్విట్ ఇండియా అని పాఠశాలల గోడల మీద రాసి ఆ ఉద్యమంలో తమ మాతృదేశ విముక్తిని కోరుకున్నారు. దేశంలో మెజార్టీగా వున్న ప్రజలు అనగా శ్రామిక జనావళి ఉవ్వెత్తున లేచి తమకుతోచిన రూపాల్లో బ్రిటిష్ పాలనను అంతమొందించాలని తమ తెగువను చూపారు.

కానీ దేశంలో జస్టిస్ పార్టీ బ్రిటిష్ ప్రభుత్వానికి మద్దతుగా స్వాతంత్రోద్యమానికి వ్యతిరేకంగా పనిచేసింది. ఈనాడు కూడా ఆ జస్టిస్ పార్టీ అనుకూల రాజకీయ శక్తి దేశంలో విచ్ఛిన్నకర శక్తిగా సామ్రాజ్యవాదులకు అనుకూలంగా కుట్రలు చేస్తూ అశేష త్యాగాలతో సాధించుకున్న దేశ స్వాతంత్ర్యాన్ని తిరిగి సామ్రాజ్యవాదులకు అప్పగించే ప్రమాదకర శక్తిగా పనిచేస్తోంది. నిజమైన దేశభక్తియుత ప్రజానీకం, మేధావి వర్గాలు అప్రమత్తతతో స్వాతంత్ర భారతాన్ని కాపాడుకునేందుకు ముందుకు రావాలి. మన కులమత రహిత లౌకిక రాజ్యాంగాన్ని రక్షించుకోవాలి.

1942వ సంవత్సరంలో వేలాదిమంది పాల్గొన్న ఆ పోరాటం చరిత్రలో చోటు చేసుకుంది. ఆ సంవత్సరంలో సామాన్య ప్రజానీకం చూపిన ధైర్య సాహసాలు మన దేశపు ధైర్య సాహసాలని మరోసారి ప్రపంచానికి చాటి చెప్పాయి.

*(జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా చిన్న సమాచారం.)*

***



# చైతన్యజ్వాలను రగిలించిన భూపోరాటం

## ప్రకాశం

భూపోరాటంలో మా ప్రాణాలు పోయినా పర్వాలేదు. పేదోడికి భూమి దక్కాలి.... అందుకోసం ఎన్ని రోజులయినా నిద్రాహారాలు మాని ఉంటాం. భూఉద్యమాన్ని విజయవంతం చేస్తాం.... ఇవి భూసమస్య పరిష్కారం కోరుతూ అద్దంకిలో ఐదురోజులుగా నిరవధిక నిరాహార దీక్షలో కూర్చున్న తమ్మినేని అన్నపూర్ణ, వంకాయలపాటి ప్రమీల, బొడ్డా జయమ్మ అన్నమాట. మహిళలకు ఎన్నో హామీలు ఇచ్చారు. ఇప్పుడు మహిళలని కూడా చూడకుండా లాఠీలతో విరగ్గొట్టారు. ఒంగోలు ఇళ్ళస్థలాల పోరాటంలో పాల్గొని చెయ్యి విరిగిన లక్ష్మీ ఆవేదన. చూపించటానికి వీలుకాని ప్రాంతంలో కుళ్ళపొడిచారు. అయినా జానెడు జాగా వచ్చేంతవరకు పోరాడుతానంటుంది అంకమ్మ" పేదలకు ఇళ్ళస్థలాలు ఇవ్వాలని అడిగిన ప్రతిసారి జైలుకు పంపుతున్నారు. ఇప్పటికి 24 రోజులు జైల్లో ఉండి 4 కేసులకు కోర్టుల చుట్టూ తిరుగుతున్నా భయపడకుండా, లాఠీలు, తూటాలు ఉద్యమాలను ఆపలేవు భూపోరాటం కొనసాగిస్తానంటుంది. ఒంగోలు పద్మ పట్టణకార్యదర్శి పి.శైలజ, ఇలా ప్రకాశంజిల్లాలో వేలాది మంది మహిళలు భూపోరాటంలో పాల్గొని లాఠీలు, అరెస్టులు, జైళ్ళు ఎదిరించి పోరాడి విజయం సాధించారు.

### జిల్లాలో ప్రభుత్వ భూ పంపిణీ ఎలా ఉంది

జిల్లాలో 19లక్షల ఎకరాల సాగుకు యోగ్యమైన భూమి ఉంది. అందులో 13లక్షల ఎకరాలు సాగులో ఉంది. 1.5 లక్షల ఎకరాలు భూమి పేదలకు పంపిణీచేయటానికి సిద్ధంగా ఉన్నట్లు, 6ఏళ్ళ క్రితం జిల్లా కలెక్టరుగారు ప్రకటించారు. ఈ పాటికే సాగులో ఉన్న భూమికి పట్టాలు ఇచ్చారు. ఎ.హనుమంతుని పాడు మండలం మిట్టపాలెంలో 9మందికి పట్టాలు ఇచ్చారు. భూమి చూపలేదు. మన పోరాడిన ఫలితంగా భూమిచూయించారు. జిల్లాలో ఉన్న ప్రభుత్వ భూములు పేదలకు పంచకుండా పెద్దలకు రొయ్యలచెరువులకు, ఇసుక క్వారీలకు అప్పనంగా కట్టబెడుతున్నారు. అందుకే పేదలు ఐక్యమై భూమికోసం పోరాడుతున్నారు.

### భూపోరాటం ఎలా జరిగింది?

జిల్లా మొత్తం 148 కేంద్రాలలో 23,896 ఎకరాలు 18,385 మందితో భూ ఆక్రమణ జరిగింది. దీనిలో 80శాతం మంది మహిళలు పాల్గొన్నారు. 12 మంది 3రోజులుపాటు రిమాండ్‌కు వెళ్ళారు. 10మంది 3రోజుల నుండి 6రోజులపాటు నిరాహారదీక్షలలో పాల్గొన్నారు. వందలాది మంది అరెస్టు అయినారు. ఒంగోలు కలెక్టర్ ఆఫీసు ముందు వంట చేసి అక్కడే ఉండటం, మార్కాపురంలో నిరంతరం ఇళ్ళస్థలాల కోసం ధర్నాలు, కందుకూరు ఉప్పుచెరువుల పట్టాల కొరకు ఆందోళన సాగింది. దర్శి, గిద్దలూరు, యర్రగొండపాలెం, కొండ ప్రాంతాల్లో భూ ఉద్యమం చాలా మిలిటెంట్‌గా జరిగింది.



### భూపోరాట ఫలితాలు

ఒంగోలు పట్టణంలో మన ఆందోళన తరువాత కేశవరాజు కుంటలో 200 మందికి పట్టాలు ఇచ్చారు. 825 మందికి కొప్పోలు రోడ్డులో స్థలాలు చూపించి ఇందిరమ్మ పథకం క్రింద ఇళ్ళుకట్టిపెడుతున్నారు. 18 కాలనీలు సర్వే చేసి 2050 మందిని అర్హులుగా ప్రకటించారు. మార్కాపురంలో 10 ఎకరాల్లో 250 మందితో గుడిసెలు వేయించారు. 100 మందికి ఇళ్ళస్థలాలు ఇచ్చారు. లెందుకూరులో 350 మందికి పట్టాలు ఇచ్చారు. పామూరులో ఆర్.ఎస్. పురం మండలాలు సాగుభూమిలో కందిపంటలేశారు. అద్దంకి మన పోరాటం తర్వాత 350 మంది అర్హులను గుర్తించి లిస్టు ప్రకటించారు.

<u>ముగింపు :</u> జిల్లాలో భూపోరాటం మహోద్యమంగా సాగింది. కొన్ని ఫలితాలు సాధించారు. అయితే ఇంకా వేలాదిఎకరాల ప్రభుత్వ భూములు భూస్వాములు, పెత్తందారులు స్వాధీనంలో ఉన్నాయి. ఇళ్ళస్థలాలు, సాగుభూమి సాధించాలంటే పేదలంతా ఐక్యంగా పోరాడాలి.

**కె. సుబ్బరావమ్మ,** ఐద్వా ప్రకాశం జిల్లా కార్యదర్శి

### పోరాటం ఆగదు

ఇంటి పట్టాలు ఇచ్చేంత వరకు భూ పోరాటం ఆగదని ఐద్వనాయకురాలు అరుణమ్మ తెలిపారు. అనేక మంది ఇళ్ళు లేని అర్హులైన పేదలున్న వారిని పట్టించుకోకుండా కాంగ్రెస్ నాయకులు. వారి అనుచరులకు మాత్రమే ఇళ్ళు ఇస్తున్నారని ఆమె ఆరోపించారు.



కూలిచేస్తు జీవనం సాగించే పేదలు ఇళ్ళ స్థలాలు కొనేపరిస్థితి లేదన్నారు. అద్దె ఇండ్లలో ఉన్నటువంటివారు అద్దెలు చెల్లించలేక దుర్భర జీవితాన్ని గడుపుతున్నారని అన్నారు. సి.పి.ఎం. పార్టీ నిర్వహించిన భూపోరాటంలో పేద ప్రజలు పెద్దఎత్తున పాల్గొన్నారు.

**అరుణమ్మ,** పెనుకొండ



పేదలకు ఇళ్ళ స్థలాల కోసం ఒంగోలు పట్టణంలో జరిగిన ఆందోళనలో అరెస్టయి 15 రోజులు రిమాండ్‌కి వెళ్ళారు. జైలులో వున్నప్పుడు మహిళలు మమ్మల్ని చూద్దానికి వచ్చి మాకు ఎంతో మనోధైర్యాన్ని కల్పించారు. ఇళ్ళ స్థలాలు సాధించేవరకు అవసరమైతే జైళ్లకు వస్తామని చెప్పారు. ఇది మమ్మల్ని ఎంతో ఉత్తేజ పరిచింది.

**కరి సృజన**, ఒంగోలు

నేను 2సార్లు జైలుకు వెళ్ళాను. 16 రోజులు జైలులో ఉండటం జరిగింది. జైలుకు మొదట వెళ్ళినప్పుడు మా వాళ్ళు,అత్త, బావలు కొంత బాధపడ్డారు. మన అమ్మాయి పేదప్రజల కోసం జైలుకు వెళ్ళింది. కాని నేరం చేసికాదు అని అర్థం చేసుకొని సంతోషపడ్డారు.

మొదట జైలుకు వెళ్ళినప్పుడు నాతోపాటు 6గురు మహిళలు జైలుకు రావటం జరిగింది. మమ్ములను నెల్లూరు జైలుకు పంపించారు. అక్కడ 12 రోజులు జైలులో ఉన్నాము. రెండవసారి భూపోరాటంలో



భాగంగా పేదలకు ఇండ్లస్థలాలు యివ్వాలని పోరాటం చేసి గుడిసెలు వేసినందుకు అరెస్టు చేసి జైలుకు పంపటం జరిగింది. రెండవసారి ఒక్కదానినే వెళ్ళటం జరిగింది. ఒంగోలు జైలులో 4రోజులు ఉన్నాను. జైలులో ఉన్న మహిళా ఖైదీలతో పరిచయాలు చేసుకొని మన సంఘ విషయాలు చెప్పి మనం చేసే పోరాటాలు వివరించడం జరిగింది. పేదలకు ఇండ్ల స్థలాలు యివ్వమని అడిగితే అరెస్టుచేసి జైలుకు పంపారు. అని చెప్పినప్పుడు అక్కడ ఉన్న మహిళా ఖైదీలు చాలా బాధపడ్డారు. ఆతరువాత నన్ను చాలా ప్రేమగా ,గౌరవంగా పలకరించటం జరిగినది. మన పాటలు అడిగి మరీ పాడించుకున్నారు. జైలర్‌గారు విజిట్‌కు వచ్చినప్పుడు ఈ అమ్మాయి పేదలకు ఇండ్లస్థలాలు యివ్వమని పోరాటం చేసి జైలుకు వచ్చింది. వాళ్ళను గౌరవంగా చూస్తారు ఎవరైనా అని అక్కడ ఉన్న మహిళా ఖైదీలకు చెప్పటం జరిగినది.

ఇండ్ల స్థలాలు పోరాటంతో జైలుకు వెళ్ళి వచ్చిన తరువాత మహిళలు వచ్చి మా కోసం, మీరు దెబ్బలు తిని జైలుకు వెళ్ళారా అని బాధపడినారు. వాళ్ళ అప్యాయత అనురాగం ఎన్నటికీ మరచిపోలేము. వాళ్ళ అప్యాయతను చూసిన తరువాత ఇండ్ల స్థలాలు సాధించేవరకు పోరాటం చేయాలనిపించింది. పేదల కోసం పని చేయటంలో ఉన్న ఆత్మతృప్తి మరిక్కడ ఏ పనిచేసినా దొరకదు అనిపించింది.

**యు.ఆదిలక్ష్మి**, ఐద్వా ఒంగోలు డివిజన్ కార్యదర్శి

ఇండ్ల స్థలాల పోరాటంలో 2003 లో మొట్టమొదటిసారిగా ప్రకాశం జిల్లాలో జైలుకు వెళ్ళిన నేను 4సార్లు 25 రోజులు జైల్లో వున్నాను.మొదటిగా ఒంగోలుజైలులో పాడుపడిన సెల్లో నన్ను ఒక్కదాన్నే వుంచారు. ఆసెల్‌లో బాత్ రూమ్స్‌లేవు. గబ్బిలాలు తిరుగుతూ వున్నాయి. ఆరోజు రాత్రి భాదపడుతూ పడుకున్నాను. మరుసటి రోజు నెల్లూరు జైలుకు తరలించారు. ముక్కుపుడకతో సహాతీయించారు. అప్పుడు చాలా భాదపడ్డాను. నాతో వచ్చిన కానిస్టేబుల్ లోపల ఖైదీ పేరు చెప్పి నాపేరు చెప్పు నిన్ను బాగా చూసుకుంటారంది. లోపల ఖైదీలు నన్ను బాగానే చూసుకున్నారు.

రెండవసారి జైలుకు వెళ్ళినప్పుడు నాతో 6గురు మహిళలు వున్నారు. అందరూ కొత్తవాళ్ళే. ఇళ్ళస్థలాల సమస్యపై మొదటిగా పరిచయమైన విజయలత చాలా బాధపడింది. తన భర్త వైపునుంచి ఇబ్బందులు వస్తాయని ఏడ్చేది. దాదాపు 13 రోజులు నెల్లూరు జైల్లో వున్నాము. జైలుకు



వెళ్ళిన తరువాత మా నాన్న మా బందువులు వైపునుంచి అనేక రకాలుగా మాట్లాడారు. మానాన్న నన్ను పట్టుకొని బోరున ఏడ్చి మనకుటుంబం పరువు తీస్తున్నావు. నీవు ఒక్కదానివని గారాబంగా పెంచాము. ఆడవాళ్ళు జైలుకు వెళ్ళడం ఏంటి. బందువుల్లో ఏమని చెప్పుకోవాలని బాధపడ్డాడు. కాని మా అమ్మ మాత్రం మన అమ్మయికాని పని చేసి జైలుకు వెళ్ళలేదు. ప్రజల సమస్యమీద వెళ్ళింది. నీ వేమీ బాధపడవద్దు అని మా అమ్మనాకు ధైర్యం చెప్పింది.

ఇళ్ళ స్థలాల సమస్యపై అరెస్టు అయిన తరువాత మహిళలు ఏడుస్తూ వచ్చి మీరు మాకోసం దెబ్బలు తింటున్నారు. జైళ్ళకు వెళుతున్నారు. మాకు ఇళ్ళ స్థలం రాకపోయినా పర్వాలేదు. మీకు ఏమి కాకూడదని ఏడ్చారు. నావైపు నుంచి కూడా వీరిని ఇన్ని సార్లు భూమిలోకి తీసుకుకెళ్ళి పోలీసులచేత లాఠీ చార్జీ చేయించాము. కాని ఒక్కళ్ళకి కూడా ఒక సెంటు భూమి ఇప్పించలేకపోయాము. మరలా మనం పిలిస్తే పోరాటంలోకి వస్తారా అని ఫీలయ్యాను. కాని మున్సిపల్ ఆఫీసువద్ద పికిటింగ్ రోజు మహిళలు తండోపతండాలుగా వచ్చారు. మమల్ని అరెస్టు చేస్తుంటే మాకు అడ్డుపడి 24మంది కొత్తవాళ్ళు పోలీసులకు ఎదురు తిరిగి అరెస్టయ్యారు. మేము జైలుకు వెళ్ళడానికి సిద్ధం అని ధైర్యంగా చెప్పటం చూసాను. మాకు బెయిల్ వచ్చినతరువాత బైటకు వస్తే జనం చూపే ఆదరణ, అప్యాయతను చూసి ఏమైనా వాళ్ళకు ఇళ్ళస్థలాలు వచ్చేవరకు పోరాటంలో ముందుండాలని నిర్ణయించుకోవడం జరిగింది.

**పి. శైలజ**, ఐద్వా ఒంగోలు పట్టణ కార్యదర్శి



ఇండ్ల స్థలాల పోరాటంలో 3రోజులు జైలుకు వెళ్ళటం జరిగింది. పోరాటంలో పాల్గొని జైలుకు వెళ్ళటం ఎలాంటి బాధ కల్గించలేదు. కాని జైలులోపలకు వెళ్ళేటప్పుడు తాళి తీసివేయించడం నాకు బాధ అనిపించినది.

**ఎ. సీతామహాలక్ష్మి**, ఒంగోలు



ఇండ్ల స్థలాల పోరాటంలో 3రోజులు ఒంగోలు జైలులో ఉన్నాను. అరెస్టు అయినప్పుడు బాధ అనిపించలేదు. 3సం॥పాపను వదిలి 3రోజులు జైలులో ఉన్నప్పుడు పాప గుర్తుకువచ్చి నాకు బాధ అనిపించింది.

**జి. ఆదిలక్ష్మి**

ఒంగోలు



ఇండ్లస్థలాల పోరాటంలో 3రోజులు ఒంగోలు జైలులో ఉన్నాను. గతంలో జైలుకు వెళ్ళటానికి అవకాశం రాలేదు. జైలుకు వెళ్ళిన తరువాత ప్రజల ఆప్యాయతను చూసి ప్రజాసమస్యలమీద ముందుండి పనిచేయాలని పించింది. ఇండ్ల స్థలాలు సాధించేవరకు కృషి చేస్తాను.

**ఎస్.కె. రషీద**, ఒంగోలు



నేను 2సార్లు 15 రోజులు జైలులో ఉన్నాను. మొదటిసారి 12రోజులు నెల్లూరు జైలులో ఉన్నాను. నాతోటి 6గురు మహిళలు జైలుకు వచ్చారు. మా అమ్మమ్మ జైలుకు వెళ్ళినందుకు ఇంటికి వచ్చి తిట్టింది. మా బంధువులు కూడా బాధపడ్డారు. రెండవ సారి ఇండ్లస్థలాల పోరాటంలో 3రోజులు ఒంగోలు జైలులో ఉన్నాను. ప్రజల ఆదరణ చూసిన తరువాత పేద ప్రజల సమస్య మీద పనిచేయటానికి ఇండ్లస్థలాల సమస్య పరిష్కరించేవరకు నావంతు కృషి చేస్తాను.

**ఎస్.కె.నాగర్‌భీ**, ఐద్వా ఒంగోలు డివిజన్ అధ్యక్షురాలు



మాది ప్రకాశం జిల్లా కందుకూరు. నాపేరు మల్లిక. నేను ముస్లిం మహిళను. నేను కందుకూరులో సి.పి.ఎం. పార్టీ తరుపున ఇళ్ళస్థలాల సమస్యల పరిష్కారం కోసం నిరాహారదీక్షలో 6రోజులు పాల్గొనడం జరిగింది నేను దీక్షలో పాల్గొనడం మా ఆయనకు తెలియదు. కూర్చున్న తర్వాత మా ఆయన నాదగ్గరకు వచ్చి నువ్వు ఆకలికి ఉండలేవు. అని ఏడ్చారు. ఈ దీక్షలో చనిపోయిన పర్వాలేదు అని అనుకున్నాను.

**షేక్ మల్లిక**, కందుకూరు



నాపేరు గోహర జాన్. నేనుకూడ దీక్షలో 6రోజులు పాల్గొన్నాను. మేము ముస్లిం మహిళలము. దీక్షలో కూర్చుంటే మా చుట్టు పక్కలవారు. వీళ్ళు ముస్లింలు కారు. వీళ్ళు బజారు ఎక్కి దీక్షలో కూర్చున్నారు అని ఎగతాళి చేసారు. మా ఆయన ఏమి అనలేదు. నాకు చిన్న అబ్బాయి కూడ ఉన్నాడు. మాకు ఇంటిస్థలాలు వచ్చేదాకా సి.పి.ఎం. పార్టీ చేసే కార్యక్రమాలలో పాల్గొంటునే ఉంటాము. కావాలంటే మా ప్రాణాలు అయిన ఇవ్వడానికి మేము సిద్ధంగా ఉన్నాము.

**గోహరజాన్**, కందుకూరు



నాపేరు షంషాద్. నేను కూడ కందుకూరులో 6రోజులు దీక్షలో పాల్గొన్నాను. మేము ముస్లిం మహిళలము మేము సి.పి.ఎం. పార్టీ కార్యక్రమాలలో పాల్గొంటా ఉంటే అందరు ఎగతాళి చేసారు. అయినా మేము దానికి లెక్కచేయలేదు. మేము మా కోసం పేద ప్రజల కోసం ఇంటి స్థలం సమస్య పరిష్కారం కోసం దీక్షలో పాల్గొన్నాం.

**షంషాద్**, కందుకూరు

## అనంతపురం

### ప్రజా పట్టుదల ముందు ప్రభుత్వం తలదించక తప్పదు

అనంతపురం జిల్లాలో జరిగిన భూపోరాటంలో పాల్గొన్న వారిలో అత్యధికులు మహిళలే. స్వంత ఇల్లు. కొంతైనా సాగుభూమి దక్కాలనే. అందుకొరకు లాఠీ దెబ్బలు, కేసులు, జైళ్ళకు వెళ్ళారు. ఎన్నికల ముందు పాలక పార్టీలో ఇస్తున్న హామీలు అమలు కాకపోవడం, తమ బ్రతుకులు రోజు రోజుకీ దిగజారుతుండడం పేద మహిళల అనుభవం. జిల్లాలో వర్షంపై ఆధారపడిన వ్యవసాయం కావడంతో కరువులు నిరంతరం ప్రజలతో సహజీవనం చేస్తున్నాయి. పల్లెలలో పనులు దొరకక పోవడం, దురాచారాలు, మూఢనమ్మకాలు, ముఠాతగాదాలు వల్లె ప్రజలను తరిమి వేస్తున్నాయి. దీనివల్ల పట్టణాలకు వలసలు పెరిగాయి ఇలాంటివారికి నివాసస్థలం ఒక ప్రధాన సమస్యగా మారింది. పని దొరకడమే కష్టమౌతుంటే అందులో ఇంటి బాడుగకే ఎక్కువ మొత్తం ఖర్చు అవుతుంది. దీనికి తోడు బాడుగ ఇల్లు దొరకాలంటే కులం, వృత్తి ఆటంకాలుగా వుంటున్నాయి. వీటన్నిటి ఫలితంగానే స్వంత ఇంటికోసం అంత పట్టుదల .తమకు ఇంటి స్థలం దక్కాలంటే పోరాడాల్సిందేనని, అందుకు సంఘటితం కావలసిందేనని నేర్చుకున్నారు. పోలీసులు, అధికారులంటే భయపడేవారు ఎదిరించి మాట్లాడారు. జైలుముఖం చూడని వారు చంటిబిడ్డలతో జైళ్ళకు వెళ్ళి వచ్చారు.

అనంతపురం, గుంతకల్లు, కదిరి, రాయదుర్గం పట్టణాలతో పాటు గుత్తి, కుందేరు, పెనుగొండ, తనకల్లు, మణుగూరు, గార్ల దిన్నె, ఉరవకొండ, తదితర మండలాలో భూపోరాటం ఉధృతంగా సాగింది. అన్యాక్రాంతమైన ప్రభుత్వ భూములను గుర్తించి ఎర్రజెండాలు పాతి గుడిసెలు వేయడం జరిగింది. అనంతపురం నగరంలో 9 ప్రాంతాల్లోని 63 ఎకరాల్లో ఇలా గుడిసెలువేసారు. ఇళ్ళపని తొందరగా చేసి స్థలాల దగ్గరికి వచ్చి తమ గుడిసెలను కాపాడుకోవడం, భవన నిర్మాణం పనికి వెళ్ళి వచ్చేటప్పటికి ఎంత రాత్రైనా గుడిసెలు దగ్గరికి వచ్చేవారు. మహిళల్లో ఇంత కదలిక, పట్టుదల కాంగ్రెస్ నాయకుల్లో ఆందోళన కలిగించింది. పోలీసులను ఉసిగొల్పారు. తెల్లవారు జామున అయితే అరెస్టులు చేయడం తేలిక అనుకున్నారు. శత్రు దేశాలపై యుద్ధానికి వచ్చిన వారిలాగా వందల మంది పోలీసులు ప్రజలపై దాడులు చేయడం, వస్తువులను వేసినట్లు వాహనాల్లోకి కుక్కడం, ద్వారా ఈ ఉద్యమాన్ని అణిచివేయవచ్చని పాలకులు భావించారు. కాని ఈ అంచనాలు మాత్రం ఫలించలేదు.

అగష్టు 12న నగరంలో భూ ఉద్యమం ప్రారంభమైంది 500 మంది మహిళలు సర్వే నెంబరు 116 లో గుడిసెలు వేసారు. 14వ తేది తెల్లవారు జామున గుడిసెలు తొలగించి 14 మంది పురుషులను ఇద్దరు మహిళలను అరెస్టు చేసి రిమాండ్‌కు పంపారు. దీంతో ప్రజల్లో భయం కాదు పట్టుదల పెరిగింది. మరల 16వ తేది 5చోట్ల భూ స్వాధీనోద్యమం సాగింది. సర్వే నెంబర్ 119 ని దొంగపట్టా పొందిన వ్యక్తిపై ప్రజలు ఫిర్యాదు చేయగా మండల రెవెన్యూ అధికారి ఎస్.ఐ.సమక్షంలో విచారణ జరిపి ఆ పట్టా దొంగదని తేల్చారు. ఇది

పేదలకు ఇస్తామని అధికారులు హామీ ఇచ్చారు. అయితే రాజకీయ ప్రోద్భలం అవినీతి కలగలిసేప్రజలపై కేసు పెట్టారు. అలాగే 156 సర్వేనెంబరు స్థానిక ఎం.ఎల్.ఏ. ట్రస్టు పేరుతో ఆక్రమించుకొనే ప్రయత్నం చేయడంతో సి.పి.ఎం.ఆధ్వర్యాన ఆ భూమిలో గుడిసెలువేశారు. తొలగించిన 116సర్వే నెంబరుతోపాటు మరో 5 ప్రాంతాలలో గుడిసెలు వేయడంతో పోలీసులు ఒకేసారి అన్ని ప్రాంతాల్లో గుడిసెలు తొలగించేందుకు పెద్దఎత్తున వచ్చారు. వందల మందిని అరెస్టు చేసి 96 మంది పై నాన్‌బెయిల్‌బుల్ కేసులు పెట్టారు. ఇందులో 22 మంది మహిళలు ఉన్నారు. 82 సంవత్సరాల లక్ష్మమ్మతోపాటు 9నెలల సాయిప్రియ వుండటమే ఈ ప్రభుత్వ నిర్భంధ విధానానికి నిదర్శనం. అరెస్టు అయిన రెండు రోజులు పోలీసు స్టేషన్‌లో వుంచుకొని ప్రభుత్వ పెద్దల ఆదేశాల మేరకు అక్రమ కేసులు బనాయించారు.

అనంతపురం సబ్ జైలులో పెడితే ఆందోళన పెరుగుతుందని భావించి కడపకు వీరిని పంపారు. అక్కడ జైలు ఖాళీగా వుండక పోవడంతో తిరిగి అనంతపురం తెచ్చారు. ఈ రకంగా 18 గంటలు వాహనాల్లో 96మందిని కిందకు దిగకుండా తిప్పారు. మహిళలను బహిర్భూమికి కూడా పంపలేదు. ఎవరికీ అన్నం పెట్టలేదు. చంటి బిడ్డ పాల కోసం ఏడుస్తుంటే కూడా పోలీసులు కనికరించలేదు. సాయంత్రం అనంతపురం కోర్టుకు తిరిగి తీసుకువచ్చారు. జడ్జికి జరిగిందేంటో బాధితులు చెప్పారు. దాంతో జడ్జి పోలీసులను తీవ్రంగా మందలించి రాత్రికి అన్నం తెప్పించి ప్రత్యేక అనుమతితో తాడిపత్రి సబ్‌జైలుకు పురుషులను, రెడ్డిపల్లి సబ్ జైలుకు స్త్రీలను పంపారు. 11 రోజులు బెయిల్ రాకుండా ప్రభుత్వ లాయర్ అడ్డుపడ్డాడు. ప్రజలపై ఇంతటి తీవ్ర నిర్భందానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తూనే తిరిగి అదే స్థలాల్లో గుడిసెలు వేసుకుని నేటివరకు కాపాడుకుంటున్నారు. ప్రజా స్వామ్యత ముందు ప్రభుత్వం తలవంచక తప్పదనేది రుజువై తీరుతుంది.

సావిత్రి , ఐద్వా జిల్లా కార్యదర్శి

**కళ్యాణమ్మ**



12 రోజులు జైలులో వున్నాను. స్దలము ఇవ్వకుండా 12 రోజులు కాదు కదా! నెల అయిన జైలులో ఉంటాము. మా ఆర్థిక పరిస్థితులు బాగులేవు. బాడిగ కట్టలేకున్నాము. బాడుగ 1000రూ॥లు పిల్లలను చదివించాలి. బాడుగ కట్టాలి.

**యశోదమ్మ**



ఇళ్ళ స్దలము ఇచ్చేదాకా పోరాడతాను. 12రోజులు జైలులో ఉన్నా. మా ఆయన సరిగా పనికిపోడు. పోయినపుడు పుల్లుగా తాగివస్తాడు. బాడుగకట్టలే కున్నాము. నేను 4 గొర్రెలను మేపుకుంటున్నాను. పనిచేయలేను. ఆరోగ్యం సరిలేదు.

**మల్లక్క**



ముసిలివాల్లము. బాడుగకట్టలేకున్నాము. ఇల్లు వుంది. కొడుకులు ఇంట్లో జేరుకుని ముసలివాల్లను గెంటివేశారు. స్దలము కావాలి.

**ప్రమీల**



స్థలము ఇవ్వకుంటే ప్రాణాలు ఇవ్వదానికైనా సిద్దమే. 116 సర్వే నెంబరులో స్థలము గవరమెంట్ ఇవ్వకుంటే గట్టిగా కలిసికట్టుగా అందరము పోరాడుతాము.

**నర్సమ్మ**



జైలుకు అయినపోతాము. బాడుగలు కట్టలేకపోతున్నాము. ఇళ్ళపనికి పోతాను. కొడుకులు, బిడ్డలు ఎవరూ బువ్వపెట్టరు. ముసిలిదాన్ని అయిన మంచాన పడితే గుడిసె ఉంటే ఎవరో ఒకరు బువ్వ పెడతారు అనే నమ్మకముతో 5 నెలల నుండి ఇక్కడే స్థలంలో రాత్రి పూట పడుకుంటున్నాను. పగల అంతా వెల్లిపోతా. రాత్రి స్థలము దగ్గర పడుకుంటాను.

**చిట్టెమ్మ**



గుడిసెలు ఇచ్చేదాకా పోరాటం చేస్తాము. 4 నెలల నుండి పనికి పోతుంటే తిని తినక గుడిసెల దగ్గర కాపలావుంటూన్నము. ఈ స్థలము ఇవ్వకుంటే 2రోజులు కాదు నెల రోజులు అయిన జైలుకు సిద్దము.

**జైతూన్‌బీ**



మా ఆయనకు కళ్లు కానరావు. నడవలేదు. నేను రెండవ భార్యను. ఇల్లు లేదు. నేను పనిచేయడానికి నాకు వల్లు బాగుండదు. కొడుకులు అంతో ఇంతో దబ్బులు ఇవ్వరు. దాంతో కాలం ఎల్లిపోతుంది. బాడుగ కట్టలేకున్నా.

# హైదరాబాద్

## నిర్బంధాలు, నిరంకుశత్వం భూ పోరాటాన్ని అణచలేవు

రాష్ట్ర వ్యాప్తంగా గత 6 నెలలుగా పేద ప్రజలకు ఇళ్ళ స్థలాల కోసం 195 ప్రజాసంఘాల ఆధ్వర్యంలో జరుగుతున్న భూపోరాటంలో హైదరాబాదు నగరంలో పేదలు ముఖ్యంగా మహిళలు విశేషంగా పాల్గొని ఉవ్వెత్తున పోరాటాలలోకి వస్తున్నారు. ఇటీవల కాలంలో ఎంతో సుదీర్ఘంగా సాగుతున్న ప్రజా పోరాటంలో ప్రజలు ఇంత పెద్ద సంఖ్యలో పాల్గొనటాన్ని చూస్తుంటే సమస్య ప్రాధాన్యత, తీవ్రత ఏమిటో అర్థమవుతుంది.

గ్రామాలలోఉపాధి కల్పించడంలో ప్రభుత్వం విఫలం కావడంతో హైదరాబాదు నగర చుట్టు ప్రక్కల జిల్లాల నుండి ప్రజలు పెద్ద ఎత్తున రాజధాని నగరానికి ఉపాధి వెతుక్కుంటూ వలసలు వస్తున్నారు. ఇలాంటి వారు నగర వ్యాపితంగా లక్షల సంఖ్యలో వున్నారు. నల్గొండ, వరంగల్, కరీంనగర్, మహబూబ్‌నగర్ తదితర జిల్లాల నుండి 15-20సం॥ల క్రితం నగరానికి వచ్చి చిన్న చిన్న పనులు చేసుకుంటూ నగరంలోని అరకొర సదుపాయాలతో, చాలీచాలని వేతనాలతో కాలం వెళ్ల దీస్తున్నారు. పురుషులు రిక్షా, ఆటో, భవన నిర్మాణ కార్మికులుగా, అడ్డమీద కూలీలుగా పనులు చేస్తుంటే మహిళలు ఎక్కువమంది ఇళ్ళలో పాచి పనులు, కూరగాయలు అమ్మేవారుగా, పూలు అల్లేవారుగా, అగరబత్తీలు తయారుచేసేవారుగా రకరకాల వృత్తులు చేసుకుంటూ రోజువారీ కూలీలుగా లక్షల సంఖ్యలో వున్నారు. ఏళ్ళ తరబడి పనిచేస్తున్నా వుండడానికి స్వంత ఇళ్ళు లేక పెరుగుతున్న ధరలతో పోటీ పడలేక ఇంటి అద్దెలు భరించలేక అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఒక్క గదిలోనే కుటుంబ సభ్యులంతా (భార్య, భర్త, అత్తమామలు, పిల్లలు) తలదాచుకుంటున్నారు. మురికి వాడలలో ఇరుకు గదులలో రోగాల బారిన పడుతూ అవస్థలు పడుతున్నారు. ప్రభుత్వం అధికారంలోకి వచ్చేముందు ఇళ్ళు లేని వారందరికీ ఇళ్ళ స్థలాలు ఇస్తామని వాగ్దానం చేసింది. ఇళ్లు లేని పేదలు ఆశగా ఇంటి స్థలం వస్తుందని దరఖాస్తులు పెట్టుకున్నారు. దఫదఫాలుగా కలెక్టర్లకు, ఎం.ఆర్.ఒ.లకు, కమిషనర్లకు అర్జీలు పెట్టుకొన్నా ప్రభుత్వం నుండి ఏ మాత్రం స్పందన లేకపోవడంతో అనివార్యంగా పోరాట మార్గాన్ని ఎంచుకున్నారు.

మే 6వ తేదీన హైదరాబాదు నగర వ్యాపితంగా 6 కేంద్రాల్లో ప్రభుత్వ స్థలంలో గుడిసెలు వేసుకోవడానికి 30 వేలమంది కదిలివచ్చారు. రోజు రోజుకి ఈ సంఖ్య పెరుగుతూ వచ్చింది. 3 నెలలపాటు లక్షమంది 15 కేంద్రాలలో ఇంటి స్థలం కోసం పోరాడారు. ఈ పోరాటంలో 90 శాతం మంది మహిళలు పాల్గొన్నారు. పగలు, రాత్రి అక్కడే వుండి ఏదేమైనా ఇంటి స్థలం సాధించాలనే పట్టుదలతో వున్నా ప్రభుత్వం స్పందించకపోవడంతో జులై 10,11 తేదీలలో ఇందిరాపార్క్ వద్ద అఖండ మహాధర్నా నిర్వహించారు. పాల్గొన్న వారిలో 90 శాతం మంది మహిళలు వున్నారు. వారు అక్కడే వంటలు చేసుకొని అక్కడే పడుకొని రెండురోజులపాటు ధర్నా నిర్వహించారు. అయినా ప్రభుత్వంలో స్పందన కనిపించలేదు.

పోరాటం ప్రారంభమై 60 రోజులు పూర్తైన సందర్భంగా 660 కేంద్రాలలో నిరాహారదీక్షలు జరిగాయి. కలెక్టరు కార్యాలయాల వద్ద పికెటింగ్‌లు నిర్వహించారు. పోలీసులు పాశవికంగా లాఠీచార్జి చేశారు. మహిళలని కూడా చూడకుండా మగ పోలీసులు వారిని ఈడ్చివేసి అరెస్టులు చేశారు. నిరవధిక నిరాహార దీక్షలలో హైదరాబాదు నగరంలో అనేకమంది నాయకులతోపాటు 10 మంది మహిళలు 6 రోజులు నిరాహారదీక్షలలో పాల్గొన్నారు. వారి ఆరోగ్యాలు క్షీణిస్తున్నా ప్రభుత్వం సమస్య పరిష్కారానికి పూనుకోకుండా జులై 27వ తేదీ అర్ధరాత్రి వారిని బలవంతంగా అరెస్టులు చేసింది.

జవహర్ నగర్‌లో 9నెలల నిండు గర్భిణి గుడిసె వేసుకొంది. ప్రసవించిన తరువాత నెల రోజుల బిడ్డతో సహా తిరిగి గుడిసె వేసుకోవడానికి మరల వచ్చింది. ఉప్పల్‌లో 65 సం॥ల మహిళ పోలీసుల తోపులాటలో పడిపోతావని హెచ్చరించినా నేను చనిపోయినా ఫరవాలేదు, నాకొడుక్కైనా ఇంటి స్థలం కావాలని చెప్పింది. సమస్య పరిష్కారానికి ప్రభుత్వం పూనుకోకపోవడంతో నిరసనగా జులై 28వ తేదీన రాష్ట్ర వ్యాప్త బంద్ చేస్తున్న ప్రజలపై హైదరాబాదులో మొజాం జాహి మార్కెట్ వద్ద పోలీసులు అశ్వీక దళాలతో వచ్చి వాటర్ క్యానన్‌లు, టియర్ గ్యాస్‌లు ప్రయోగించారు. అయినా ప్రజలు వెనుదిరగకుండా వారిని త్రిప్పికొట్టారు. అదేరోజు ప్రశాంతంగా జరుగుతున్న రాస్తారోకోపై ముదిగొండలో పోలీసులు పాశవికంగా దాడిచేసి కాల్పులు జరిపి 9మందిని పొట్టనపెట్టుకున్నారు. ప్రజలు ముఖ్యంగా మహిళలు ఈ సంఘటనతో భయపడిపోయి ఉద్యమం లోంచి వెనుదిరుగుతారని ప్రభుత్వం భావించింది. కాని ముదిగొండ కాల్పులకు నిరసనగా మరుసటిరోజు హైదరాబాదులో జరిగిన ర్యాలీలో మహిళలు రెట్టించిన పట్టుదలతో పాల్గొని ప్రాణాలు పోయినా సరే ఇళ్ళ స్థలాలు సాధిస్తామని నినదించారు.

స్వాతంత్ర్య దినోత్సవం 60వ వార్షికోత్సవాల సందర్భంగా 60వేలమందితో ఆగస్టు 15వ తేదీన సికింద్రాబాద్ నుండి చార్మినార్ వరకు నిర్వహించిన మానవహారంలో మహిళలు తండోపతండాలుగా పాల్గొని 60ఏళ్ళ స్వాతంత్ర్యం తరావాత కూడా 60 గజాల స్థలం కోసం పేదలు 6 నెలలుగా పోరాడుతున్నా పట్టించుకోని ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని ఎలుగెత్తి నిరసించారు.

ఆగస్టు 22వ తేదీన రెండవ విడత భూ పోరాటం ప్రారంభమైంది. ఉద్యమం ఇంకా క్రొత్త ప్రాంతాలకు విస్తరించింది. 3 నెలల పోరాట ఫలితంగాప్రభుత్వం 638 జివొని తెచ్చింది. జిఓలో కిరాయి ఇళ్లలో ఉండేవారికి ఇళ్ళు లేవని, తెల్ల రేషన్ కార్డు తప్పనిసరి అనే నిబంధనలు పెట్టింది. ఈ జిఓకు నిరసనగా హైదరాబాద్ మున్సిపల్ ఆఫీసువద్ద పెద్ద ఎత్తున ధర్నా నిర్వహించగా జిఓను సవరించి 658జిఓను తెచ్చారు. దీని ప్రకారం కిరాయి ఇళ్ళలో వుండే వారికి కూడా ఇళ్ళిస్తామని, తెల్ల రేషన్ కార్డు తప్పనిసరని నిబంధన పెట్టారు. ఈ జిఓను సవరించాలని అర్హులైన పేదలందరికీ రేషన్ కార్డుతో నిమిత్తం లేకుండా ఇళ్ళివ్వాలనీ మంత్రిగారికి మెమోరాండం ఇవ్వడానికి సెప్టెంబరు 9వ తేదీన బంజారాహిల్స్ వెళుతున్న దారిని మధ్యలోనే అడ్డగించి ముళ్ళ తీగలు వేసారు. ఉదయం 7గం॥లకే 40వేలమంది ప్రజలు అక్కడికి చేరుకున్నారు. అందులో పాల్గొన్న 1,000మంది మహిళలను పోలీసులు అరెస్టు చేశారు. మహిళలను విచక్షణారహితంగా ఈడ్చి లాఠీచార్జి చేశారు. అనేక మందికి దెబ్బలు తగిలాయి.

## మహిళలపై పోలీసుల పైశాచికత్వం

పోరాటంలో పాల్గొంటున్న మహిళలపై పోలీసులు అనేకరకాల దౌర్జన్య చర్యలకు దిగుతున్నారు. మహిళా కానిస్టేబుళ్ళను చాలా సందర్భాలలో వినియోగించడంలేదు. మహిళల చీరలు, జాకెట్లు పట్టుకుని లాగడం, చున్నీలు మెడలకు వేసి ఈడ్చడం, గుండు సూదులతో గుచ్చడం, జుట్లు పట్టి ఈడ్చడం, పరుష పదజాలాలు వాడడం, దుర్భాషలాడడం మొదలైనవి చేస్తున్నారు. మహిళలపట్ల వై.యస్ ప్రభుత్వానికి వున్న చిత్తశుద్ది ఏంటో దీన్ని బట్టి తెలుస్తుంది. వేలాదిమందిని అరెస్టులు చేశారు. 37మందిని వారం రోజుల పాటు జైలులో పెట్టారు. అనేక మందిపై అక్రమ కేసులు బనాయించారు.

## పోరాట ఫలితమే ఇందిరమ్మ ఇళ్ళ సర్వే

బడాబాబులకు, బహుళజాతి సంస్థలకు వేలాది ఎకరాలను ఉచితంగా ధారాదత్తం చేస్తున్న ప్రభుత్వం భూపోరాటం మొదలుకాక ముందు ప్రజలు ఎన్ని అర్జీలు పెట్టుకొని మొరపెట్టుకున్నా అసలు ప్రభుత్వ స్థలాలే లేవని బుకాయించింది. తరువాత పేదలు ప్రభుత్వ స్థలాలు గుర్తించి గుడిసెలు వేసుకొని పోరాటాలు ప్రారంభిస్తే ఇది అక్రమ చర్య అనీ, శాంతి భద్రతల సమస్య అనీ ప్రచారంలో పెట్టింది. కాని పేద ప్రజలు అలుపెరుగకుండా చేస్తున్న పోరాటాన్ని పట్టించుకోకపోతే ప్రజలే ప్రభుత్వాన్ని భూ స్థాపితం చేస్తారు. ఈభయంతోనే ప్రభుత్వం ఇందిరమ్మ ఇళ్ళిస్తామని, సర్వేలు చేస్తామని ముందుకు రాకతప్పని పరిస్థితి ఏర్పడింది. ఈ సర్వేల్లో కూడా అనేక అవకతవకలు, ఆశ్రిత పక్షపాతం చోటుచేసుకుంటున్నది. ఈ నామ మాత్ర పథకాల ద్వారా కొద్దిమంది పాలకవర్గాల అనుయాయులకే లబ్ధి చేకూరుతుంది తప్ప వేలాది పేద ప్రజలకు వాస్తవంగా ఇళ్ళు ఇవ్వడంలో ప్రభుత్వానికి ఏమాత్రం చిత్తశుద్ధి కనిపించడంలేదు. ఇళ్ళు ఇచ్చేవరకు వైయస్ సర్కారుపై సుదీర్ఘ సమరానికి పేద ప్రజలు, మహిళలు మరింత సమాయత్తమవుతున్నారు.

సి. అరుణ, హైదరాబాద్ నగర ఉపాధ్యక్షురాలు

**విజయ** 32 సం॥లు: 7రోజులు జైలులో



మొదటిసారి భూ పోరాటంలో జైలుకు పోయినప్పుడు మా వల్ల నా భర్త నన్ను చూడటానికి వచ్చినా నాముఖం చూడకుండా,మాట్లాడకుండానే నా పరువు పోయింది అని అంటూ కోపంతో వెళ్లిపోయాడు. అప్పుడు నాకు చాలా బాధ అనిపించింది. సిపియం నాయకత్వాన భూముల కోసం పోరాటం చేసి జైలుకు వచ్చాను. తప్పు చేసి జైలుకు రాలేదు అని నా భర్తకు, నావాళ్ళకు అర్థం అయింది. తరువాత వాళ్లు కూడా పోరాటంలో పాల్గొన్నారు. పేదవాళ్ళ కోసం, భూమి కోసం ...ర్లయినా జైలుకు పోవటానికి సిద్ధంగా ఉన్నాను.

**పార్వతమ్మ** వయసు: 32 సం॥లు నందనవనం: 7రోజులు



నేను కూరగాయల వ్యాపారిని. నాకు ఇల్లు లేదు. నేను సిపియం భూ పోరాటంలో పాల్గొని గుడిసె వేసినాను, నన్ను అరెస్టు చేశారు. నాకు వ్యాపారం నష్టం జరిగింది. పోలీసులు అరెస్టు చేశారు. కాని నాకు చాలా ధైర్యం అనుభవం వచ్చినది.

**ఉపేంద్ర** 30సం॥లు 7 రోజులు



వరంగల్‌లో నక్సలైట్లలో ఉన్నపుడు ఒకసారి నన్ను అరెస్టు చేశారు. అప్పుడు నన్ను చూడటానికి ఎవరూ రాలేదు. కాని భూ పోరాటంలో అరెస్టు అయినపుడు ప్రజలు, నాయకులు ప్రతి రోజు వచ్చి పలకరించడం జరిగింది. నాకు చాలా గర్వంగా ఉంది. పేద ప్రజల కోసం, సిపియం ఆశయాల కోసం ఎన్ని సార్లు అయినా జైలుకు వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను.

**వి. గాలమ్మ** 35 సం॥లు మొదటి సారి 3రోజులు, రెండవసారి 7 రోజులు జైలులో



నేను జైలుకు రెండు సార్లు పోయాను. మొదటి సారి అనుభవం చాలా భయం అయింది. ఎందుకంటే వాళ్లు వీళ్ళు ఏమనుకుంటారోనని అన్పించింది. కాని సిపియం నాయకులు, ప్రజలు ప్రతి రోజు వచ్చి నన్ను కలువడం వల్ల భూమి కోసం పోరాడి జైలుకు వచ్చాను. ఏదో తప్పుచేసి రాలేదు అని అర్థం అయింది. అందుగురించి భూమి సాధించే వరకు ఎన్ని సార్లు అయిన జైలుకు పోవటానికి సిద్దంగా ఉన్నాను.

**రాములమ్మ,** వయస్సు 42సం॥లు. 3 రోజులు



నేను పండ్ల వ్యాపారం చేస్తాను. నేను పండ్లు అమ్మడానికి స్టాక్ తెచ్చిన రోజే జైలుకు పోవల్సి వచ్చింది. దీనితో నాకు 20వేలు నష్టం వచ్చింది. కొంచెం బాధగా అనిపించింది. భూమికోసం సిపియం ఆధ్వర్యంలో జైలుకు పోయాను. తప్పు వేరే తప్పుచేసి జైలుకు పోలేదని అర్థం చేసుకున్నాను. సిపియం నాకు ధైర్యం ఇచ్చింది. భూమి కోసం ప్రజల కోసం ఎన్ని సార్లు జైలుకు పోవటానికైనా సిద్ధం.

**నారాయణమ్మ,** 36 సం॥లు 7 రోజులు



ఒకసారి జైలుకు పోయివచ్చినప్పుడు ఎందుకు పోయినానా అనిపించింది. కాని నేను జైలుకు పోయింది తప్పు చేసి కాదు పేద ప్రజల కోసం. భూమి సాదించుట కోసం అందుకు నేను రెండోసారి కూడా జైలుకు పోవటానికి సిద్దం.

**వెంకటమ్మ** వయస్సు 42 7 రోజులు



నేను జైలుకు పోయి వచ్చినప్పుడు మా ఆయన నా చేతులకు గాజులు లేకపోవడం చూసి చాలా బూతులు తిట్టాడు. ఇంట్లోకి రావద్దన్నాడు. అయితే నా చేతిలో ఉన్న గాజులు 20 సం॥ల నుండి ఉన్న గాజులు తీయడంతో మా అయనకు చాలా కోపం

వచ్చింది. కాని సిపియం కార్యకర్తలు వచ్చి నచ్చజెప్పి భూపోరాటం ద్వారా జైలుకు పోయింది అని నచ్చజెప్పారు. అర్థం చేసుకున్న మా ఆయన నన్ను ఇంట్లోకి రానిచ్చాడు. సహకారమందిచ్చాడు. నేను ఇప్పుడు భూమి కోసం ఎన్ని సార్లైనా జైలుకు వెళ్లటానికి సిద్ధం.

**పెద్ద నాగమ్మ, 38సం॥లు 7 రోజులు**



నేను మొదటి సారి జైలుకు వెళ్ళి వచ్చినపుడు నాకు నా భర్త విడాకులు ఇస్తానని అన్నాడు. అయిన సరే కాని అన్నను. తర్వాత జనం స్పందన తెలుసుకొని అతనే స్వయంగా భూ ఉద్యమంలో పంపించాడు. అతను కూడ పాల్గొంటున్నాడు.

**రాజమ్మ, 30సం॥లు, 7 రోజులు**



నేను భూ పోరాటంలో గత 6 మాసాల నుండి పాల్గొంటున్నాను. నాకు ఇల్లు లేదు. నేనుకాక నా ఇంటి ప్రక్కన వాళ్ళను కూడా తీసుకుని వచ్చాను. నన్ను పోలీపోళ్లు అరెస్టుచేసినారు. అయినా వెనకకు పోయేదిలేదు.

**ఇంద్ర, 35 సం॥లు, 7 రోజులు**



నేను రెండు సార్లు జైలుకు వెళ్లి వచ్చినాను. నాకు ఇల్లులేదు. భూ పోరాటంలో పాల్గొన్నాను. నేను జైలుకు వెళ్లి వచ్చిన తర్వాత నాకు చాలా ధైర్యం వచ్చింది. అధికారుతోటి మాట్లాడే పద్ధతి, విధానం కూడా తెలిసింది. నేనుచాలా చైతన్యవంతురాలిని అయినాను.

**లక్ష్మి 30సం॥లు, 3 రోజులు**



నేను భూ ఉద్యమంలో పాల్గొని గుడిసెలు వేసినాము. ప్రతిరోజు అక్కడే ఉండి వంటలు కూడా చేసినాము. అక్కడే రాత్రి పడుకున్నాము. పోలీసులు వచ్చి అరెస్టు చేసినారు. దెబ్బలు కూడా కొట్టారు. అయినాసరే భూ పోరాటంలో పాల్గొన్నా ప్రభుత్వం ఏమి చేసినా సరే భూ పోరాటం ఆగదు.

**వెంకటమ్మ, 35సం॥లు 3రోజులు**



నేను గత 6 నెలలనుండి బండ్లగూడ నుండి భూ పోరాటంలో పాల్గొన్నాను గుడిసెలు వేసినాము. మావాళ్లందరం అక్కడే ఉన్నాము. మమ్మల్ని అరెస్టులు చేశారు, తిట్టారు. అయినాసరే వారికి సరైన సమాధానం చెప్పాము.

**లక్ష్మి 30సం॥లు 3రోజులు**



నేను భూ పోరాటంలో పాల్గొన్నాను. నేను ఒక్కసారి అరెస్టు అయినాను. నాకుజైలు, అరెస్టులు అంటేతెలియదు. అయినాసరే జైలుకు వెళ్లివచ్చాను. నాకు చాలా మంచి అనుభవం ఎదురైంది.

**బి. లలిత 30 సం॥లు 3 రోజులు**



నేను గుడిసెలు వేసి అక్కడే ఉన్నాను. నాకు పోలీసులు అంటేభయం. నన్ను అరెస్టు చేసినారు. నాకు చాలా భయం అయనది. అయినా సరే కొంచెం ధైర్యం తెచ్చుకొని వాళ్లను కూడ ఒప్పించాను. విడుదల అయిన తర్వాత మంచి స్పందన లభించింది.

**పుష్ప, 25సం॥లు మొదటి సారి 3రోజులు, రెండవ సారి 7 రోజులు**



నేను ప్రతిరోజు కూలి చేస్తాను. మాకు ఇల్లు లేదు. నేను భూపోరాటంలో పాల్గొన్నాను. పోలీసోళ్లు ఉదయమే నన్ను నాతోపాటు ఇంకా చాలా మందిని అరెస్టు చేశారు. ఎందుకంటే నేను ఇప్పటి వరకు ఎప్పుడూ జైలుకు వెళ్ళలేదు. మా వారు నాకు ధైర్యం చెప్పి పోరాటానికి పంపించాడు.

## పశ్చిమగోదావరి

### ఇండ్ల స్థలాలు - మహిళల ప్రాథమిక హక్కు

ఇళ్ళలో పాచిపని చేసుకునేవారు, రోజుకూలీ చేసుకునేవారు జానెడు జాగా కోసం ఎన్నో ఏళ్ళు తిరిగి తిరగి అలసిపోయి భూ స్వాధీనోద్యమంలో ఒక్కసారి ఉవ్వెత్తున కదిలి వచ్చారు. నర్సాపు పట్టణంలో 500మంది మహిళలు పాల్గొన్నారు. కనివినీ ఎరుగ రీతిలో మహిళలు కదిలిరావడం మాకు ఆశ్చర్యం కల్గించింది. ఉండటానికి జానెడు స్థలం కావాలని గర్భవతులు, పసిబిడ్డల తల్లులు, ముసలివాళ్ళు వేసవి కాలం ఎండల్లో సైతం పోరాటానికి దిగారు.

ప్రజలే చరిత్ర నిర్మాతలు అని పెద్దలు చెబితే ఏమిటో అనుకున్నాను. ఈ రోజు సి.పి.యం. పార్టీ, 195 ప్రజాసంఘాల ఆధ్వర్యంలో జరిగే భూస్వాదీనోద్యమంలో మహిళలు అరెస్టులు, లాఠీ దెబ్బలకు భయపడకుండా ముందుకు వచ్చారు. ఇళ్ళ నుంచి బయటకు రాని మహిళలు సైతం రోడ్డుమీదకు వచ్చి ఊరేగింపులో పాల్గొన్నారు. లాఠీ దెబ్బలు తిన్నారు, అరెస్టులయ్యారు. భూస్వాదీనోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. నాయకులను అరెస్టు చేస్తే మా నాయకులను వదలండి లేదా మమ్మల్ని కూడా తీసుకువెళ్ళండి అనేవాళ్ళు. వారి వాదనలు మమ్మల్ని ఆశ్చర్య చకితులను చేసింది. 'మేం ఏం కోరాం? ఆస్తులు కాదు, జానెడు నేల ఇవ్వండి, అద్దెలు కట్టుకోలేకపోతున్నాం. మా సంపాదన తినటానికి చాలటం లేదు. అద్దెలు కట్టుకోలేకపోతున్నాం. దయతలచి మాకు ఇంటి స్థలం ఇవ్వండి అని కన్నీరు పెట్టుకుని ఏడ్వడం మరువలేం. చిట్టవరం గ్రామంలో 300మహిళలు భూ స్వాదీనోద్యమంలో పాల్గొన్న 25 మంది జైళ్ళకి వెళ్ళడం అందులో 7గురు మహిళలు ఉన్నారు. రాజమండ్రి సెంట్రల్ జైలుకి పంపారు. అందులో 80సం॥ల ముసలమ్మ జైలు అంటే తెలియని ఆమె 'మా ప్రాణాలు పోయినా మాకు ఇళ్ళ జాగా కావాలమ్మా' అన్నది.

సూరమ్మ అనే మహిళ వ్యవసాయ కూలీ. భర్త లేదు. కుటుంబాన్ని తానే పోషించాలి. కుటుంబ సభ్యులు వచ్చి ఏడ్చి ఆమెని కోప్పడుతుంటే "అలాగంటారేమిటి? మనం ఇళ్ళ జాగా సాధించుకోవాలి. ఎన్నాళ్ళ

అద్దె కొంపల్లో పడి ఏడుస్తాం. మేం బాగానే ఉన్నాం మీరు ఏడ్చి మమ్మల్ని పిరికి వాళ్ళని చెయ్యకండి వెళ్ళిపోండి" అన్న ఆమె మాటలు ఇంకా గుర్తుకు వస్తున్నాయి.

ఆగస్టు 26వ తేదీన జరిగిన బంద్‌లో మహిళలు స్వచ్ఛందంగా పాల్గొని బంద్‌ను జయప్రదం చేశారు. వీటన్నిటి ఫలితంగా నర్సాపురం పట్టణంలో స్వంత ఇల్లు లేక అద్దె ఇండ్లల్లో ఉన్న వారినందరిని సర్వే చేసిన అధికారులు ఇళ్ళ స్థలాలు లేని వారికి స్థలాలు ఇస్తామని హామీ ఇచ్చారు.

**మాసా లక్ష్మి, కూలీ పని**



భూ పోరాటంలో అరెస్టయి జైలు కెళ్ళడం నేను గొప్పగా భావిస్తున్నాను. మనం అనుకున్నది సాధించడానికి ఎటువంటి కష్టాలకైనా నేను సిద్ధం. భూ పోరాటంలో నేను పాలుపంచుకున్నందుకు ఆనందంగా ఉంది.

**నాకపూడి నాగమణి, కూలి పని**



భూ పోరాటంలో అరెస్టయి జైలుకెళ్ళడం నాకు గొప్పగానే అనిపించింది. మొదట్లో నన్ను తేలికగా చూసినా తరువాత ప్రజలందరూ ప్రజల కోసం జైలుకెళ్ళిందని నన్ను బాగా అర్థం చేసుకున్నారు. మహిళలు ధ్వజమెత్తితే పోరాటాలు ఇలాగే ఉంటాయి.

**చర్ల బేబి, కూలి పని**



జైలుకెళ్ళినందుకు ఎవరైనా హేళన చేసినా పడలేదు. స్థలాలు రావాలని పోరాడటం వలన కెళ్లాము. స్థలాలు వస్తాయని నమ్మకం. ఇక దు కూడా పోరాటంలో పాల్గొంటాను.

**వెల్లే జానకి, గృహిణి**



ఇళ్ల స్థలాలు వస్తాయని అందరితోపాటు పాల్గొన్నాను. అరెస్టయి సెంట్రల్ జైలుకి వెళితే మొదట్లో అందరూ ఆదోలా చేశారు. నా భర్త, కుటుంబ సభ్యులు ఏదో తప్పు చేసి కాదు ప్రజల కోసం జైలుకెళ్ళింది అని అర్థం చేసుకుని నన్ను బాగానే చూశారు. ఇళ్ళ స్థలాలు వచ్చే వరకు భూ పోరాటంలో ఇక ముందు కూడా పాల్గొంటాను.

### ఇళ్ళ స్థలాలు బిక్ష కాదు హక్కు

ఏవండీ, మంగమ్మ గారూ! మీ ఇంట్లో పోర్షన్ ఖాళీగా ఉందని చెప్పారు. అద్దె ఎంతేంటి? చూపిస్తారా?

చూపిస్తాను, ఒక గది. వసారా 800రూ॥లు అద్దె. సరే గాని మీ ఎంతమంది ఉన్నారు.

నేను, మాఆయన, ముగ్గురు పిల్లలు, మా అత్తగారు ఉన్నాము.

అమ్మో! అంతమంది ఉంటే నేను ఇల్లు ఇవ్వనమ్మాయ్.

ఎంత మందుంటే నీకేమిటి? నువ్వేమన్నా పోసిత్తావా! భరాయించేది మేమే గందా.

అయితే మీత్రం మీ ఇల్లంతా గలాబా అయిపోదా! పోన్లే అడగతన్నావు గందా అని ఒప్పుకుంటున్నాను. కాని కొన్ని సరతులెట్లాం.

ఏటయ్యి?

ముసలమ్మకేటైనా జొరం వత్తే ఇంట్లో ఎట్టకూడదు. ఆసుపతాల్‌కు తోలాల. అగ ఏటైనా అయితే అటే సొసానానికి తీసికెల్లాల తప్ప ఇంటికి తీసుకురారాదు. పిల్లలు కక్కసు దొడ్డిలో కెల్లరాదు. రోడ్డుకు పోవాల. పెద్దోల్లు ఎంతమంది వెల్తే అన్ని పాతిక రూకలు నెలకు కట్టాల. శుక్లారం వాకిలి ముగ్గు ఎట్టకుండా బోరింగ్‌కు పూజ చేయకుండా బోరింగ్ కొట్టకూడదు. కరెంటు రాత్రి 9గంటల వరకే ఎడతాము. పిల్లలు ఇంటోల గోలెట్టకుండా సూసుకోవాల. మరి ఇట్టమయితే 2 నెలల అద్దె ముందు కట్టెల్లు. అలీసమయితే ఇంకోరు అడిగారు ఇచ్చేత్తాను.

అమ్మో! మంగమ్మ తల్లీ! నీకో దండం, నీ ఇంటికో దండం. నీ సరతులన్నీ ఒప్పుకుంటే అద్దె నీకు ఇచ్చి మేము రోడ్డు మీదే కాపరమెట్టాల. వెళ్తా.

సత్తెమ్మా! పొద్దునకాడ నుంచి ఏడకెల్లావు! నీకో ఇసేసం చెప్పాల!

ఏటి సెప్పక్కా. ఈ ఇల్లంతా కారిపోతంటే వర్సాకాలంలో పడుకుందామంటే చారెడు పొడినేల లేకుంటా వుంది. ఆద ఇల్లు కాలిగుందంటే సూద్దామని పోయా! ఇంటామె సరతులకు కల్లు తిరిగి వచ్చేసినా. సరే గాని ఏటి ఇసేసమాన్నవు.

మరే సిపియం పార్టీ వాల్లంట ఇల్ల తలాల కోసం పోటాడదాం ! రమ్మన్నారు పారాలు ఇచ్చిపోయిన్రు. అయిరాసి తాలూకాపీసు కాడికి పోవాలంట. నువ్వు లేవుకదాని నీకు కూడా ఒకపారం తీసుకున్నా పోదామా!

తప్పకుంటా పోదాము. ఆల్ల కడుపు చల్లగా స్దలాల కోసం రమ్మంటే ఎందుకు పోము. వారం నాళ్లు పని పోతేపోయింది ముందు ఇల్లస్తలం వత్తే ఈ బాధలన్ని తప్పుతాయి.

ఈ నేపథ్యంలో పశ్చిమ గోదావరి జిల్లాలో మే నెలలో పట్టణాలలో భూ పోరాటం మొదలయ్యింది. ప్రతి పట్టణంలో ఇంటి పని చేసేవారు, కూలికెళ్ళేవారు, పూలు, పళ్ళు, కూరగాయలు అమ్మేవారు అనేక మంది పేద మహిళలు మురికి వాడలలో నివసిస్తున్నారు. వారు నెలంతా కష్టపడినా వెయ్యి రూ॥లు రావటంలేదు. మగవారు రోజుకు కనీసం 100రూ॥లు సంపాదించగలుగుతారు. వారి కష్టమంతా ఇంటికి వస్తే కుటుంబానికి కొంత వెసులుబాటుగా వుంటుంది. మహిళలు వారికొచ్చే కొద్దిపాటి ఆదాయం భర్త తాగగా మిగిలిన సొమ్ముతో కుటుంబాలను సక్రమంగా నడపలేక తీవ్రమైన ఒత్తిడులకు గురవుతున్నారు.

నర్సాపురం, భీమవరం, తణుకు, నిడదవోలు, కొవ్వూరు, తాడేపల్లిగూడెం, ఏలూరు అన్ని పట్టణాలలో పేద మహిళల ఇళ్ళ స్థలాల పరిస్థితి ఇదే.

ఇక మధ్య తరగతి మహిళల పరిస్థితి చూస్తే పశ్చిమగోదావరి జిల్లా పురాతన సాంప్రదాయం ఈనాటికి కొనసాగుతున్నది. మహిళలు

బయటకు వస్తే తప్పు. గట్టిగా మాట్లాడినా, గట్టిగా నవ్వినా తప్పే. ఇంట్లో ఒకరి సంపాదనపై కుటుంబ సభ్యులంతా ఆధారపడాలి. ఇంట్లో పస్తులు పడుకున్నా బయటకు రాకూడదు. ఇంట్లో మహిళలు, ఆడపిల్లలు లేసు, ఇంటికి పరిమితమైన వృత్తి పనులు చేస్తున్నారు. ముఖ్యంగా లేసు అల్లే మహిళలు వంట చేసే టైము తప్ప మిగిలిన రోజంతా లేసు అల్లుతూనే ఉంటారు. కాని వారానికి 150రూ॥లు గిట్టుబాటు కావడం కష్టం. ఇలాంటి వారందరూ తమ సాంప్రదాయాలు ప్రక్కనబెట్టి గట్టిగా నినాదాలు ఇస్తూ పోరాటాలలో పాల్గొన్నారు.

స్థలాలు ఆక్రమించిన చోట నాలుగు వైపుల చిన్న కర్రలు పాతి, పాత చీర దేరాగా వేసి రాత్రిళ్లు కూడ పడుకున్నారు. లాఠీ దెబ్బలు తిన్నారు. జైళ్ళకు వెళ్ళారు. అక్కడ నాయకులతోపాటు జైలులో ఇతర మహిళా ఖైదీల స్థితిగతులు తెలుసుకున్నారు. వారికి ధైర్యం చెప్పారు. నాణ్యతలేని ఆహారం పెడుతున్నప్పుడు జైలులో కూడా పోరాటం చేసి మంచి ఆహారం పెట్టేటట్లు ఏర్పాట్లు చేశారు.

మొదట ఇతర మహిళా ఖైదీలు మన మహిళల పట్ల దురుసుగా ప్రవర్తించబోయినా భూ పోరాటం నుండి వచ్చిన వారని తెలుసుకొని గౌరవ మర్యాదలతో చూడటం వారికి పనులు అప్పగించకుండా మహిళా నాయకులకు తమ కష్ట సుఖాలు చెప్పుకోవటమూ, నాయకులు స్టడీ సర్కిల్స్ రూపంలో చెప్పే మంచి మాటలు శ్రద్ధగా వినటమూ చేశారు. వార్డెన్స్, జైలరు మన మహిళలకు ఇచ్చే గౌరవం చూసి తోటి ఖైదీలు ఆశ్చర్యపోయారు. భూ పోరాటాల విలువ తెలుసుకున్నామని చెప్పారు. జైలు నుండి మన మహిళలు వచ్చేటప్పుడు తమ చీరలు, పేస్టులు, ఇతర వస్తువులు ఇతర ఖైదీలకు ఇచ్చిరావటం జరిగింది. మన మహిళల్లో కొవ్వూరు నుండి భూ పోరాటంలో పాల్గొన్న మాసా లక్ష్మి క్రొత్తగా జైలుకెళ్ళినా బెరుకులేకుండా చాలా ధైర్యంగా ఉన్నది. కలుపుగోరుతనంగా ఇతర ఖైదీలతోపాటు అవినీతిపై మందలించడం జైలరుకు చెప్తానని బెదిరించి వారిని సరిదిద్దడం లాంటి చురుకైన కార్యక్రమాలలో పాల్గొన్నది. జైలు నుండి వచ్చేటపుడు తోటి ఖైదీలతో ఇళ్ళ స్థలం వచ్చేవరకు పోరాటం ఆపము. అవసరమైతే జైలుకు మళ్ళీ వస్తాము అని చెప్పింది. ఆమెను నువ్వు ఎలాంటి పరిస్థితుల్లో భూ పోరాటంలోకి వచ్చావమ్మా అని అడిగినపుడు నేను బి.సి. నా భర్త ఏసు ఎస్.సి. నేను కావాలనే పెళ్ళి చేసుకున్నాను. నా భర్త రిక్షా తొక్కేవాడు. మాకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. నా భర్త బాగా తాగేవాడు. ఎంత చెప్పినా వినేవాడు కాదు. మా పెద్ద పిల్లకు ఎంతో కష్టపడి పెళ్ళి చేసాము. నా భర్త తరపు చుట్టానిది చిన్న స్థలం కొవ్వూరులో ఉన్నది. స్థలం గలవారు ఎప్పుడు వెళ్ళిపోమంటే అప్పుడు వెళ్ళిపోతామని చెప్పి ఆ స్థలంలో చిన్న పాక వేసుకున్నాము. ఆ స్థలం బాగా పల్లంగా, చెమ్మగా ఉంటుంది. అయినా అందులో ఉంటున్నాము. తాగుడువల్ల నా భర్తకు జబ్బు చేసింది. రాజమండ్రి తీసుకెళదామంటే బ్రిడ్జి రిపేరులో ఉంది. నా భర్తను గోదారి దాకా రిక్షాలో కూర్చోబెట్టుకుని తొక్కుకుంటూ పడవలో రాజమండ్రిలో వెళ్ళి ఆసుపత్రిలో చూపించి తిరిగి ఇంటికి తీసుకువచ్చేదాన్ని. ఒకరోజు నేను కూలికివెళ్ళి ఇంటికి వచ్చేసరికి చూరు కింద నా భర్త చనిపోయి ఉన్నాడు.ఆ తరువాత ఆపాకలోఇడ్లీలు అమ్ముకుని బతుకుతున్నాను. చిన్న అమ్మాయిని ప్రభుత్వ హాస్టల్‌లో చేర్పించాను. ఇళ్ళ స్థలాల కోసం పోరాటంలోకి వచ్చిన తర్వాత పోరాట స్థలంలోకి ఇడ్లీలు, ఫ్లాస్క్‌ల్లో టీ తెచ్చి అమ్ముతున్నాను. జైలులో 5రోజులు ఉన్నాను. లాఠీదెబ్బలు తిన్నాను. స్థలం ఆక్రమించుకున్న భూస్వాములు మా మీద కొట్టటాని వచ్చారు. వేసుకున్న గుడిసెలు పీకేసారు. అయినా ధైర్యంగా ఉన్నాను. ఎన్నిసార్లు, ఎన్ని రోజులు జైలులో పెట్టినా ఫరవాలేదు. ఇళ్ళస్థలం కోసం పోరాడుతాను. మహిళా సంఘంలో కొవ్వూరు డివిజన్ అధ్యక్షురాలుగా పెట్టారు. నా జీవితాంతం సంఘంలో పనిచేస్తాను. వెనక్కు వెళ్లను". అని చెప్పింది. నేను భూ పోరాటంలోకి వచ్చిన తరువాత నా భర్త పోయినప్పటి నుండి తిరుగుతున్నా ఇవ్వని ఆపద్భందు పథకం క్రింద 5,000రూ॥లు ఎమ్.ఆర్.ఒ. గారు వెంటనే ఇచ్చారు. మొత్తం జిల్లాలో 29మంది జైలుకు వెళ్ళారు. అందులో ఒ.సి.లు, బి.సి.లు, ఎస్.సి.లు ఉన్నారు. అందరూ ఒకటే మాటమీద ఉన్నారు. మమ్మల్ని లాఠీలతో కొట్టినా, అరెస్టులు చేసినా, కేసులు పెట్టినా, జైళ్ళల్లో పెట్టినా వెనుకాడము. భూమి సాధించేవరకు వదలము. సంఘాన్ని వదిలిపెట్టము అంటున్నారు.

ప్రజలే చరిత్ర నిర్మాతలు అనే విషయాన్ని భూపోరాటంలోకి వచ్చిన మహిళలు ఋజువు చేసి చూపిస్తున్నారు. జనాభాలో సగభాగంగా ఉన్న మహిళలు ఒకసారి గడపదాటి బయటకి వస్తే ఏ పోరాటంలో వచ్చినా కడదాకా నిలబడతారు.

-జి. విజయలక్ష్మి, జిల్లా కార్యదర్శి

## విశాఖపట్నం

### తోట హేమ

అద్దె ఇల్లు బాధపడలేక స్థలం కోసం వెళ్ళాం. పోలీసులు వెంటతగిలారు. దెబ్బలు కొట్టారు. వారం రోజులు భూమిలో ఉన్నాం. అద్దెలు బాధలు, కరెంటు బిల్లులు కట్టలేక, ఒక రోజు పని ఉం ఒకరోజు ఉండదు. ఈబాధలు కన్నా ఆ బా నయం. అనిపించింది. వారం రోజులు రా పగలు అక్కడే వున్నాము. ఇల్లు, పిల్లలు వదిలే జైలుకెళ్ళాం.బాధ అనిపించింది. నలుగురి పనికివచ్చే పని చేశామని అనిపించింది. జడ్జిగా దగ్గరికి అర్థరాత్రి 12గం॥లకు తీసుకువెళ్తే జడ్జిగారు పోలీసుల మీద దెబ్బలాడారు. 'ఇళ్ళ స్థలం కోస వచ్చిన వాళ్ళమీద ఈకేసులు ఏమిటి?' అనిఅన్నారు. డిశంబరు 3 అరెస్టు అయి జైలుకు వెళ్ళాం. పండుగ రోజులలో పనిలేదు. పిల్లల వదిలి వచ్చేశాము. కూలి లేకపోతే పూట గడవదు. పనులు లేక నే రోజులు తిండికి కూడా ఇబ్బందిపడ్డాం. మామూలు ఖైదీలకు, మా బాగాతేడా ఉంది. పార్టీ ద్వారా గౌరవంగా చూశారు. సంఘం అండ వుంది.

### దలాయి బంగారం

స్థలం కోసం వారంరోజులు రాత్రి,పగలు అక్కడే వండుకుతిన్నా 31న అరెస్ట్ చేసి మధ్యాహ్నం భోజనాలు పెట్టారు. వదులుతా అన్నారు కాని వదలలేదు. పోలీసులు పరోటాలు పెట్టి వదిలేస్తా చెప్పారు. నమ్మి తినేశాం కానీ రాత్రి 12గంటలకు జడ్జి ద నిలబెట్టారు. జడ్జిగారు కూడా పోలీసుల మీద దెబ్బలాడారు. తెల్లవా

4 గంIIలకు జైలుకి పంపించారు. జైలుకు వెళ్ళాక 2,3 రోజులు బాధ అనిపించింది. కాని తరువాత మన నాయకులు ఉత్సాహంగా ఉండటానికి పాటలు, ఆటలు ఆడించారు. పార్టీ వారు ఇండ్ల దగ్గరికి వెళ్ళి మా పిల్లలకు, బంధువులకు ధైర్యం చెప్పారు. జైలు నుండి వచ్చాక చుట్టు ప్రక్కలవారు జైలు ఎలా వుంది? అని వెటకారం చేశారు. అయినా మేము భయపడలేదు. మేముఏదైనా సాధించగలం. అయితే ఇల్లు, లేకపోతే జైలు ఏదో ఒకటి తేల్చుకోవాలనే ధైర్యం వచ్చింది. సంఘంలో పనిచేస్తున్నాను.

**బొబ్బిలి కృష్ణమ్మ**

ఇళ్ళ స్థలంకోసం ఆశతో వెళ్ళాము. 5రోజులు స్థలంలో కూర్చున్నాం. తాళ్లు కట్టుకుని కూర్చున్నాం. పోలీసులతో కుస్తీ పట్టాము. నాయకులను పోలీసు ఆడోళ్ళు కొట్టారు. గవర్నమెంటు జీతం తీసుకొని మాలాంటోళ్ళని కొట్టడానికా అని తిట్టాము. 20సంII నుంచి అద్దె కొంపల్లోనే ఉంటున్నాము. 9 రోజులు జైలుకు వెళ్ళాము. మా ఆయన ఏమంటాడో అని భయం వేసింది. మా ఆయన తాగుతాడు. ఇంట్లో కూతురు పురిటికి వచ్చింది. చాలా ఇబ్బందిపడ్డాం. పార్టీ అంటే ఇష్టం. ధైర్యంగావెళ్ళాను. పోరాటం చేశాము. ఇల్లు స్థలం వచ్చే వరకు మళ్ళీ జైలుకు ఎళ్తాను. వరుగులెత్తించడం, వెంటతరమడం, లాఠీలతో కొట్టడం చేశారు. మేము పోలీసులతో తగవులాడాము. కష్టపడితేనే వస్తది. పోరాటం చేస్తే ఇవాళ కాకపోతే రేపయినా వస్తాయని నేను ధైర్యంగా ముందుకెళ్లాను. పండుగముందు పనులు లేవు. జైలులో పెట్టింది గవర్నమెంటు. పేదోళ్ళ కోసం లేదు. మళ్లి మళ్లి పోరాటానికి నేనుసిద్దంగా ఉన్నాను. మా ఆయన ఇబ్బందులు పెట్టినా ఇళ్ల స్థలం సాధించేవరకు నేను పోరాటంలోకి వస్తాను.

భూముల్లోకి దిగడానికి ముందే వారు నాయకులను లాగితే నేను గట్టిగా అడిగితే లంజల్లారా మీరు కూడా పదండి అందులో ఐదేస్తాను అని పదపదా కొట్టి ఆడపోలీసులు వ్యానెక్కించారు. జడ్జి దగ్గరకు తీసుకువెళ్తే చీకటిలో ఎక్కడికో తెలియ లేదు. ఆడ పోలీసులను ఎక్కడికి అని అడిగితే మీ ఇంటికే అని చెప్పారు. తీరాచూస్తే జైలు దగ్గర దించారు. అమ్మలక్కల్లారా దిగండి అని చెప్పినారు.

జైలులో అందరినీ చూశాక ధైర్యం వచ్చింది. జైలులో పేపర్లు చూసి నాయకులు విషయాలు చెప్పేవారు. కూలిపనికి వెళ్తాను. భర్త సప్లయర్స్‌లో చేస్తాడు. సగం తాగి సగం జీతం ఇంటికి ఇస్తాడు. కూలికెళ్ళకపోతే ఇల్లు జరగదు. 20 రోజులు పనిమానేసి పోరాటంలోకి వచ్చాను.

**ఎం. బేబిలక్ష్మి, కూర్మన్న పాలెం, విశాఖ**

నా పేరు బేబిలక్ష్మి. మాది మచిలీపట్నం దగ్గర పెడనమండలం కాకర్లమూడి గ్రామం. బ్రతుకుదెరువు కోసం విశాఖపట్నం వచ్చాము. నా భర్త లారీ డ్రైవరు. నాకు ఇద్దరు పిల్లలు. భూపోరాటంలో పాల్గొన్నాను. కారణం నిత్యావసర వస్తువుల ధరలు పెరిగిపోయి నా భర్త తెచ్చే 1500రూIIలు జీతం ఇంటి అద్దెకు, కరెంటు బిల్లులకు స్కూలు ఫీజులకు మాత్రమే సరిపోతుంది. కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలోకి వస్తే పేదవాడికి స్థలం ఇచ్చి ఇల్లు కట్టిస్తానని హామీ ఇచ్చింది కాని మూడున్నర సంవత్సరాలైనా ఈ ప్రభుత్వం మాకు న్యాయం చేయలేదు. భూ పోరాటంలో పాల్గొన్న మహిళలని కూడా చూడకుండా చాలా అసభ్యకరంగా ప్రవర్తించారు. పాకలు వేసుకుని గత సంవత్సరం డిశంబరు 28 నుండి పది రోజులపాటు మంచి చలిలో రాత్రులు పిల్లలతోపాటు ఆ పాకలలోనే వున్నాం. పాములు పురుగుల మధ్య జీవనం గడిపాము. అన్యాయంగా పోలీసులు మేము వేసుకున్న పాకలను పీకివేసారు. మమ్మల్ని బయటకుతోసి లాఠీచార్జి చేసారు. ఆ పోరాటంలో అనేకమంది మహిళలను అరెస్టు చేసి జైలులో పెట్టారు. నిర్బంధాన్ని, అనేక ఆటంకాలను కల్పించింది. ఈ ప్రభుత్వం మళ్ళీ పేదల మధ్యకు వచ్చి మీకు ఇల్లు కట్టి ఇస్తాము. పోరాటం చేయవద్దని చెప్పింది. కాని ఈ రోజు వరకు ఆ విధంగా ప్రయత్నాలు ఏమీ చేయలేదు. మా ఆర్థిక ఇబ్బందుల వలన ఈ పోరాటంలోకి వచ్చాను. ఈ పోరాటంలో అనేకమంది మహిళలను జైల్లో పెట్టారు. వాళ్లపై వున్న కేసులను మా పై వున్న కేసులను ఎత్తివేయాలని ఐరిష్ తీసిన వాళ్లందరి ఫోటో గుర్తింప కార్డులు ఇచ్చి స్థలాలు ఇవ్వాలి. ఇవి సాధించుకునే వరకు మేము పోరాటం చేస్తాము.

**బి. కరుణ కుమారి, చిట్టివాని పాలెం, విశాఖ.**

నా పేరు బి. కరుణ కుమారి మాది విజయ నగరం జిల్లా. మేము బతుకుతెరువు కోసం విశాఖ వచ్చి నేటికి 15 సంIIలు. మా ఆయన కార్పెంటర్. కూలికెల్తుంటారు. నాకు ముగ్గురు పిల్లలు. మాకు వచ్చిన జీతం చాలక. నానా తిప్పలు పడుతూ బతుకుతున్నాము. ఇంటి అద్దెలు, కరెంటు బిల్లులు, స్కూలు ఫీజులు కట్టి ఇల్లు గడవడం కష్టంగా ఉంది. అందుకని ఈ భూపోరాటంలో పాల్గొన్నాము. గత ఏడాది డిశంబరు 28 నుండి పదిరోజులపాటు చెరువులో పాకలు వేసి ఉన్నాము. ప్రభుత్వం లాఠీచార్జి చేయించి బలవంతంగా ఈడ్చి బయటకు నెట్టివేసి పాకలు పీకేయించారు. పిల్లలతోపాటు చలిలో పాముల మధ్య జీవనం చేసాము. అప్పుడు ప్రభుత్వం భూ పోరాటం మానివేయండి మీకు మేము ఇల్లు కట్టిఇస్తామని చెప్పింది. కాని ఈ రోజుకి కూడా ప్రభుత్వం ఎటువంటి ప్రయత్నం చేయలేదు. మా కుటుంబ ఇబ్బందులు వలనే ఈ భూపోరాటంలోకి వెళ్ళాము. ఈ పోరాటంలో అరెస్టు కూడా చేసి 4 రోజులు జైలులో పెట్టారు. చిన్న పిల్లల్ని ఇంటి దగ్గర వదిలిపెట్టవలసివచ్చింది. పిల్లల్ని చూసుకోవడం కోసం మా ఆయన పనిమాని పిల్లల దగ్గరే ఉన్నారు. ఒక రోజు కూలికి పోకపోతే కుండ ఆడని మా బ్రతుకులు. అలా ఎన్నో రోజులు సెలవులు పెట్టారు. మా పరిస్థితి బాగులేక ఈ జైలుకి రావలసివచ్చింది. అయినా మా పిల్లలకు మాకు ఉండడానికి ఒక ఇల్లు కావాలి. వచ్చే వరకు ఈ భూపోరాటంలో పాల్గొంటాం.

**వై. ఈశ్వరమ్మ, విశాఖ**

అందరి గురించి పోరాదాం. రోజూ భూమిలోకి వెళ్ళేవారం. పోలీసులు కొట్టారు. వ్యానుఎక్కించినా మరుసటిరోజు మళ్ళీ వెళ్ళాము. పగలు, రాత్రి కూడ భూమిలో ఉన్నాము. భూమి దక్కే వరకూ అక్కడే

వుండాలిఅని ఉన్నాము. పోలీసులు వెంటబడి తరిమారు. ధైర్యంగా ఎదిరించాము. 5 రోజుల తరువాత అరెస్ట్ అయ్యాము. కాని భయపడలేదు. 10 రోజులు జైలులో ఉన్నాను. మా బంధువుల ఎదురుగా నన్ను అరెస్ట్ చేస్తే నాకు బాధ కలిగింది. జైలుకెళ్ళాక అందరిని చూసి ధైర్యం వచ్చింది.

ఇంటి మీద బెంగనిపించింది. నాయకుల మాటలతో ధైర్యం వచ్చింది. మా పిల్లలను ఇంటి దగ్గర వారు భయపెట్టేవారు. జైలు నుండి వచ్చాక ఇంటి చుట్టు ప్రక్కల వారి నుంచి కొంత ఇబ్బంది అయినా తరువాత గర్వపడేదానిని. పోరాటం మంచిదని మళ్ళీ మళ్ళీ పోరాటం చేసినా జైలుకి వెళ్ళినా నేను సిద్దంగా ఉన్నాను. పోరాటం చేస్తే ఏదైనా సాధించగలం. అలవాటు అయ్యాక జైలులోనే బాగుందనిపించింది. నాకయితే ఇంటిలోకన్నా అక్కడే బాగుంది. జైలులో చాలా నేర్చుకున్నాను. మంచి ఉత్సాహం వచ్చింది. ఇప్పుడు నాకు ఒకసంఘం ఉందని నిబ్బరంగా ఉంది. ఒకసారికే అనుభవం వచ్చింది. ఇలాంటి పోరాటాలలో ముందుండాలని ఉంది. సంఘంలో పనిచేయడం అవసరం ఉందనుకున్నాను. స్థలాల లిస్టులో నా పేరే ముందు వచ్చింది.

## కృష్ణా

### నాగుర్‌బీ



నా కొడుకు ఇళ్ళ స్థలాలు పోరాటంలో జైలుకు వెళ్ళాడు. ఆరోజు నాకు ఏడుపు ఆగలేదు. మరుసటి రోజు నేను భూమిలోకి వెళ్ళి గుడిసె వేసాను. పోలీసులు అరెస్టు చేసి జైలుకు పంపారు. నా కొడుకు పేద ప్రజలకు ఇళ్ల స్థలం రావాలని జైలుకెళ్ళాడు. నా కొడుకు ఆశయం నెరవేరడం కోసం నేను కూడా ఎన్ని సార్లయినా జైలుకెళతానని గర్వంగా చెబుతున్నాను.

### జయలక్ష్మి

జైలుకెళ్ళిన తర్వాత గేటు దగ్గర చెకింగ్ చేసే సందర్భంలో చీరలు తీసి చూడాలని అన్నారు. మేము ప్రజల కోసం జైలుకు వచ్చాము కానీ దొంగతనాలు, హత్యలు చేసిరాలేదు అని మాట్లాడడం జరిగింది. అప్పుడు మామూలుగా పంపించారు. భోజనం సరిగా లేని పరిస్థితిలో కూడా గట్టిగా గొడవపడి సరిగా పెట్టేలా మాట్లాడాము. తిరిగి



వచ్చేటపుడు అందరూ మీరు ఉన్నపుడు బాగా పెట్టారు. మీరు వెళ్లిన తర్వాత మళ్లీ మామూలే అని బాధపడ్డారు. అక్కడున్న వారంతా దొంగతనాలు, సారా అమ్మేవాళ్ళు, అత్తా కోడళ్ళు తగాదాలు, వ్యభిచార వృత్తిలో ఉన్న వాళ్ళు ఉన్నారు. మమ్మల్ని చూసి అందరూ కూడా మీరు దేవతలాంటి వారు, మిమ్మల్ని జైలులో పెట్టడం ఏమిటని బాధపడ్డారు. తర్వాత అందరూ మా దగ్గరకు వచ్చి వారి కష్ట సుఖాలను చెప్పడం, మాకు సలహా చెప్పండి అని అడగడం జరిగింది. ఆ సందర్భంలో 2గంటలు మన సంఘం గురించి, భూపోరాటం ఎందుకు చేస్తున్నాం అనే విషయం గురించి చెప్పడం జరిగింది. మరుసటి రోజు అందరూ చుట్టూ చేరి వారి బాధలు చెప్పుకొచ్చారు. ముఖ్యంగా సారా అమ్మేవాళ్ళు భర్తను అరెస్టు చేస్తే బాగా కొడుతున్నారు. అందుకని మేము అరెస్ట్ అవుతున్నాం అన్నారు. ఒక వేళ అమ్మక పోయినా మమ్మల్ని పోలీసులు ఏదో ఒక నేరం క్రింద అరెస్టు చేస్తున్నారు అని బాధపడ్డారు. మేము వచ్చేస్తుంటే అందరూకళ్ళవెంట నీళ్ళు పెట్టుకున్నారు.

## లబ్ధిదారులకు అందని ఇందిరమ్మ పథకం

రాష్ట్ర వ్యాపితంగా పేదలకు ఇళ్ళు కట్టిస్తున్నామన్న పేరుతో ఇందిరా ఆదర్శ వార్డులను ఎంపిక చేశారు. చేస్తున్నారు. ఈ వార్డుల్లో లబ్దిదారుల ఎంపికలో అనేక అవకతవకలు వెలువడుతున్నాయి. అయినా వీటిపై ప్రభుత్వ స్పందన మాత్రం పేదవాళ్లను వారి పేదరికాన్ని అపహాస్యం చేసే విధంగా ఉంది. ఒక వైపు స్వంత గూడు లేక ఎంతో ఆశతో అర్జీలు పెట్టుకున్న పేదల పేర్లు జాబితాలో లేవు. పైగా అసలు అర్జీ పెట్టుకోకుండా, సొంత ఇల్లు ఉన్న అనర్హుల పేర్లు ప్రతి ప్రాంతంలో జాబితాలో ఉన్నాయి.

ఇంకా ఎన్నో అవకతవకలు జరుగుతున్నా 'కళ్ళకు పనిచెప్పకుండా, నోటికి మాత్రమే పని చెప్తూ ఉండటం" సిగ్గుచేటైన విషయం.

గుంటూరు నగరంలో మొత్తం 52 డివిజన్‌లు ఉండగా అందులో గుర్తించిన మురికివాడలు 134 ఉన్నాయి. నగరంలో తెల్లరేషన్ కార్డు లబ్దిదారులు 1,13,156 మంది. అర్హత ఉన్నప్పటికీ పొందలేక తెల్లరేషన్ కార్డుకు ఎదురు చూస్తున్నవాళ్ళు 10వేలకు పైనే ఉన్నారు. మొత్తం 52 డివిజన్‌లలో మొదటి విడత ఇందిరమ్మ వార్డులుగా 17, రెండవవిడత మరో17 డివిజన్‌లను అధికారులు ఎంపిక చేశారు.

మొదటి దశలో 2,458 మందిని గుర్తించగా మంజూరు చేసినవి 1140. అందులో పూర్తైన ఇళ్ళు కేవలం 483. రెండవ విడత గుర్తించిన 17 డివిజన్‌లలో మొత్తం 869 గుర్తించామని చెబుతున్నారు. ఈ వివరాలతోపాటు వాస్తవ పరిస్థితుల అధ్యయనం కోసం 'ఐద్వా' గుంటూరు నగరంలో 18,19 డివిజన్‌లలో సర్వే నిర్వహించింది. ఈ రెండు డివిజన్‌లు రెండవ విడత ఆదర్శవార్డులుగా ఎంపిక కాబడ్డాయి. ఈ సర్వేలో ఇందిరమ్మ వార్డుల్లో సహజంగా జరుగుతున్న అవకతవకలు మామూలుగానే బయటపడ్డాయి.

18వ డివిజన్‌లో 2700 కుటుంబాలు ఉండగా అందులో మనం చేసిన సర్వే ప్రకారం జాబితాలో చేర్చదానికి అర్హత ఉన్నవాళ్ళు 330మంది. కాని మంజూరు చేసినవి కేవలం '12' ఇళ్ళు మాత్రమేనని చేతులు దులుపుకున్నారు. ఈ 12 ఇళ్ళలో నిర్మాణం ప్రారంభించింది 'ఒక్క' యిల్లు మాత్రమే. ఇప్పటికే ఇల్లు ఉండి వారికి తెలియకుండానే మంజూరైనది '10' ఇళ్ళు. డబ్బులు చాలక కట్టుకోలేమన్నవారు '7'గురు. 19వ డివిజన్‌లో ఎప్పటినుండో అప్లికేషన్ పెట్టుకున్న జాబితాలో పేర్లు రానివారు వందలమంది ఉండగా అవసరం లేకుండా అర్జీ పెట్టుకోకపోయినా కొందరికి ఇల్లు మంజూరు చేయడం 'ఇందిరమ్మ' ప్రభుత్వానికే చెల్లింది. ఈ డివిజన్‌లో ఇల్లు కావాల్సిన వాళ్ళు అర్హులు 480మంది ఉండగా ప్రభుత్వం మంజూరు చేసింది కేవలం 46ఇళ్ళు. అందులో గట్టి రేకులు ఉన్న ఇళ్ళు 15. ప్రభుత్వ ఉద్యోగులు ఇద్దరికి ఒకే కుటుంబాల్లో రెండు, మూడు చొప్పున మంజూరైనవి 4 ఇళ్ళు ఉన్నాయి. డబ్బులు చాలవని కట్టుకోలేమన్నవారు 9మంది. అసలు మంజూరైన సంగతే తెలియని వారు 10మంది. స్థలం లేని వారు 14 మంది ఉన్నారు. వారికి స్థలం చూపే పరిస్థితి ప్రస్తుతం లేదు.

ఈ డివిజన్‌ల నుండి దాదాపు 1000 మంది మహిళలు భూపోరాటంలో పాల్గొన్నారు. ఇలాంటి సర్వేలు అనేక వాస్తవాలను వెల్లడిస్తున్నా ప్రభుత్వం కేవలం టి.వి., పేపరు ప్రకటనలకే పరిమితం అవుతుంది. అందుకే భూపోరాటంలో పాల్గొంటున్న మహిళలు ముక్త కంఠంతో చెబుతున్నారు. గూడు సమస్య తీర్చకపోతే ఈప్రభుత్వం తమ గోరి తామే తవ్వుకుంటుందని.

వి. అనిల

# సుహాసిని, కృష్ణమోహన్‌లకు

# వివాహ శుభాకాంక్షలు



యండమూరి శరత్‌చంద్ర సత్యవతిల

కుమార్తె సుహాసిని, కృష్ణమోహన్‌ల వివాహం

25-11-2007న విశాఖలో

జరిగిన సందర్భంగా

రూ. 10వేలు విరాళంగా

ఐద్వా జిల్లా కమిటీకి అందజేశారు.

నూతన దంపతులకు

ఐద్వా అభినందనలు తెలియజేస్తుంది



65



ఐద్వా 8వ జాతీయ మహాసభలో చంకలో బిడ్డతో
ముదిగొండ ఘటనను వివరిస్తున్న మృతవీరుడు వీరన్న భార్య ఉష

# ఘాపోరాల స్మృతి

పల్లవి: నెత్తురోడిందిరా - ముదిగొండ
ఆరని జ్వాల అది - మదినిండా
కాంగ్రేస్ సర్కార్ గుది బండా
దాని అంతుచూడ కదిలే ఎర్రజెండా

అనుపల్లవి: వీరులు విడిచారు అశువులు
ఈ ఖాకీలు ఎంతటి పశువులు ॥నెత్తు॥

చారెడు నేలకై చింకి పాతల వాళ్ళు
చంకలో బిడ్డతో - ఎర్రజెండై నోళ్ళు
కళ్ళలో కన్నీరుతుడుచుకున్నారు
తమ బిడ్డలకు మీ పేరు పెట్టుకుంటారు ॥నెత్తు॥

వేల ఎకరాల పందేర మొకడిది
బొందకైన నేల - లేదు పేదోడికి
తగదు అన్నందుకే - తీశారు ఉసురు
ముంచెత్త ముదిగొండ - తూటాల ముసురు ॥నెత్తు॥

గద్దెనెక్కేనాడు - పావురాలైనోళ్ళు
గద్దలను తలదన్నె - రాబందులు వాళ్ళు
ఖద్దర్ మాటునా - లాఠీల సాగు
రాష్ట్రమంతటా పారె - నెత్తుటి వాగు ॥నెత్తు॥

అడిగింది ఏముందు - గుడిసె జాగేకదా
కాని కోరిక ఐతె - స్వతంత్రమే వృథా
మూడేళ్ళ ముంగిటా - మురిపాల మాట
ముదిరి ముదిగొండలో - తూటాల వేట ॥నెత్తు॥

వైయస్‌కు ఏం తెలుసు - ప్రాణాల విలువ
పేదావాడే నేడు - ఎక్కాడు శిలువ
ఏసుక్రీస్తు నాకు దేవుడన్నావాడు
రాష్టానికంతటికి - దెయ్యమయ్యినాడు ॥నెత్తు॥

చావు రాసుంటాది - ఎప్పడో అప్పడు
అందుకే అది మాకు - లెక్కలేదెప్పడు
నేడు రుజువైంది - ముదిగొండలో
కొలువు తీరేరయ్యా - మాగుండెలో ॥నెత్తు॥

- కె. దేవేంద్ర



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | cmv01A 122 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 2/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | Sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |